# ప్రకాశకీయము

పరమేశ్వర వాణియైన వేదములలోని సార్వజనిక శాశ్వత ధర్మ సిద్ధాంతములను సామాన్య ప్రజల కందించవలెననునది మా ట్రస్టు మూడవ లక్ష్యము, ఆ లక్ష్యసాధనకై యింతవరకు 22 పుస్తకములు ప్రచురించితిమి. మరియొక రెండు గ్రంథములు ముద్రణ యగుచున్నవి. ఈ గ్రంథ రచయిత పం. సిద్ధగోపాల్ గారు ప్రసిద్ధ ఆర్యవిద్వాంసులు. అత్యంత సరళముగా వైదిక సిద్ధాంతములను ప్రతిపాదించగల నేర్పరులు. వారి రచనా మాధుర్యమును తెలుగు వారి కందించ ఈ గ్రంథమును ప్రచురింప తలపెట్టితిమి.

ఈ గ్రంథమును అనువదించి మాకొసగిన సిద్ధాంతాచార్యులు శ్రీ.పం. లోకామల్హరి గారు ఆర్యులందరకు సుపరిచితులే. ప్రచారకులుగా, పురోహితులుగా, రచయితలుగా వీరు చేసిన, చేయుచున్న సేవలు మీ అందరకు తెలిసినవే. ఈ 85 సంవత్సరములు వృద్ధావస్థలో కూడా ప్రచార పౌరోహిత్యములు కొంత తగ్గినా వారి లేఖినిలోని యౌవనము యిసుమంతయు తగ్గలేదు. రోజంతయు ఏదో పుస్తకములు ననువదించుటలోనే గుడుపుదురు. ఇప్పటికే 20 గ్రంథములు ముద్రించబడినవి. ముద్రణ కావలసి ఉన్న గ్రంథములు మరియొక 20కి పైగానే యుండును. వీటిలో యజు సామాథర్వణ వేదములు భాషా భాష్యములు, వేదోంకా యధార్థ స్వరూప్' అను నాలుగు గ్రంథములు బృహత్‌గ్రంథములు. ఎవరైనా దాతలు ముందుకువచ్చి వాటిని ప్రచురించగలిగిన తెలుగులో వేదాలు మనమంతా చూడగలిగే భాగ్యము కలుగగలదు. వారికి అధికాధిక ఆయురారోగ్యములు నిచ్చి కాపాడవలెనని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథమును అందముగా ముద్రించి యిచ్చిన ప్రింట్‌షాప్, సికింద్రాబాద్ కార్యకర్తలకు, తప్పులు దిద్దియిచ్చిన మా ట్రస్టు కార్యదర్శి శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు మరియు శ్రీ మనస్వీ (ఆర్ష గురుకులం, కామారెడ్డి) గార్లకు నా హృదయపూర్వక ధన్యవాదములు

**కోడూరి సుబ్బారావు**

వ్యవస్థాపకుడు - గాయత్రీ ఆశ్రమట్రస్టు

# ప్రకాశకీయము

పరమేశ్వర వాణియైన వేదములలోని సార్వజనిక శాశ్వత ధర్మ సిద్ధాంతములను సామాన్య ప్రజల కందించవలెననునది మా ట్రస్టు మూడవ లక్ష్యము, ఆ లక్ష్యసాధనకై యింతవరకు 22 పుస్తకములు ప్రచురించితిమి. మరియొక రెండు గ్రంథములు ముద్రణ యగుచున్నవి. ఈ గ్రంథ రచయిత పం. సిద్ధగోపాల్ గారు ప్రసిద్ధ ఆర్యవిద్వాంసులు. అత్యంత సరళముగా వైదిక సిద్ధాంతములను ప్రతిపాదించగల నేర్పరులు. వారి రచనా మాధుర్యమును తెలుగు వారి కందించ ఈ గ్రంథమును ప్రచురింప తలపెట్టితిమి.

ఈ గ్రంథమును అనువదించి మాకొసగిన సిద్ధాంతాచార్యులు శ్రీ.పం. లోకామల్హరి గారు ఆర్యులందరకు సుపరిచితులే. ప్రచారకులుగా, పురోహితులుగా, రచయితలుగా వీరు చేసిన, చేయుచున్న సేవలు మీ అందరకు తెలిసినవే. ఈ 85 సంవత్సరములు వృద్ధావస్థలో కూడా ప్రచార పౌరోహిత్యములు కొంత తగ్గినా వారి లేఖినిలోని యౌవనము యిసుమంతయు తగ్గలేదు. రోజంతయు ఏదో పుస్తకములు ననువదించుటలోనే గుడుపుదురు. ఇప్పటికే 20 గ్రంథములు ముద్రించబడినవి. ముద్రణ కావలసి ఉన్న గ్రంథములు మరియొక 20కి పైగానే యుండును. వీటిలో యజు సామాథర్వణ వేదములు భాషా భాష్యములు, వేదోంకా యథార్థ స్వరూప్' అను నాలుగు గ్రంథములు బృహత్‌గ్రంథములు. ఎవరైనా దాతలు ముందుకువచ్చి వాటిని ప్రచురించగలిగిన తెలుగులో వేదాలు మనమంతా చూడగలిగే భాగ్యము కలుగగలదు. వారికి అధికాధిక ఆయురారోగ్యములు నిచ్చి కాపాడవలెనని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథమును అందముగా ముద్రించి యిచ్చిన ప్రింట్‌షాప్, సికింద్రాబాద్ కార్యకర్తలకు, తప్పులు దిద్దియిచ్చిన మా ట్రస్టు కార్యదర్శి శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు మరియు శ్రీ మనస్వీ (అర్ష గురుకులం, కామారెడ్డి) గార్లకు నా హృదయపూర్వక ధన్యవాదములు

**కోడూరి సుబ్బారావు**

వ్యవస్థాపకుడు - గాయత్రీ ఆశ్రమట్రస్టు

గాయత్రీ గ్రంథమాల 24

ప్రతులు : 1000

సృష్టి సంవత్సరము : 197, 29, 49, 697

దయానందాబ్దము : 171, విక్రమ సం॥ 2052

ధాత సంవత్సరము : 1997

**మూల్యము : రూ. 20/-**

(పోస్టు ఖర్చులు అదనము)

**ప్రతులకు**

1. గాయత్రీ ఆశ్రమము, వ్యాస్‌నగర్ 12-10-586/6 సీతాఫలమండి, సికింద్రాబాద్. 500 061.
2. శ్రీ విద్యా బుక్ డిపో, సుల్తాన్‌బజార్, ఆర్యసమాజము ఎదురుగా.
3. మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, 3-3-738, కంచరిబజార్, సికింద్రాబాద్
4. ఆర్. కృష్ణమూర్తి, బుక్‌సెల్లర్స్, ఆర్యసమాజమందిరము, సీతాఫలమండి - 500 061

ముద్రణ : ప్రింట్‌షాప్, సికింద్రాబాద్.

# విషయసూచిక

ఓ౩మ్

# మున్నుడి

వేదము పరమేశ్వరుని దివ్యవాణి, వైదిక సిద్ధాంతములు సత్యములు, సనాతనములు, శాశ్వతములు. దురదృష్ట వశమున మధ్యకాలమున మానవులు ఈ సత్యమును మరచి మత మతాంతరములందు విభక్తమగుచు విభిన్న మార్గములు ననుసరింప సాగినారు. సత్య సనాతన సిద్ధాంతములు స్థానమున వినాశకరమగు కపోల కల్పిత మాన్యతల నవలంభించసాగినారు. ఒకే ఈశ్వరుని స్థానమున అనేక కల్పిత ఈశ్వరులు, వారిపేర్లతో అనేక సాంప్రదాయములు, వాటి అనేక చిహ్నములు (తిలకములు, ముద్రలు,మాలలు) అనేక అవతారములు, అనేక పూజా విధానములు, అనేక ధార్మిక పంథాలు, అనేక ధర్మ గురువులు అనేక విధములగు గురుమంత్రములు, అనేక విధములగు అభివాదములు ప్రచలితమైనవి. మూలమున అనైక్యత, పరస్పర వైరుధ్యము లను మహా సాగరమున పరమేశ్వరుని శ్రేష్ఠతకు కృతియగు ఈ మానవ సమాజము ముఖ్యముగా ప్రపంచమునకు మకుటమగు ఆర్యావర్తము (భారతదేశము) "ప్రళయంకరమగు అసత్య మేఘములందు సత్య సూర్యుడు మరుగున పడి పోయినట్లు" కంఠమువరకు పూడుకొని పోయినది. ఐనను పరమేశ్వర కృపవలన అజ్ఞాన తిమిరమును తొలగించుచు మహర్షి దయానంద దివాకరుడుదయించెను. మరల జ్ఞాన కిరణములు పృథివిపై నల్దిశల వ్యాపించినవి. అజ్ఞానంధకారము తొలగి పోసాగినది. ఈ జ్యోతిపుంజము యొక్క ప్రకాశమున అజ్ఞానంధకారము నుండి ఎన్నెన్నో మానవజ్యోతులు తమ జ్యోతులను ప్రసరింపజేసి ధన్యజీవనమైనవి.

అట్టి ధన్యజీవులలో శ్రీ.స్వ.పం. కవిరత్న సిద్ధగోపాల్ గారొకరు. వీరు వైదిక ధర్మమును గూర్చి అనేక గ్రంథములను సకల సామాన్యజన గ్రాహకమగు శైలియందు హిందీభాషలో వ్రాసినారు. వీనియందు "దో బహనోంకీ బాతే" అను గ్రంథమొకటి. దీనిని "అక్కాచెల్లెండ్ర ధార్మిక చర్చ" అను పేరుతో నేను తెలుగుభాషలోనికి అనువదించితిని. దీనిని చదివిన పిదప వైదిక ధర్మ సిద్ధాంతములను గూర్చి మనకెంతయో ధార్మిక పరిచయము కలుగగలదని నా విశ్వాసము.

దీనిని చూచిన తోడనే బహుగ్రంథకర్తలు బ్ర.శ్రీ. డా. కోడూరి సుబ్బారావుగారు వ్యాసనగర్ గాయత్రీ ఆశ్రమము సీతాఫలమండి వాస్తవ్యులు దీని ముద్రణ భారమును వహించినారు. వీరికి మరియు గాయత్రీ ఆశ్రమట్రస్టు కార్యవర్గమునకు నా కృతజ్ఞతాపూర్వక అభివందనలు. పరమేశ్వరుడు ఇట్టి ధార్మిక కార్యములను విరివిగా నొనర్చుటకు వీరికి చక్కని ఆరోగ్యభాగ్యములను ప్రసాదించుగాక.

ఇట్లు

వైదిక ధర్మానుయాయుల చరణధూళి

**సిద్ధాంతాచార్య లోకామల్హరి,**

ఆర్యనగర్, ఇందూరు - 503 001

ఓ౩మ్

# ఈశ్వరు డున్నాడా లేడా ?

(మొదటి దినము : ప్రాతఃకాలము)

**ఇందిర : -** అక్కయ్యా ! ప్రతి దినము ఈశ్వర ప్రార్థన చేయవలెనని నీవనుచుందువు. ఈశ్వరుడెచట నున్నాడని ఆయనను ప్రార్థింతును? ఆ విషయమే ఇప్పుడు నేనడుగుచున్నాను. నా సంశయమును తీర్చుము.

**సువర్ణ : -** ఈశ్వరుడు అంతట వ్యాపించి యున్నాడు. ఆయనలేని చోటేదియును లేదు.

**ఇందిర : -** ఈశ్వరుడు సర్వత్ర నిండియున్నప్పుడు మిగతా వస్తువులన్ని ఎచ్చట నుండగలవు? ఉన్న స్థలమంతయును ఈశ్వరుడే ఆక్రమించుకొన్నాడు గదా! ఇక ఖాళీ స్థలమేది? మిగతా వస్తు సముదాయమంతయు స్థలము లేకుండానే ఎట్లుండగలదు?

**సువర్ణ : -** సోదరీ! ఈశ్వరుడు లేని స్థలమేదియు లేదు. నా ఉద్దేశ్యమేమన, ఆయన సకల స్థానములందును కలడు. వార్తాలాపములందే ఆయనలేని స్థలమేదియునుండదని అనుకొనుచుందుము. ప్రాకృతిక పదార్థములు స్థలము నాక్రమించును. పృథివి, జలము, అగ్ని, వాయువు మరియు వాని పరమాణువు లన్నియు స్థలమునాక్రమించును. ఈశ్వరుడీ సమస్త పదార్థములందును వ్యాపించియున్నాడు. కావుననే ఈశ్వరుడు సర్వత్ర నిండియున్నాడని యనెదము.

**ఇందిర : -** సరే! ఈశ్వరుడంతట నిండియున్నచో ఆతడు ఎందుకు కానరాడు?కన్పించనప్పుడు ఆయన ఉన్నాడనుటకు ప్రమాణమేమి?

**సువర్ణ : -** ఐతే మనకన్నులకు కన్పించని వస్తువులుండవనియేనా? ప్రపంచమునందెన్నియో పదార్థములుండియున్నను వానిని మనము చూడలేము. అవి మన కంటికి కన్పించవు. శీతలము, ఉష్ణము, సుఖము, దుఃఖము, సమయము, దిశలు, ఆకలి దప్పులు, దురద, నొప్పులు మున్నగువానిని మనము చూడగలమా? ఏ వస్తువైనను కన్పించకపోవుట కనేక కారణములుండును. ఉండగలవుకూడా. ప్రపంచములో అనేక వస్తువులు

దూరమున నుండు కారణమున మనకు కన్పించవు. యూరోపు, ఇంగ్లాండు, అమెరికా, రష్యా వంటి దేశాలు ప్రపంచమున లేవా? ఇచ్చటి నుండి మనము వానిని చూచుచున్నామా? గాలిపటములు పక్షులు దూరముగ ఎగిరిపోయినందున వానిని మనము చూడజాలము. ఇంకా అతి సమీపముననున్న అనేక వస్తువులను మనము చూడలేము. మన కన్నులకు పెట్టుకొనిన కాటుక మనకు కన్పించదు. అనేక వస్తువులు అత్యంత సూక్ష్మముగ నుండు కారణమున కూడా మనము వానిని చూడలేము. పరమాణువులను మరియు సూక్ష్మ కీటాణువులను మనము భూతద్దము సహాయముననే చూడగలము. నాచుతో కప్పబడియున్న నీటిని మురికి పట్టియున్న అద్దమును, గోడ అడ్డముగనున్న కారణమున దాని యావలనున్న మనుష్యులను, వస్తువులను, సమాన గుణముగల వస్తువులు-అనగా పాలయందు గలిసిన నీరును (అది పాలలో కలిసిపోయినందున) మనము చూడజాలము. మన కన్నుల యందేదేని దోషము గలిగినప్పుడు అనేక వస్తువులను మనము చూడజాలకపోవుచున్నాము. మన కన్నుల యందే చేరియున్న పచ్చ, తెల్ల కామెర్ల వ్యాధిని మనము చూడగలుగుదుమా? మనము చూడజాలని వస్తువులు లేనేలేవని యనుకొనుట పొరపాటుగాదా!

**ఇందిర :** - కన్నులతో చూడజాలని వానిపై నాకింకా విశ్వాసము గలుగుటలేదు.

**సువర్ణ :** - ఇది నీ అజ్ఞానము మాత్రమే. అనేక వస్తువులుండియును మన కన్నులకు కన్పించని వెన్నియో గలవని నీకు చెప్పితిని. మనము చూడజాలనట్టి వానినెన్నిటినో విశ్వసించవలసియే యుండును. మంచిది. నేను చెప్పువానిని నీవు వినుచున్నావా, లేదా?

**ఇందిర :** - వినుచున్నాను.

**సువర్ణ :** - దేని ద్వారా వినుచున్నావు?

**ఇందిర :** - చెవుల ద్వారా

**సువర్ణ :** - నేనే శబ్దములను చెప్పుచున్నానో అవి ఉన్నవా? లేవా?

**ఇందిర :** - ఉన్నవి. ఎందుకు లేవు?

సువర్ణ : - ఐతే నీవు వానిని కన్నులతో ఎందుకు చూచుటలేదు? ఇంకా వినుము నా చేతిలోనున్నదేపుష్పము?
ఇందిర : - రోజా (గులాబీ) పుష్పము.
సువర్ణ : - దీనియందు సుగంధము గలదా లేదా?
ఇందిర : - ఉన్నది.
సువర్ణ : - ఉన్నదని నీకెట్లు తెలిసినది?
ఇందిర : - నాసికము ద్వారా.
సువర్ణ : - రాత్రి నీవు త్రాగిన పాలలో పంచదార కలదా?
ఇందిర : - కలదు.
సువర్ణ : - కలదని నీ కెట్లు తెలిసినది?
ఇందిర : - నాలుక ద్వారా
సువర్ణ : - ఇప్పుడు చెప్పుము. శబ్దముల జ్ఞానము చెవుల ద్వారా, సుగంధ జ్ఞానము నాసిక ద్వారా, రుచి జ్ఞానము నాలుక ద్వారానే ఎందుకు కలిగినది? కన్నులు శబ్దముయొక్క, చెవులు సుగంధము యొక్క, ముక్కు రుచియొక్క జ్ఞానమునెందుకు పొందలేదు. సుగంధము, తీపి, శబ్దముల జ్ఞానమును కన్నులెందుకు పొందలేదు? వానిని కన్నులెందుకు చూడలేవు?
ఇందిర : - ఏ ఇంద్రియమునకు విషయమైన జ్ఞానమును ఆ యింద్రియము పొందును. ఈశ్వరుడే యింద్రియమునకు విషయముకాదు. కావున ఆయన ఏ యింద్రియము ద్వారాను తెలిసికొనబడడు. ఐతే ఆయన యునికినెట్లు అంగీకరించవలెను?
సువర్ణ : - 'ఈశ్వరుడు కన్పించడు కావున అతడు లే'డను నీ వాదమును కొద్ది సేపటిలోనే మార్చివేసినావు. మంచిదే. కన్నులకు కన్పించని వస్తువులు కూడా ఉండునని నీ వొప్పుకొనినావు. వాని జ్ఞానమునకు కన్నులు, ముక్కు, చెవులే గాక వేరే ఇంద్రియ సంబంధముండవచ్చుననునది వేరు విషయము. ఈశ్వరుడు ఏ యింద్రియము ద్వారా కూడా తెలిసికొనబడడని నీ వొప్పుకొనుచున్నావు. "ఐతే ఆయన ఉన్నాడని ఎట్లు నమ్మవలె" ననిగదా నీ సందేహము? ఇంద్రియముల ద్వారా తెలిసికోలేని కారణమున ఈశ్వరుని యునికిని నీవు విశ్వసించుట లేదు.

ఔనా! ఐతే, నీవు ఇంద్రియముల నెట్లు తెలిసికొంటివి? ఇంద్రియములను ఇంద్రియముల ద్వారానే తెలిసికొంటినని నీవనెదవు. ఇది ఆత్మాశ్రయ దోషము. ఏలన ఏ ద్రష్టయు తానే దృశ్యము కాజాలడు. అట్టిచో ఇంద్రియములు ఇంద్రియముల నెట్లు తెలిసికొనగలవు? ఇంద్రియములే ఇంద్రియములకు విషయములు కావుగదా! కన్నులకు రూపము, చెవులకు శబ్దము నాసికకు గంధము, జిహ్వకు రసము, త్వచ (చర్మము)కు స్పర్శ స్వవిషయములు. ముక్కు కన్నులను, జిహ్వ చెవులను తెలిసికొనలేవు.

**ఇందిర** : - ఎందుకు తెలిసికొనలేవు? అద్దము చేతబట్టుకొని చూచుకొనునప్పుడు ముఖము, కన్నులు, చెవులు, నాలుక మున్నగు సర్వేంద్రియములు కాన్పించును. నేత్రములు మిగతా సకలేంద్రియముల జ్ఞానమును పొందగల ఇంద్రియములు గదా!

**సువర్ణ** : - సోదరీ! పొరపడుచున్నావు. కన్నులతో నీవు చూచుచున్నది కేవలము రూపము మాత్రమే. ఇతర ఇంద్రియముల విషయములను గాదు. అద్దము ద్వారా ఇంద్రియములెచ్చట గన్పించును? ఇంద్రియముల స్థానమున వానికాధార భూతములైన రూపములను మాత్రమే చూడగలవు. ఆ స్థానములందు ఇంద్రియములు అజ్ఞాత రూపమున నున్నవి. కన్నులు సర్వేంద్రియముల జ్ఞానము నెచ్చట చూడగలవు? అవి స్వయముగ తమ్ము తాము చూచుకొనలేవు. అద్దము ద్వారా నేత్రములను చూడగలిగినచో నేనొక మాట యడిగెదను చెప్పుము. నా చేతి యందేమున్నది?

**ఇందిర** : - అద్దము.

**సువర్ణ** : - ఈ యద్దమును దేనితో చూచితివి?

**ఇందిర** : - కన్నులతో.

**సువర్ణ** : - మంచిది. కన్నులతో అద్దమును చూచితిని. అద్దమును చూచుటకు పూర్వము కన్నుల జ్ఞానమునీకుండెను. దీని యుద్దేశ్యమేమన కన్నులు లేకున్నచో అద్దమును నీవు చూడలేకపోవుదువు. ఇప్పుడు చెప్పుము కన్నులతో అద్దము జ్ఞానమేర్పడినదా, లేక అద్దము ద్వారా కన్నుల జ్ఞానమా? ఒకవేళ అద్దము ద్వారా కన్నుల జ్ఞానమేర్పడుచో కన్నులు పగిలిపోయినను

అద్దము వాని జ్ఞానమును తప్పక కలిగించగలదు. కన్నులు పోయినచో అద్దము కన్నుల జ్ఞానమటుంచి స్వయముగా తన జ్ఞానమునైనను చేయించజాలదు. కొంత లోతుగా ఆలోచించితివేని కన్నులు కూడ సాధనముల సహాయముతో మాత్రమే వస్తువులను చూడగలవు. కాని స్వతంత్ర రూపమునచూడజాలవని నీకు తెలియగలదు. వాస్తవముగా రూప జ్ఞానము కన్నులు లేకుండ కలుగజాలదు. కాని ఆ రూపముయొక్క జ్ఞానమును గూడ కన్నులు స్వయముగ పొందలేవు.

**ఇందిర :** - కన్నులకు ఏ సాధనములవసరము? అవి స్వతంత్ర రూపముననే చూచునుగదా? కన్నుల విషయము చూచుటయే గదా! కొంత వివరించి చెప్పుము. కన్నులు స్వతంత్ర రూపమున నేల చూడలేవు?

**సువర్ణ :** - చూచుటకు కేవలము కన్నులేగాదు. అందుకు ప్రకాశము గూడ ఉండవలెనని తెలిసికొనుము. ప్రకాశములేకున్నచో కన్నులుండియును మనము గ్రుడ్డివారమే. కన్నులు, ప్రకాశము ఈ రెండు వస్తువులుండియును చూడదలచిన వస్తువు ఒక నిశ్చిత స్థానమున లేనప్పుడును మనము దానిని చూడలేము. ఇందిగో ఈ పుస్తకమున్నదిగదా! ఇందలి అక్షరములను నేను ఒక పర్లాంగు దూరమునుండి చూడదలచియును చూడలేను. ఇంతేగాదు. దీనిని అతి సమీపమున అనగా కన్నులపై నుంచికొనియును చూడజాలను. అక్షరములను చూచుటకును, చదువుటకును ఒక నిశ్చిత స్థానము గావలెను. అప్పుడే అక్షరములను సరిగా చూచుట, చదువుట సాధ్యమగును. ఇంకా వినుము. కన్నులు ప్రకాశము, నిశ్చిత స్థానము ఇవన్నియును సక్రమముగా నుండియును మనస్సు సంబంధము ఆ కన్నులతో లేనప్పుడు కూడ కన్నులు చూడజాలవు. ఒకవేళ మనస్సు ఇతర కార్యములందు తగులుకొని యున్నప్పుడు కన్నుల ముందరి నుండి ఏ వస్తువైనను కదలింపబడినను కన్నులు దానిని చూడజాలవు. ఇది అందరికి అనుభవమే. చాలవరకిట్లు జరుగుచుండును. కన్నుల ముందరి నుండి ఏదో ఒక వస్తువు కదలింపబడినది. ఎవరో వచ్చి "నీవు ఆ వస్తువును చూచితివా?" అని యడిగినప్పుడు " ఏమో నండి. నేను ధ్యానము నుంచలే"దని నీ వందువుగదా!

**ఇందిర :** - ఔను! ఇన్ని ఉదాహరణములనిచ్చుటలో నీ ఉద్దేశ్యమేమి?

**సువర్ణ :** - ఇంకా నీకు అర్థము గాలేదన్న మాట. దీని అభిప్రాయమేమన, ఇంద్రియముల ద్వారా పరమేశ్వరుని తెలిసికొనజాలము. ఇంతేగాదు. ఇంద్రియములను కూడ ఇంద్రియముల ద్వారా తెలికొనలేము. ఐనను ఇంద్రియములున్నవని నమ్మవలసియే యుండును. అట్టిచో ఈశ్వరుని నమ్ముటయందే సందేహమెందుకు?

**ఇందిర :** - ఇంద్రియములెట్లు తెలిసికొనబడును?

**సువర్ణ :** - ఇంద్రియములను జీవాత్మ తన అనుభవము ద్వారా తెలిసికొనును. శబ్ద స్పర్శ రూప రస గంధముల జ్ఞానమును పొందినపుడు జీవాత్మ ఇంద్రియములు తనకు సాధనములుగా నున్నట్లును, వానితో తాను కార్యమును సాధించుకొనుచున్నట్లును తెలిసికొనును.

**ఇందిర :** - ఈశ్వరుడెట్లు తెలిసికొనబడును?

**సువర్ణ :** - ఈశ్వరుడు కూడ అనుభవము ద్వారానే తెలిసికొనబడును.

**ఇందిర :** - ఈశ్వరుని అనుభవ మెవరికి కలుగును?

**సువర్ణ :** - ఆత్మకు మాత్రమే పరమాత్మ అనుభూతి కలుగును.

**ఇందిర :** - ఈయనుభూతి ఎప్పుడు కలుగును?

**సువర్ణ :** - మనస్సులోనుండి మూడు విధములగు దోషములు దూరమైనపుడు.

**ఇందిర :** - ఈ ముప్విధములగు దోషములేవి?

సువర్ణ : - "మలము, విక్షేపము, ఆవరణ" మనునవియే ఆ మూడు దోషములు.

**ఇందిర :** - దీనిని ఇంకా నిర్వచించి చెప్పుము.

**సువర్ణ :** - మనస్సునందు ఇతరులకు హాని గలిగించు ఆలోచనలు. ఆత్మపైబడు పాపముల సంస్కారములు మలము, సదా విషయముల చింతన మొనర్చుట, మనస్సును స్థిరముగ నుంచని స్థితి విక్షేపము. నశ్వర ప్రాపంచిక పదార్థముల అభిమానము అను తెరలు (పరదా) మనస్సుపై బడుటయే ఆవరణము.

**ఇందిర :** - ఈ ముప్విధములగు దోషముల నెట్లు దూర మొనర్చుకొనగలము?

**సువర్ణ :** - వీనిని దూరమొనర్చుకొనుటకు 'జ్ఞాన కర్మ ఉపాసన'లను మూడు సాధనములత్యంతావశ్యకములు.

**ఇందిర :** - జ్ఞాన కర్మ ఉపాసనల అభిప్రాయమేమి?

**సువర్ణ :** - ఏ పదార్థమెట్లు గలదో దానినట్లే తెలిసికొనుట, అనగా జడమును జడముగా, చేతనమును చేతనముగా, నిత్యమును నిత్యముగా, అనిత్యమును అనిత్యముగా తెలిసికొనుట జ్ఞానము. శరీరము, సమాజము, ఆత్మ వీనియున్నతి కొరకు ఆపదార్థముల ప్రాప్తికొరకు ప్రయత్నించుట కర్మ. ఆ పదార్థముల వద్దకు చేరి వాని గుణములతో తన దోషములను సరిదిద్దుకొనుట ఉపాసన. ఒక మనుష్యుడు చలితో బాధపడుచున్నాడని యనుకొనుము. ఆ చలిని తొలగించుకొనుటకు అగ్ని అవసరమని తెలిసినప్పుడు అతడు అగ్ని ప్రాప్తికొరకు ప్రయత్నము (కర్మ) నొనర్చవలెను. తరువాత అగ్ని సమీపమునకు చేరి శీతల రూప దోషమును అగ్ని గుణమగు ఉష్ణముతో తొలగించుకొనవలెను. తాత్పర్యమేమన జ్ఞానముతో మలమును, కర్మ ద్వారా విక్షేపమును, ఉపాసన ద్వారా ఆవరణమును దూరమొనర్చుకొనినప్పుడే పరమాత్మయొక్క అనుభూతి కలుగగలదు.

**ఇందిర :** - అక్కయ్యా! ఇది చాల చిక్కుగా తోచుచున్నది. జ్ఞానముతో మలము, కర్మద్వారా విక్షేపము, ఉపాసనచే ఆవరణ దోషములెట్లు దూరమగునో కాస్త వివరించి చెప్పమ్మా!

**సువర్ణ :** - సకల ప్రాణులు, సకల పదార్థములు నశించునవే. కావున ఇతరుల అధికారమును కాజేయు భావనను తొలగించుకొనుట ద్వారానే మలము యొక్క దోషము దూరమగును. ఒకని మనస్సునందు 'విక్షేపము' అనగా చంచలత్వము ప్రాపంచిక పదార్థములను జీవనోద్దేశ్యముగ భావించి వానిని అనుభవించునపుడే ఉత్పన్నమగును. ప్రపంచమునందలి పదార్థములు వాస్తవముగా సాధనములు మాత్రమే. కాని సాధ్యములు అనగా జీవనోద్దేశ్యములు కావు. ఈ సిద్ధాంతములను తెలిసికొని చేయబడు కర్మ మనుష్యుని 'జలమునందలి కమలమువలె' ప్రాపంచిక మమకారమునందు లిప్తముగానీయదు. నిష్కామ కర్మచే 'విక్షేప' దోషము దూరమగును. మనుష్యుని మనస్సుపై

అహంకారము లేక అభిమానము అను ఒక తెర యుండును. దానివల్ల నాతడు పరమాత్మ ప్రసాదించిన ఈ వస్తువులన్నియు తనవియే అనుకొనును. నా ధనము, నా భార్య, నా బలము, నా రాజ్యము, నా అధికారము అను అభిమానముతో పాటి మానవులను బాధించుచుండును. నా కన్న గొప్పవాడే లేడని భావించును. ఐనను అతడు జ్ఞానపూర్వక కర్మలొనర్చుచు మనస్సు మరియు ఇంద్రియములను బయటి విషయములనుండి తొలగించి తన శక్తులను హృదయమునందు ఏకాగ్రమొనర్చుకొని "పరమాత్మ నా సమీపమునందే యున్నాడు. నేనాయన సమీపమునందే యున్నా"నని తెలిసికొనినప్పుడు అతని అహంకారము అనగా 'ఆవరణ'మను దోషము దూరమగును. ఈ విధముగా మూడు దోషములను మూడు సాధనముల ద్వారా దూరమొనర్చుకొనుటకు నిరంతరము అభ్యాసమొనర్చినచో అది పరమాత్మ అనుభూతిని గలిగించును.

**ఇందిర :** - అక్కయ్యా! చక్కగా వివరించి మనస్సునకు తృప్తి గలుగునట్లు నీవు చెప్పు పద్ధతి నీచాతుర్యమును చాటుచున్నది. తెలియ కడుగుతాను. ఈ ప్రపంచమునకు ఈశ్వరుని అవసర మేమి?

**సువర్ణ :** - చెల్లెలా! ప్రపంచమునకు ఈశ్వరుని అవసరమేలేదా? వినుము. ఈశ్వరుడు లేకున్న ఈ విశ్వ మెట్లు నిర్మింపబడెడిది? ఈ పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, తారాగణము, సముద్రములు, నదీనదములు, సరోవరములు, ప్రవాహములు, పర్వతములు, వనములు, ఉపవనములు, లతలు, తరువులు, గుల్మములు, పుష్పములు, ఫలములు, ఓషధులు, తేనె, సమస్త ఆహార ధాన్యములు, అనేక విధములగు వస్తువులు, అనేక విధములగు ఋతువులు, మనుష్యులు, పశువులు, మృగములు, పక్ష్యాదులు, భూచరములు, జల చరములు, నుభయచరములు, జరాయుజములు, అండజములు, ఉద్భిజములు, స్వేదజములు మున్నగు అనేక విధములగు యోనులు మరియు నితర సమస్త పదార్థములను ఈశ్వరుడుగాక ఇంకెవరు చేయగలరు?

**ఇందిర :** - ఈ పదార్థములను నిర్మించుటకు ఈశ్వరుని అవసరమేలేదు. ఇవి స్వయముగానే నిర్మాణమైనవి ఎల్లపుడును ఉండగలవు.

సువర్ణ : - విశ్వమునం దే పదార్థమైనను నిర్మాత లేకుండా నిర్మాణము కాదని నీకు తెలియదా? మిఠాయివాడు చేయనిదే మిఠాయీలు, వంటవాడు చేయనిదే వంటకములు, కుమ్మరి చేయనిదే కుండలు, కమసాలి లేకయే ఆభరణములు, దర్జీవాడు కుట్టకున్న మనము ధరించు ఉడుపులు మున్నగునవి స్వయముగానే నిర్మాణము కావలెనుగదా! మనుష్యులు నిర్మించిన ఏ వస్తువైనను సదా ఉండజాలదు. ప్రతి పదార్థమునందు ఉత్పన్నమగుట, వృద్ధియుగుట వృద్ధియై పరిమితకాలము వరకు నిలిచియుండుట, మారుట, తరుగుట, చివరికి నష్టమై పోవుట అను ఈ ఆరు వికారములు జరుగుచునే యుండును. ఈ అత్యున్నత పర్వతములు, మహావృక్షములు అతికాయముగల పశువులు, మృగములు, మరియు విశ్వమందలి అత్యున్నత, అత్యల్పమగు వస్తువులన్నియును ఉత్పన్నమగును. వాని కాలము తీరగానే అవి నశించిక తప్పదని తెలిసికొనుము.

ఇందిర : - పరమాత్మ ఎచ్చటను ఏ వస్తువునైనను చేయుచున్నట్లు కనబడుటలేదు. సకల పదార్థములు స్వయముగానే ఉత్పన్నమై కొంత కాలమునకు స్వయముగనే నష్టమై పోవుచుండుటను మనము చూచుచున్నాము. ఈ క్రమము సదా నడచుచునే యున్నది. పృథివి, అగ్ని, జలము, వాయువు మరియు అనేక పరమాణువులు సిద్ధముగా నుండి పరస్పరము కలిసికొని పదార్థముల ఉత్పత్తికి కారణమై కొంత కాలమునకు వీడిపోయినందున పదార్థములు నశించుచున్నవి. ఇందులో ఈశ్వర సంబంధ మేమున్నది?

సువర్ణ : - నీ యాలోచన భ్రమ పూర్వకముగనున్నది. పృథివి మున్నగు తత్త్వములు వాని పరమాణువులు, జడములు అవి కలుపబడనిదే స్వయముగా కలియజాలవు. వేరుచేయనిదే విడిపోజాలవు. కలుపుట, విడదీయుట ఈ రెండును విపరీత గుణములు. అవి జీవములేని ఏ జడ పదార్థములోను ఒకే చోటనెట్లుండగలవు. ఏ జడ పదార్థమునందైనను ఎన్నో గుణము లుండవచ్చును. కాని రెండు విరుద్ధ గుణములు మాత్రముండజాలవు. ఏ పదార్థమునందైనను కలిసిపోవు స్వభావమున్నచో కలిసిపోవుచునే యుండును. వేర్వేరుగా నుండు స్వభావమున్నచో అది ఎప్పుడును కలువదు. ప్రకృతిలో కొన్ని కలిసియుండు స్వభావములు గలవి కాగా కొన్నిటి స్వభావము వేరుగ నుండు నన్నచో ఏ

వస్తువుల ప్రాబల్యముండునో ఆ వస్తువుల కనుకూలముగనే కార్యము జరుగును. ఒకవేళ కలిసిపోవు తత్త్వముల ప్రాబల్యమధికముగనున్న అవి జగత్తునకెప్పుడును హాని కలుగనీయవు. చెరచు తత్త్వముల ప్రాబల్యమధికముగ నున్నచో అవి జగత్తునెప్పుడును ఏర్పడనీయవు. అట్లుగాక సమానముగా నుండు స్వభావము గలవేని రెండు తత్త్వములు గలిసినచోట రెండు తత్త్వములు విడిపోవును. అట్లైనచో ఏ వస్తువుగూడ నిర్మాణముగాజాలదు. కాని ప్రపంచములో ప్రతి వస్తువు నిర్మాణమగుట, స్థిరపడియుండుట, నష్టమైపోవుట చూడబడుచున్నది. ప్రకృతి తత్త్వములందు నీ వెన్ని గుణకల్పనలు చేసికొనినను నియమ పూర్వకముగా జరుగువాని ఉత్పత్తి, స్థితి, ప్రలయములలో ఈశ్వరుని ప్రమేయములేనిదే సంభవముగాదు. జడ చేతనములందుగల భేదమేమనగా జడవస్తువు కార్యమును చేయనే చేయజాలదు. ఒకవేళ చేతనము సహాయముతో ఏదేని కార్యమొనర్చినను ఒకే విధమగు కార్యమును చేయుచుండగలదు. చేతన మనగా జ్ఞానముగలది. ఏ కార్యమైనను చేయుట, చేయకుండుట లేక విపరీతముగ చేయుటయనునవి చేతనముల స్వాభావిక గుణములు.

**ఇందిర :** - ఏదేని వస్తువును నిర్మించువాడు ప్రత్యక్షముగా మనకు కన్పించును. ఆభూషణముల నిర్మాత కమసాలి, మట్టి పాత్రల నిర్మాత కుమ్మరి మున్నగువారు, గూళ్లను నిర్మించుకొను పక్షులు ఇవన్నియును మనకు కనిపించును. ఐతే ఈ సృష్టిని నిర్మించు పరమేశ్వరుడొకడున్నచో మనకు కనిపించెడి వాడే గదా!

**సువర్ణ :** - నిర్మాత లేదా కర్త మనకెప్పుడును కనిపించడు. కమసాలి, మిఠాయి వాడు, కుమ్మరి మున్నగువారు కనిపించుననునది సంపూర్ణముగ అబద్ధము. ఎట్లందువేమో వినుము. కమసాలి, కుమ్మరి, మిఠాయి చేయువారందరును రెండు వస్తువులతో నిర్మాణమైనవారే. అందొకటి భౌతిక శరీరము, రెండవది అమరమైన జీవాత్మ. శరీరము జీవాత్మ కేమగును? అది జీవాత్మ కార్యమొనర్చుట కొక సాధనము మాత్రమే. జీవాత్మ ఈ శరీరరూప సాధనమును ఉపయోగించునప్పుడే అది ఏమైన చేయగలదు. ఒకవేళ ఈ సాధనమును ఉపయోగించనిచో ఏమియును సిద్ధముగాదు. ఇప్పుడు

కొంచెమాలోచించుము. కమసాలి, కుమ్మరి, మిఠాయి చేయువారల శరీరములు మనకు కాన్పించును. శరీరము కార్యమునొనర్చుట కొక యంత్రము మాత్రమే. అది పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములను పంచతత్త్వములతో నిర్మాణమైనది. కాని ఈ శరీరముచే కార్యమును చేయించు కర్తయగు జీవాత్మ మనకు కాన్పించలేదు. దాని శక్తులు సీమితము. కావుననే పరమాత్మ దానికొక 'శరీర'మను సాధనము నిచ్చును. అదియే మనకు గాన్పించునది. పరమాత్మ అపరిమేయుడు, అనంతుడు, సర్వవ్యాపకుడు. ఆయన శరీరము మున్నగు అవయవములు లేకయే సమస్త కార్యములను చేయును. ఈ యిరువురు కర్తలును అనగా జీవాత్మ రూప అల్పజ్ఞుడగుకర్త, మరియు పరమాత్మ రూప సర్వజ్ఞుడు, సర్వశక్తి మంతుడగు కర్త మనకు కన్పించరు.

**ఇందిర :** - శరీరములేని పరమాత్మ ఈ ప్రపంచము నెట్లు నిర్మించగలడు? శరీరములేక ఏ కార్యముగాని, క్రియగాని కాజాలదు గదా!

**సువర్ణ :** - ఇప్పుడు చర్చించుకొనుటకు మనమేర్పరచుకొనిన సమయము ముగిసినది. వంట వార్పుల పని చేసికొనవలెనుగదా! ఇంతటితో నేటి చర్చ సమాప్తము. రేపు మాట్లాడుకొందము.

**ఇందిర :** - సరే! రేపే మాట్లాడుకొనవచ్చును. నమస్తే.



**' ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్'**

**(యజు. 40 - 1)**

అణువు మొదలు బ్రహ్మాండముల వరకు గల ఈ గతిశీలమగు విశ్వమంతయు ఈశునిచే - అనంత ప్రజ్ఞా సామర్థ్యములుగల ఒక అద్భుత నియామక శక్తిచే వ్యాప్తమైయున్నది. ఆ నియామక శక్తియే పరమేశ్వరుడు

# ఈశ్వరుడు సృష్టికర్తయా?

రెండవ దినము: ప్రాతఃకాలము

**ఇందిర :** - అక్కయ్యా! నిన్నటి ప్రశ్నకు సమాధానమిమ్ము.

**సువర్ణ :** - చెల్లెమ్మా! "పరమాత్మకు శరీరమే లేనప్పుడు సృష్టిరచననెట్లు చేయగలడు? ఏలన. శరీరము లేనిదే ఏలాటి క్రియగాని, కార్యముగాని జరుగజాలదు గదా?" అనునదే గదా! నిన్నటి నీ ప్రశ్న? ఇదియును నీ భ్రమయే. చేతన పదార్థము తానున్న చోటినుండియే క్రియ చేయుచు క్రియనందించు చుండగలదు. అదిలేనిచోటనే శరీరము మున్నగు సాధనము లవసరము. చూడుము. నేనీ పుస్తకమును పైకి లేపుచున్నాను. దేనితో లేపితినో చెప్పుము.

**ఇందిర :** - చేతితో

**సువర్ణ :** - ఒకవేళ చేయిలేకున్నచో నేనీ పుస్తకమును లేపగలిగెడిదాననా?

**ఇందిర :** - లేదు.

**సువర్ణ :** - మంచిది. చేయి పుస్తకమును లేపినది. మరి చేతినెవరు లేపినారు?

**ఇందిర :** - చేతిని దాని శక్తియే లేపినది.

**సువర్ణ :** - ఇప్పుడు నేను నా శరీరమంతటిని కదలించుచున్నాను. దీని నెవరు కదలించిరో చెప్పుము.

**ఇందిర :** - శరీరముకూడ తన శక్తివలననే కదలినది.

**సువర్ణ :** - శరీరము లేకున్న ఏ క్రియయును జరుగదంటివిగదా! శరీరము లేకయే దీనికి కదలిక ఎట్లు కలిగినది? దీని వల్ల చేతనము, చేతనశక్తి ఎచ్చటెచ్చట నుండునో అచ్చటచ్చట దానికి శరీర మవసర ముండదని మనకు తెలిసినది. జీవాత్మ శరీరములోపల నున్నందున అది శరీరమును క్రియాన్వితముచేయును. మరియు శరీరమునకు బయటనున్న పదార్థములలో శరీరము ద్వారా క్రియను గలిగించును. ఏలన అచ్చట జీవాత్మ లేదుగదా!

పరమాత్మలోపల, బయట, సర్వత్ర వ్యాప్తమై యున్నాడు. కావుననే శరీరమునకు దాని యవసరముండదు. పరమాత్మ విశ్వమంతటను వ్యాపించియున్న కారణమున విశ్వమంతటిని క్రియాన్వితము చేయుచుండును.

**ఇందిర :** - కుమ్మరి, కమసాలులవలె రూపముగలవారే రూపముగల వస్తువులను నిర్మింతురు. కాని నిరాకారుడగు పరమాత్మ జగత్తునెట్లు నిర్మించగలుగును?

**సువర్ణ :** - రూపముగల కర్తలెవ్వరును మనలోపల నున్న వస్తువులను నిర్మింపజాలరు. వారు కేవలము బయటి వస్తువులను మాత్రమే నిర్మింప గలుగుదురు. బయటి వస్తువుల నిర్మాణమునకై కాలు సేతుల అవసర ముండును. కాని లోపలివానికి కాదు. పరమాత్మకు ఏ వస్తువుకూడ బయటలేదు. కావుననే ఆయునకు శరీర మనవసరము. మిఠాయివాడు తనకు బయటనుండువానినే చేయగలడు. ఒకవేళ వాడు తన శరీరమునందే చేయుట ప్రారంభించినచో వానిని తినువారెవ్వరు? అతనికి కాళ్ళు చేతులు మున్నగు అంగముల అవసర మేముండును? శరీరములోపల నుండు రసము, రక్తము, మాంసము, ఎముకలు మున్నగు పదార్థములు కాలుసేతుల సహకారము లేకయే నిర్మాణమగుచున్నవికదా? ఒక్క విషయము బాగా ఆలోచించుము. ఇంద్రియములు బయటివస్తువులనే చేయగలవు. బయటి వస్తువులను మాత్రమే చూడగలవు. ఒకవేళ లోపలి వస్తువులను చూడగలిగినచో మనగతి ఏమగునో తెలియునా? కన్నులు లోపలి మలమూత్రములను రక్త మాంసములను చూడగలిగినచో ఎంత అసహ్యము గలుగును? మన జీవితమే ఎంతో హేయముగా మారిపోవును. ఇంద్రియములు బయటి వస్తువులనే చూడగలవు. కావున నిది ఈశ్వరుని అపారకృపయే.

**ఇందిర :** - నిర్మాత తాను నిర్మించిన వస్తువులందును వ్యాపకమై యుండును గదా గడియారములను చేయువాడు గడియారములను నిర్మించును. గడియారములు, వాని నిర్మాత వేరువేరుగానే యుందురు. కుమ్మరి కుండల నిర్మించును. పాత్రలు, కుమ్మరి వేర్వేరుగానే యుందురు. కాని పరమాత్మ సర్వత్ర వ్యాపించియుండును. సర్వమును నిర్మించుచుండును. ఇది ఎట్లు

సాధ్యమగును? రెండవది కాళ్ళు చేతులు లేకయే జగత్తు ఎట్లు చేయబడగలదో నా కింకా తలకెక్కుటయేలేదు.

సువర్ణ : - గడియారముల నిర్మాత, కుమ్మరి మున్నగు వారు ఏకదేశీయులు. అల్పజ్ఞులగు కర్తలు మాత్రమే. వారి కర్తృత్వ బాధ్యత, వారి నిర్మాణము ఆ పదార్థముల వరకే పరిమితము. వారు లేనిచోట వానితో సంబంధముగల క్రియలే యుండవు. గడియారములను చేయువాడు వానిని సిద్ధపరచినాడు. సిద్ధపరచుట యనగా వాని చిన్నచిన్న భాగములను పరస్పరము కలిపి వానికి క్రియాశక్తి నిచ్చినాడు. అతడు వాని భాగములను మాత్రమే పరస్పరము కలిపినాడు. కాని వానిని నిర్మించలేదు. ఆ సూక్ష్మ భాగములను నిర్మించు కర్తలు మరికొందరున్నారు. గడియారముల నిర్మాత వాని భాగములను కలుపునప్పుడు వానితోబాటు ఉండెను. ఉండనిచో ఆ భాగములు పరస్పరము చక్కగా కలిసికొని గడియార రూపమును ధరించజాలవు. ఇదే విధముగా భాగముల కర్త మరియు వాని క్రియ ఆ భాగములతో సంబద్ధములై యున్నవి. ఒకవేళ అతడు ఆ భాగములతో సంబద్ధుడుగ నుండకున్నచో భాగములు సిద్ధము కాలేవు. ఇదే విధముగా ఏ లోహముతో భాగములు సిద్ధపరచబడినవో ఆ లోహమును గనుల నుండి త్రవ్వితీయువారు, దానిని కరిగించి శుభ్రపరచువారు, గని, కొలిమి, అందు కుపయోగపడు పనిముట్లు మొదలగు పరికరములు వారి వెంట నుండనిచో గనుల నుండి లోహము బయటికి రాదు. శుభ్రపరచబడదు. ఉద్దేశ్యమేమన: గడియారము నిర్మించుటయందు కేవలము ఒకే కర్తయొక్క హస్తము, మరియు సహాయము మాత్రమే యుండదు. అనేక కర్తల, క్రియల చేతనే ఆ గడియారము సిద్ధమైనది. క్రియకు ఏ కర్తతో సంబంధముండెనో ఆ కర్త వానితోగూడ ఉండెను. ఇదే విధముగ మిఠాయివాడు, కమసాలి, కుమ్మరి మున్నగు కర్తల వ్యవస్థ గలదు. వారందరును తమతమ క్రియలకు కర్తలై యుండిరి. ఇంకనూ మిగతా కర్తలెందరో గలరు. వారందరును ఆయా సామాగ్రిని సిద్ధపరచిరి. మిఠాయివాడు, కమసాలి, కుమ్మరిమున్నగువారు తమతమక్రియలలో

సఫలురై వస్తువుల నిర్మించగలిగిరి.

ఇప్పుడు తెలిసినదిగదా! మనుష్యుడు చేయు వస్తువునందు కేవలము ఆ వ్యక్తి హస్తమేగాదు. పలువురి చేతులును గలవు. అప్పుడే ఆ వస్తువు సిద్ధమగుచున్నది. ఇట్లెందుకగునో తెలియునా? మనుష్యుడు అల్పజ్ఞుడు. అల్పశక్తిగలిగినవాడు. అతడు అనేక కర్తల సహకారము తీసికొనియే వస్తువులను నిర్మించగలడు. అట్టి కర్తలు తమతమ క్రియలతోగూడ నుందురు. గొప్పగొప్ప పనులను చేయుటకు ఆయా కర్తలు వాని వెంట నుండెదరు గదా! స్థూలాతిస్థూల, సూక్ష్మాతి సూక్ష్మ సృష్టిని నిర్మించుటయందు వాని కర్త పరమేశ్వరుడు ఆయా వస్తువులలో నుండవలెను గదా! సృష్టియనగా కేవలము సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, పర్వతములు, వృక్షములు, సముద్రములు, నదులు, మనుష్యులు, పశుపక్ష్యాదులు మాత్రమే కాదుగదా! ఇంకా మన ఊహకందని ఇతర అనంత సూక్ష్మ వస్తువులు గలవు. ఇవియన్నియు గలిసియే సృష్టి యనబడును. శ్రద్ధతో వినుము. ఐదు స్థూల భూతములు, ఐదు సూక్ష్మ భూతములు, ఐదు తన్మాత్రలు అనగా, శబ్ద స్పర్శ రూప రస గంధములు, అనేక రకముల అణువులు, పరమాణువులు కలిసియే ఈ సృష్టి నిర్మాణము జరుగును. ఒకవేళ వానిని సంధింపజేయువాడు వానివెంట నుండనిచో అవి అట్టి పదార్థముల రూపమును ధరించగలుగునా? ప్రపంచమందలి సకల పదార్థములు ప్రకృతియొక్క పరమాణువులతో సిద్ధమైనవి. ఇంతవరకు ప్రపంచములో ఆ పరమాణువులను పట్టుకొని కలుపగలిగినట్టి యంత్రమేదియును నిర్మింపబడలేదు. విభజింప జాలనంతటి సూక్ష్మ తత్త్వములే పరమాణువులు. అట్టి పరమాణువుల లోపలను, బయటను, సర్వత్ర పరమాత్మ విద్యమానమై యున్నాడు. కావుననే ఆయన వానిచే సూక్ష్మాతి సూక్ష్మము, స్థూలాతి స్థూలమునగు జగత్తును నిర్మించును. ప్రపంచమందలి జడ పదార్థములలో సూక్ష్మాతి సూక్ష్ములైనవి పరమాణువులే. పరమేశ్వరుడు వానికన్నను అనేక రెట్లు సూక్ష్మమైన వాడు. కావుననే ఆయన పరమాణువులందును వ్యాప్తమైయుండి వానిని నియంత్రించుచున్నాడు. ఒకవేళ వ్యాపకుడుగాకున్నచో ప్రపంచమందలి మనుష్యులు మున్నగు ప్రాణులు ఇతర కర్తల క్రియల ఆశ్రయమును పొందునట్లు ఆయన కూడ సృష్టి నిర్మాణములో

ఇతర కర్తల క్రియలను ఆశ్రయించవలసి యుండును. ప్రతి కర్తయు తన బాధ్యత యుండునంత వరకు తన క్రియలందు వ్యాప్తమై యుండునని ఋజువైనది. ఇక "నిప్పుడు కాళ్ళు చేతులు లేనిదే వస్తువుల నిర్మాణ మెట్లు జరుగగల"దను ప్రశ్న మిగిలిపోయినది. కాళ్ళు చేతుల ద్వారానే సకల పదార్థముల నిర్మాణము జరిగిన దని నమ్మిన ఈ యన్నిటి నిర్మాణమొనర్చు కాళ్ళుచేతులెట్లు నిర్మాణమైనవి? అవికూడా చేయబడినవే కదా! అవి కాళ్ళు చేతులు లేకుండానే నిర్మాణమైన వని తలచినచో ఇతర పదార్థములు కూడా కరచరణములు లేకుండగనే ఎందుకు నిర్మాణము కాకూడదు? తల్లి గర్భమునందు నిర్మాణమగు శిశువు కాళ్ళు చేతుల సహకారముతోనే నిర్మాణమగుచున్నదా? పృథివిపై నానా ప్రకారముల అంకురము లుత్పన్నమై వృక్షముల రూపము ధరించుచున్నవి. అట్లు కరచరణముల సహకారముతోనే జరుగుచున్నదా? వినుము. ఈ కాళ్ళు చేతులు కాళ్ళు చేతులతో సంబంధముగల వస్తువులను మాత్రమే నిర్మించగలవు. ఇతర వస్తువులను నిర్మింపజాలవు. ఈ కాలు సేతులు చిన్నచిన్న కీటాణువులు. ఈగలు, దోమలు మున్నగువానిని వాని సూక్ష్మాంగములను నిర్మించగలవా? మనుష్యాది ప్రాణులు నివసించుచున్న ఈ భూమి పరిధి (25000) మైళ్ళు గలదు. ఇంతకన్నను అనేక లక్షల కోట్ల రెట్లు పెద్దవియైన సూర్యుడు, బృహస్పతి మున్నగు గ్రహములున్నవి. ఇవన్నియును కాళ్ళు చేతుల సహాయముతోనే నిర్మింపబడినవా? ఈ సమస్త పదార్థములను నియమ పూర్వకముగా ఏ యితర సహాయము లేకయే చేయువాడు సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపకుడునగు పరమాత్మయే. ఆయనయే సకల పదార్థములను సృష్టించి నియమ పూర్వకముగ నడుపుచున్నాడు.

**ఇందిర** : - అక్కయ్యా! నీవు ఏదో యొక క్రొత్త విషయమును తెలుపుచునే యున్నావు. ఇప్పుడు నియమ పూర్వకముగా ఏ కార్యము నడచుచున్నది? మరి ఏవి నియమ పూర్వకముగా నిర్మింపబడుచున్నవి? ఒకచోట మహోన్నత పర్వతములు, ఒకచోట అగాధమగు లోయలు, మరొక చోట భయంకరమగు అరణ్యములు, ఇంకొక చోట వేలమైళ్ళ విస్తారమగు ఇసుక ఎడారులు, మహావృక్షములు, చెట్లు, ముళ్ళపొదలు, మహాసముద్రములు,

నదీ నదములు, ఎత్తు పల్లములు- ఏవి నియమ పూర్వకముగా నున్నవి? అసమముగా, అసంబద్ధముగా, ఏ నియమము లేకుండానే సృష్టి నిర్మాణము జరిగినది. నియమ పూర్వకముగా జరుగు కార్యము ఒక పద్ధతిలో నుండవలెను గదా! మనుష్యుడు నిర్మించు గృహమును చూడుము. నియమ పూర్వకముగా వరండా, వాకిలి, గదులు, స్నానశాల స్వాధ్యాయశాల, పాకశాల, భోజన శాల, శౌచాలయము మున్నగు వాని వ్యవస్థ సక్రమముగనుండును. తోటవాడు (మాలి) తోటను పెంచును. దాని యందు మడులు, గుంతలు, కాలువలు, కుండీలు, తొట్లు అనేక రకములు పూలచెట్లు, పండ్లచెట్లు మున్నగు వానిని క్రమముగా నాటును. కొట్టుఅధిపతి తన దుకాణమునందు సకల సామగ్రిని నియమపూర్వకముగ పేర్చి యుంచును. మనుష్యుని కార్యమునందీ నియమము కాన్పించుచున్నది. కాని నీవు అవ్యవస్థితముగా, క్రమ విరుద్ధముగానున్న ఈ సృష్టిని నియమ పూర్వకమని చెప్పుచున్నావు. ఇది ప్రత్యక్షమునకు విరుద్ధము. నా దృష్టిలో ఈ సృష్టియందు నియమమేలేదు. నీవేమందువు?

**సువర్ణ :** - సృష్టియందే నియమము లేదనుట నీ యజ్ఞానము మాత్రమే. సూర్యుడు పూర్వ దిశయందే ఉదయించి పశ్చిమ దిశయందే ఏల అస్తమించును? పశ్చిమ దిశ యందేల ఉదయించడు? ఇది నియమము కాదా? మనుష్యుడు నిర్మించిన ఉత్తమోత్తమ గడియారము అప్పుడప్పుడు వేగముగను, మందముగను నడుచుచుండును. కాని పరమాత్మచే నిర్మింపబడిన సూర్యరూప గడియారము ఒక్కక్షణమైనా వెనుకాముందు గాకుండా! ఎక్కువ తక్కువలు లేకుండ నడచును. చంద్రుని హెచ్చు తగ్గులు, చంద్రుడు పూర్ణముగా గాన్పించుట, కనుమరుగగుట మున్నగునవి ఎంత నిత్యమైనవో ఎంత నియమ బద్ధమైనవో చూచుచుందువుగదా! అట్టి నియమ పూర్వక నడకవల్లనే వర్షములు, సూర్య చంద్ర గ్రహణములెప్పుడు, ఎట్లు ఎచ్చట జరుగునో ఒక్క నిముషమైనను వెనుకాముందు గాకుండా లెక్కలు వేసి చెప్పగలుగుదుము. ఇదే విధముగా గ్రహ, ఉపగ్రహముల విషయము గూడ. కొంచెమాలోచించుము చెల్లెలా! మామిడి విత్తనమునుండి మామిడి చెట్టు, శనగ విత్తనమునుండి శనగమొక్క ఎందుకుత్పత్తి గావలెను? మామిడి విత్తనమునుండి కొబ్బరి చెట్టు, శనగ గింజ నుండి కందిమొక్క ఏల

మొలవగూడదు? బాలురుత్పన్నమై, మొదట యువకులై తరువాత ముసలివారేల యగుదురు? మొదట ముసలివారై తరువాత యువకులేల కాకూడదు. కన్నులు చూచునేగాని వినకపోవుట కేమి కారణము? ముక్కు వాసన తెలిసికొనునేగాని చూడలేదెందుకు? ఈ యన్నిటి వెనుక ఈశ్వరుని దృఢ నియమము గలదు. ఈ అత్యున్నతములు, దృఢములునగు కొండలు, పర్వతములు, సముద్రములు, సరస్సులు, తటాకములు, మహారణ్యములు, వృక్షములు, పొదలు, మున్నగునవి నియమ బద్ధముగా లేవని యనుకొనుట కేవలము నీ యజ్ఞానము మాత్రమే. నీవు నీ బుద్ధిని నీ కొలతతోనే కొలుచుకొనుచున్నావు. తనకు తెలియని విషయములు దోషపూరితములని తలచుట ప్రపంచ స్వభావము. ఒక చీమ మనుష్యుని తలపై ఎక్కి తల వెంట్రుకలందు దూరి, అటునిటు వెంట్రుకలందు తిరిగి మనుష్యుని శరీరమెంత నియమ రహితముగానున్నది? తలపై అరణ్యమువలె చెట్లు, పొదలు, గడ్డిగాదము నిండి యున్నదని, తలనుండి క్రిందికి దిగి నొసటిపైకి చేరి ఇదంతా శుద్ధమగు మైదానముగా నున్నదని ఇంకా కొంత క్రిందికి దిగి కనురెప్పలపై చేరి ఇచ్చట అన్నీ ముళ్ళ పొదలేనని, ఇంకా క్రిందికి దిగి కనుగుంతలను చూచి అబ్బో! ఇచ్చట పెద్ద కందకములున్నవని, ముక్కుపైకెక్కి ఇచ్చట మహాపర్వతమున్నదని, నాసికా రంధ్రములను చూచి ఇచ్చట పెద్ద సొరంగములు త్రవ్వబడినవని, ఇంకా కొంచెము దిగి వచ్చి మీసములలో చిక్కుకొని నేను మహా ఘోరారణ్యమునందే చిక్కుకొనినానని తన బుద్ధియను కొలతతోనే చీమ మనుష్యుని శరీరమును కొలతలు వేసికొని ఇదే మాత్రము నియమ బద్ధముగా లేదని యనుకొనినట్లు మూర్ఖులు పరమేశ్వరుని నియమమునే శంకింతురు. ఇది సరిగాదు.

ఒకవేళ మనుష్యుని శరీరమును చీమభావించిన బుద్ధికనుకూలముగా మార్చివేసినచో మనుష్యుడు మనుష్యుడుగా నుండగలడా? అప్పుడు వాని సౌందర్యము, జ్ఞాన కర్మేంద్రియముల వ్యవహారము నియమ పూర్వకముగ నడువగలదా? ఎన్నటికిని నడువజాలదు. రెండవ ఉదాహరణమును చూడుము. ఒక కార్మిక నిపుణుడు (శిల్పి=ఇంజనీరు) ఒక గొప్ప యంత్రమును సిద్ధపరచినాడు. అందెన్నియో చిన్న, పెద్ద యంత్ర భాగములనమర్చినాడు. ఆ యంత్రములో

వేలాది భాగము లున్నవి. ఒక అజ్ఞాని ఆ యంత్రమును, దాని భాగములను చూచి " ఈ యంత్రమును నిర్మించిన వాడెంత మూర్ఖుడు. అతని కేమాత్రము జ్ఞానములేదు. కొన్ని ఇంత పెద్ద భాగములు, మరికొన్ని ఇంత చిన్న ముక్కలు, కొన్ని పొడవు, కొన్ని కురచ, మరికొన్ని వంకరగా, కొన్ని గుండ్రముగా, మరికొన్ని రేకు బద్దలుగా, ఇంకా కొన్ని బుడిపెబుడిపెలుగా ఎంత అసహ్యముగా నున్నవి? ఇందనేక దోషములున్నవని చెప్పును. ఇప్పుడు చెప్పుము. ఆ వ్యక్తి ఆలోచించిచే అనినాడా? ఇట్లనేక రకములగు ముక్కలను కూర్చినందుననే ఆ యంత్రము అనుకూలముగా నడువగలదని వానికి తెలియునా? ఏ మాత్రము తెలియదు. పరమాత్మ, మరియు నాతని సృష్టియును ఈలాంటిదే. ఈ సృష్టి రూప యంత్రమునందును ఒకచోట మహోన్నత పర్వతములు, ఒకచోట చిన్నచిన్న కొండలు, ఒకచోట మహా అగాధమగు సముద్రములు, ఇంకొక చోట నదులు, వాగులు, వంకలు, వనములు, ఉప వనములు, మహారణ్యములు, చిట్టడవులు, సరస్సులు, లోయలు మున్నగున వెన్నియో నున్నవి. ఈ సృష్టి రూప యంత్రము మహా ప్రయోజనకరముగనున్నది. ఇందు జీవుల కళ్యాణ మున్నది. అజ్ఞానులకీ సృష్టిరూప యంత్రభాగములు మోటుగా, నియమ విరుద్ధముగా గాన్పించును. ఏలన వారికి ఈ సృష్టియొక్క ప్రయోజనముగాని, సృష్టిరూప యంత్రమునందలి పర్వతములు, సముద్రములు, లోయలు, అరణ్యములు, మున్నగు భాగముల ఉపయోగముగాని తెలియదు.

ఇక నీ విచ్చిన తోట మాలి, దుకాణమువాని ఉదాహరణము అతి అల్పమైనది. కావుననే నీవు దానిని శీఘ్రముగ, సులభముగ తెలిసికొనగలిగినావు. సృష్టి నియమములు అతి విశాలములు, అతి సూక్ష్మములు నైనవి. వానిని నీవు సులభముగ తెలిసికొన జాలవు. కొంత సూక్ష్మముగ ఆలోచించుము. ప్రపంచమందలి మనుష్యులు ఏ మస్తిష్కముద్వారా నియమముల నేర్పరతురో **ఆ మస్తిష్కము కూడ ఆ సర్వనియామకుడగు పరమేశ్వరుడు చేసినదే గదా!** ఆయనయే ఈ సృష్టియొక్క అసంఖ్యాక నియమముల నేర్పరచినాడు. ఈ సృష్టి నియమములు లేనిచో పరమాత్మ నెవరు నమ్ముదురు? ఆయన అచలమైన దృఢమైన, నిత్యమైన నియమములే సృష్టికర్తయగు పరమేశ్వరుని అస్తిత్వమునకు

ప్రమాణములు.

**ఇందిర :-** మంచిదక్కయ్యా! సృష్టిని పరమేశ్వరుడే రచించినాడు, మరి యా పరమేశ్వరు నెవరు సృష్టించినారు?

**సువర్ణ : -** నిర్మాణ పదార్థములే కార్యములగును. వానికి ఉపాదాన కారణము మరియు కర్తయొక్క అవసరముండును. ఈశ్వరుడు చేయబడు పదార్థముగాదు. ఆయన అనాది మరియు సనాతనుడు. కావున "ఈశ్వరునెవ్వరు చేసి"రను ప్రశ్నయే యుండదు. ఎవడు స్వయముగా కర్తయో ఆయనకు కర్త యెవడుండును? ఒకవేళ కర్తకు కర్తయున్నప్పుడాతడు కర్తగా ఎట్లుండును? కారణముగానే నిలుచును. స్వతంత్రుడగువాడే కర్త. నిర్మింపబడిన వేవియును కర్తలు గాజాలవు. కర్తలనబడు మనుష్యాది ప్రాణుల శరీరములు కర్తలుగావు. అవి సాధనములు మాత్రమే కర్త ఆత్మయే.

**ఇందిర :-** కర్తకు కర్తయుండనిచో పోనిమ్ము. కాని మనము ఈశ్వరునెందుకు నమ్మవలెను? మనమాతని స్తుతి ప్రార్థన ఉపాసనలు మరియు భక్తినేల చేయవలెను? మన జీవితములకు వానితో సంబంధమేమి?

**సువర్ణ : -** ఈ విషయములను గూర్చి రేపాలోచింతము.



**'హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్'**

**(యజు. 17-4)**

సృష్టికి పూర్వము (ప్రలయకాలమున) సూర్యాది జ్యోతిస్సులను బీజరూపమున తన గర్భమున ధరించిన హిరణ్యగర్భుడు (పరమేశ్వరుడు) ఉండెను. అతడే సృష్టిలోని సమస్త పదార్థములను ఎవరి సహాయము లేకనే సృజించి పాలించుచున్నాడు. అతడు ఒక్కడే.

# ఈశ్వర భక్తి ఏలచేయవలయును?

(మూడవ దినము ప్రాతః కాలము)

ఇందిర : - అక్కయ్యా! నిన్నటి నా శంకకు సమాధానమిమ్ము.

సువర్ణ: "ఈశ్వరుని భక్తినేల చేయవలెను? ఆయనను స్తుతించి, ప్రార్థిం ఉపాసించుట వలన కలుగు లాభమేమి? అనునదేగదా! నిన్నటి నీ ప్రశ్న? మంచిది వినుము. ప్రపంచమందలి ప్రతి పదార్థము తన సన్నిధి, లేక కేంద్రము వైపునకు పోవుటకు ప్రయత్నించును. ఈ నియమము జడములు, చేతనములను రెండు విధములగు పదార్థములకును వర్తించును. అగ్ని జ్వాలలు నిరంతరము పై దిశకే పోవుచుండును. ఏలన అగ్నికి కేంద్రమగు సూర్యుడు పైన యుండును. మట్టిగడ్డను నీ వెంత శక్తితో పైకెగరవేసినను అది సదా తన భండారమగు పృథివివైపునకే వచ్చును. సూర్యుని కిరణములు సముద్ర జలములను ఆవిరిగా మార్చి గాలిలో కలిపివేయును. ఆ యావిరియే మేఘములుగా మా జలరూపమున మరల నదీ నదముల ద్వారా సముద్రమునకే వచ్చి చేరును. ఇ విధముగా ఇతర పదార్థములందును జరుగుచుండును. ప్రపంచమందలి ప్ర పదార్థమునకు తనదైన ఒక కేంద్రముండును. జలముల కేంద్రము సముద్రమ అగ్ని కేంద్రము సూర్యుడు. ఘటాకాశ, మఠాకాశముల కేంద్రము బృహదాకాశమ ఇదే విధముగా ప్రపంచ జ్ఞానమునకు కేంద్రము పరమాత్మ. మనుష్యునక లభించిన జ్ఞానము పరమాత్మద్వారానే కలిగినది. చదివించనిదే ఏ మనుష్యునక జ్ఞానమును పొందు యోగ్యత కలుగదు. ఒకవేళ మనుష్యునికి చదివించకున్నన జ్ఞానము లభించగలదని యెంచినచో పాఠశాలలుగాని, కళాశాలలుగాని విశ్వవిద్యాలయములుగాని, అధ్యాపకుల ఆవశ్యకతగాని ఉండకపోవును. త దండ్రులు తమ పిల్లలకు ప్రారంభమున మాట్లాడ నేర్పుదురు. పదార్థము పరిచయమును గలిగింతురు. ఇవి కాసులు, ఇవి రూపాయలు, ఇవి నోట్లు, ఇ పాలు, నీళ్ళు, ఇది రొట్టె, ఇతడు చిన్నాయన (బాబాయి), ఇతడు అన్న తమ్ముడు, అక్క, చెల్లెలు మున్నగు వేలాది వస్తువుల పరిచయమును గలిగింతుర ఆ బాలురే పాఠశాలలందు చేరి గురువుల ద్వారా ప్రపంచమందలి అనే విషయములు తెలిసికొందురు. వారి ద్వారానే చదువుట, చేరుచుండును

వ్రాయుటను కూడ నేర్చుకొందురు.

ఈ తల్లిదండ్రుల మరియు గురువుల జ్ఞానముకూడ వారి స్వంతము కాదు. వారు కూడ వారి తల్లి దండ్రులు, గురువులు మున్నగు వారి ద్వారానే నేర్చుకొని యుండిరి. ఇదే విధముగా ప్రతి వ్యక్తియు మరియొకని ద్వారా నేర్చుకొనుచు వచ్చెను. "అట్టిచో సృష్ట్యాదిలో మానవులు ఏ మాతా పితరులద్వారా గురువులద్వారా జ్ఞానమును సంపాదించుకొనిరి? ఏలన వారికి పూర్వమెవ్వరును లేకుండిరిగదా!" అను ప్రశ్న ఉదయించును. సమాధానమేమన సృష్ట్యాదిలో మానవులు పరమాత్మద్వారా జ్ఞానమును పొందియుండిరి. అప్పుడు "పరమాత్మ జ్ఞానమునెట్లొసగెను. ఆయనకు శరీరమే లేనప్పుడెట్లు చదివించెను?" అను ప్రశ్న సైతము కలుగగలదు. దీనికి సమాధానమేమనగా జ్ఞానము నిచ్చుట, మరియు చదివించుటలో భేదము గలదు. చదివించుట శబ్దముల ద్వారా జరుగును. జ్ఞానమనునది ఆత్మయందీయబడును. పరమాత్మ సర్వవ్యాపకుడగు కారణమున సృష్ట్యాదియందు సృష్టించబడిన మానవులందును వ్యాప్తమై యుండి తన జ్ఞానమయ శక్తితో "అగ్ని, వాయువు, ఆదిత్య, అంగిరు"లను నలుగురు ఋషుల ఆత్మలందు జ్ఞానమును ప్రకాశింపజేయును. ఆ ఋషులే శబ్దముల ద్వారా విశ్వమందలి ఇతర మానవులను చదివింతురు. వారికి జ్ఞానము నిత్తురు. అప్పటినుండియే చదువుట, చదివించుటయను క్రమము సాగును. పరమాత్మ సృష్ట్యాదియందు ఋషులకు జ్ఞానము నీయనిచో "చదువుట, చదివించుట" యను క్రమము నడువకపోవును. ఇందువల్ల సిద్ధించినదేమన, మనుష్యులు నేర్చిన జ్ఞానమంతయును వారికి పరంపరగా లభించినది. వారు పరమాత్మ సృష్టించిన సృష్టిని జూచి, పరమాత్ముడిచ్చిన బుద్ధినుపయోగించి జ్ఞాన వికాసమునొనర్చికొనినారు. మానవుడు జ్ఞానమును వికసింపజేసికొనగలడేకాని ఇతరులు ఆతనికి జ్ఞానము నొసగనిదే స్వయముగ దానిని ప్రాప్తించుకొనజాలడు. మొదట పరమేశ్వరుడు ఋషుల హృదయములలో బీజరూపమున జ్ఞానమొసగును. తరువాత వృక్షరూప వికాసము ఋషుల ద్వారా, విద్వాంసులద్వారా జరుగును. ఈ నియమమే అనాదినుండి గలదు. సదా ఉండగలదు. ప్రపంచమందలి ప్రతి వస్తువు తన కేంద్రమునకే చేరదలచును.

అనిగదా చెప్పుచుంటిని. అదే విధముగా చేతనుడు, అల్పజ్ఞుడునగు జీవాత్మ తనకు జ్ఞానకేంద్రమైన, సర్వజ్ఞుడైన పరమాత్మను ఎందుకు చేరగోరడు? జీవాత్మగూడ పరమాత్మను చేరగోరును. ఏలన ఆతని వికాసము, మరియు ఉన్నతి పరమాత్మ లేనిదే జరుగదు. జడము ద్వారా జడము, చేతనము ద్వారా చేతనము వికాసమునొందును. ప్రపంచమునందలి ఏ జడ పదార్థము ద్వారానైనను చేతనమగు జీవాత్మ ఉన్నతి జరుగజాలదు. జ్ఞానపూర్వకముగా ఉపయోగించు కొనినచో జడ పదార్థముల ద్వారా జడమగు శరీరము తప్పక ఉన్నతినొందును. అజ్ఞానవశమున జీవాత్మ ప్రపంచ పదార్థముల ద్వారానే ఉన్నతికి ప్రయత్నించును. కాని ఆతని ఉన్నతి జరుగదు. అశాంతియే మిగిలిపోవును.

మనుష్యునికి ప్రపంచమునగలుగు దుఃఖములన్నియు అతని అజ్ఞానము వల్లనే కలుగును. జీవాత్మకు పదార్థముల వాస్తవికత తెలిసినచో దుఃఖమనునదే యుండదు. జీవాత్మపై దుఃఖముల మరియు బంధనముల ఆవరణము అవిద్యను విద్యగా, అసత్యమును సత్యముగా, జడమును చేతనముగా నెంచుచుండునంత వరకే యుండును. జ్ఞాన భండారమైన పరమాత్మయే సుఖముల భండారము. ఆతని యందు తప్ప సుఖమనునది ప్రపంచమునందలి ఏ పదార్థమునందును లేదు, ఉండదు. ఒకవేళ ప్రపంచ పదార్థములందు సుఖముండినచో ప్రపంచమంతా సుఖమయముగ గాన్పించెడిది. కాని అట్లు లేదు. ప్రపంచమందలి ప్రాణులన్ని యును సుఖమునే కోరుచున్నవి. కావున ఏ ప్రాణియు సుఖముగా లేదని దీనివల్ల ధృవపడుచున్నది. ఒకవేళ ఉండినచో ఉన్న దానినే మరల ఎందుకు కోరెడిది? కావున సుఖ ఆనందముల కొరకు ఈశ్వరుని భక్తి, స్తుతి ప్రార్థనలు సలిపిన అతని యెడ ప్రీతి యేర్పడును. అదియే మానవుల జీవనోద్దేశ్యము. మానవుడెట్లెట్లు పరమాత్మయొక్క భక్తి, ప్రార్థనోపాసనలను శుద్ధ మనస్సుతో చేయుచుండునో అట్లట్లే ఆతడు ఈశ్వరుని సన్నిధికి చేరుకొనుచుండును. చివరకు సమస్త దుఃఖములనుండి, బంధనముల నుండి విముక్తుడై పరమానందమును బడయును.

**ఇందిర :** - ప్రపంచమందలి పదార్థములందు సుఖములేదను మీ మాటను నమ్మజాలకున్నాను. ప్రపంచ పదార్థములందు సుఖము లేనిచో సకల

ప్రాణులు ప్రాపంచికపదార్థములనేల కోరుచుండును? ధనములో సుఖములేనిచో ప్రజలు మన్ను మిన్ను గానక దానివెంట పరుగెడుతున్నారు. ఎంత సమకూర్చుకొనినను తృప్తిపడకున్నారు. భోజనమునందు సుఖములేనిచో ప్రాణులు భోజనమునేల కోరుచుండును? వస్త్రములందు సుఖములేకున్న లోకులు రకరకముల విలువైన వస్త్రములనేల ఎగబడి కొనుచుందురు? గృహములు, భవనములందు సుఖములేకున్న లోకులు ఒకరికన్న మరొకరు ఉన్నత హర్మ్యముల నేల నిర్మించుకొనుచుందురు? యథార్థముగా ప్రాపంచిక ప్రతి పదార్థమునందును సుఖమున్నది. కావుననే మానవులు వానిని సమకూర్చుకొనుచున్నారు. దానిని వదలుకొనదలచుటలేదు. పదార్థముల సంయోగమందు ఎంత సుఖమో, వియోగమునందు అంత దుఃఖము గలదని భావించుచున్నారు. కావున ప్రాపంచిక పదార్థములందు సుఖములేదని నమ్ముటెట్లు?

సువర్ణ : - సోదరీ! ప్రాపంచిక పదార్థములందు సుఖాభాసమేగాని అందువాస్తవమగు సుఖములేదు. అనగా సుఖమున్నట్లు మనకు గాన్పించును. సుఖమనునది ప్రతి మనుష్యుని ఆత్మయందే యున్నది. మానవుడు ప్రపంచమందలి ఒక పదార్థమును వాడుకొనగా సుఖానుభూతి కలిగెనేని ఆ సుఖము ఆ పదార్థమువల్లనే లభించినదని యనుకొనును. కాని వాస్తవముగ ఆ పదార్థముద్వారా సుఖము గలుగలేదు. దానియందే ఆతని చిత్తైకాగ్రతవల్లనే ఆతనికి సుఖానుభూతి కలుగుచుండును. ఎట్లనగా, శునకము తన్మయత్వముతో ఎముకలు కొరకుచున్నప్పుడు దాని దవడలు చీల్చుకొని అందుండి రక్తము స్రవించును. కొరుకుటలో తల్లీనమైన శునకము రక్తము ఎముక నుండియే వచ్చుచున్నదను అనుభూతి నొందును. అట్లే మానవుడు ప్రాపంచిక వస్తువుల సేకరణలో తల్లీనమై యుండుటవల్లనే సుఖము కలుగుచున్నదని తలచును. కాని అది నిజముకాదు. ఎముకయందు రక్తము లేనట్లే ప్రాపంచిక వస్తు సముదాయమునందు సుఖము లేదు. అట్లనుభూతి మాత్రము గలుగును. సుఖమనునది తనయందే గలదు. దృఢచిత్తులై స్వాధ్యాయము నొనర్చువారే యథార్థముగా దీని యనుభూతిని పొందగలుగుదురు. ధనమునందే సుఖముండునని తలచినచో ఏ ధనికుడును దుఃఖితుడు గాకుండెడివాడు. ఎన్ని

చింతలు, దుఃఖములు, భయములు ధనికుల కుండునో అన్ని నిర్ధనులకుండవు. ధనవంతుడొకడు రోగములతో దుఃఖములపాలై ధనముతో మందులను మాత్రము కొనగలడేకాని ఆరోగ్యమును మాత్రము కొనలేడు. ఇట్లే మూర్ఖుడు జ్ఞానము పొందుటకు ధనముతో అనేక ధార్మిక గ్రంథములను కొని బీరువాలందు చక్కగా అమర్చిపెట్టి అధ్యాపకుని ఏర్పాటు చేసికొనగలడు. కాని విద్యను, జ్ఞానమును మాత్రము ధనముతో కొనజాలడు. పరిశ్రమ, దీక్ష ద్వారానే విద్య ప్రాప్తించగలదు. అట్లే ధనముతో ఇష్టమైన భోజన పదార్థములను కొనుక్కోగలడు. కాని ఆకలిని మాత్రము కొనలేడు. మానవుడు ప్రపంచమునందున్నాడు. ఆతని వద్ద లక్షల కోట్ల సంపత్తిగలదు. ఐతేనేమి? కేవలము వంద గ్రాముల పాలు, బియ్యమునైనను జీర్ణించుకొనలేడు. ఇప్పుడు చెప్పుము. ఒకవేళ భోజనమందే సుఖము గలదని తలచినచో రెండు రొట్టెలు తినుట యందెట్టి సుఖముగలదో 10, 12 రొట్టెలు తినుటవల్ల అన్నిరెట్ల సుఖముండవలెనుగదా! అట్లు జరుగుటలేదు. అన్ని రెట్లు కష్టమధికమగుచున్నది. డాక్టరు, లేక వైద్యుని వద్దకు పరుగెత్తవలసి వచ్చును. నిజమైన ఆకలి యున్నప్పుడు రుచి పచి లేని భోజనమైనను అమృతమువలెనే యుండును. ఆకలి లేనప్పుడు అమృతముకూడా రుచించదు.

ఇకపోతే వస్త్రములందు సుఖమున్నదని యెంచినచో చలికాలము ఉన్ని, మరియు ఖద్దరు, నూలు వస్త్రములు సుఖదాయకముగనుండును. వేసవియందావస్త్రములే సుఖదాయకముగ నుండవలెనుగదా! ఎండకాలమునం దెట్టి వస్త్రములు సుఖము గలిగించునవిగా నుండెనో, అవి చలికాలము నందును సుఖదాయకముగా నుండవలసి యుండెను. వస్త్రముల ధర్మము సుఖమును గలిగించునదే యగుచో సర్వకాలములందును సుఖప్రాప్తియే గలుగు చుండవలెను. 'ధర్మ'మనునది సకల దేశ, సర్వకాల, సర్వావస్థలయందును ఒకే రీతిగా నుండవలెను. అగ్ని ధర్మము కాల్చుట. దాని నేకాలమందైనను, ఏ దేశమునందైనను ఎవ్వరైనను ముట్టినప్పు డది కాల్చును. పంచదార ధర్మము తీపి (తీయదనము) దాని నెచ్చట, ఎవ్వరు, ఎప్పుడు తినినను తీయగానే యుండును. ఇట్లే ప్రాపంచిక పదార్థముల ధర్మము సుఖము నిచ్చునదే యైనచో ప్రాపంచిక పదార్థములను పొందిన పిదప మనుష్యునికి సుఖము కొరకు వాసన

ఆరాటపడు అవసరముండెడిది కాదు. ఆతనికి సదా సుఖానుభూతియే గలుగుచుండెడిది. ఇప్పుడు చెప్పుము ఒక ధనికునకు 105 డిగ్రీల జ్వరమున్న ది. ఆతనికి పట్టు, మఖమల్ గుడ్డలు తొడిగి బంగారు మంచముపై పట్టుపరుపులు, దిండ్లువేసి పరుండజేసినను ఆతనికి దుఃఖమునందేమైన తగ్గుదల కనిపించ గలదా? కావుననే 'సుఖ'మనునది ప్రాపంచిక వస్తు సముదాయమందు లేదు. అది పరమేశ్వరుని సుఖకరమగు ఆనంద కేంద్రమందే గలదు.

**ఇందిర** : - 'సుఖ' మనునది ప్రాపంచిక పదార్థములందు లేదు. తనయందే గలదని నమ్మినను లడ్డూ జిలేబీలు తినుటవల్ల గలుగు ఆనందము మట్టి తినుటవల్ల గలుగదు గదా! రొట్టె తినుటవల్లనే ఆనంద మేల కలుగవలెను? రాళ్ళు తినుటవల్ల కలుగ దేమి? ఖండచక్కెర (పటిక బెల్లము) తినుటవల్ల ఆనందము కలుగగలదు. కాని గడ్డిగాదమువల్ల కలుగదు గదా! ఏవేని సుందర దృశ్యములను చూచుచున్నప్పుడు గలుగు ఆనందము స్మశానమునం దేల కలుగదు?

**సువర్ణ** : - లడ్డూలు, జిలేబీలు, పటికబెల్లము మున్నగు పదార్థములను తినునప్పుడు వాని గుణముల అనుభూతియే కలుగును. కాని ఆనందానుభూతి మాత్రము కలుగదు. లడ్డూ తినుటవల్ల తీపి, మిరపకాయ నమలినప్పుడు కారముగా నుండును. కానీ తీపి, కారము పేర్లు మాత్రము ఆనందము కాదు. ఏ వస్తువునందు మనుష్యుని చిత్తము హత్తుకొని పోవునో దానినే ఆతడు 'ఆనంద'మని తలచును. ఒకవేళ లడ్డు, జిలేబీ, కారము మున్నగు వాని యందే ఆనందము (సుఖము) గలదని యెంచినచో జ్వరము మున్నగు రోగములచే గలుగు బాధలందును అవి ఆనందముగా నుండవలెను. కాని రుగ్ణావస్థలో వెగటుగా ననిపించును. ఇదే విధముగా ఇతర పదార్థములందును ఇదే స్థితి యుండును. ఇక మట్టి తినుటవల్ల ఆనంద మేల కలుగ దను విషయము. మట్టి తినుటయందు ఏకాగ్రచిత్తము గలవారి కది ఆనందదాయకముగనే యుండును. మట్టిగడ్డలను, మెత్తని మట్టిని తినునట్టి అనేక సోదర సోదరీమణులను నేను చూచితిని. అనేక జంతువులు రాళ్ళు రప్పలను తినుచుండును. రాళ్ళు రప్పల నటుంచుడు సారాయి వంటి దుర్గంధయుతమైన ఘాటైన అసహ్యమగు

గల మరియు అహిఫేనము (నల్లమందు) వంటి చేదు మాదక ద్రవ్యముల సేవనమువల్ల కొందరికి సుఖము గలదని తోచును. కాని సుఖము, ఆనంద మనునది ఆ పదార్థములందు గలదా? లేదు. ఏ యానందము ఆ పదార్థములం దున్నదని తోచునో అది వారికి ఆ వస్తువుపైగల ఏకాగ్రతయే. అట్టి ఏకాగ్రత వస్తువులపై వారికుండునంతవరకే సుఖమనిపించును. ఇకనిప్పుడు పదార్థములపై ఏకాగ్రత ఎట్లు లభించగలదను ప్రశ్న ఉదయించును. సమాధానమేమన: మను ష్య డేదేని ఒక వస్తువుపై మనసు నిలుపు అభ్యాసము గలవాడగుచో ఆతని కావస్తువుపై క్షణిక ఏకాగ్రత గలుగును. అట్లే అభ్యసించుచు పోగా ఆ వస్తువు సంస్కార మాతని మనస్సుపై పడుచుండును. ఆ సంస్కార మాతనికి మాటిమాటికి వస్తువును ప్రయోగమొనర్చుటకు ప్రేరేపించుచుండును. ఇదే విషయము ఏవేని సుందర వస్తువులను చూచుట యందును గలుగును. మనుష్యుడు తన మనస్సును ప్రసన్న మొనర్చుకొనుటకు సముద్రము, నదులు, వనములు, ఉప వనములు, పర్వతములలో భ్రమణమునకు పోవుటయును జరుగును. ఐనను ఆతని మనస్సులో ఒక భయంకర కోర్టు వ్యవహారముండినచో ఆతని కే స్థానము నానందము నీయజాలదు. ఆనందము నీయగల స్థానము లాతనికి భయంకర శ్మశానమువలె తోచును. ఎందుకు? వ్యాజ్యము యొక్క చింత కారణమున ఆతని మనస్సున కేకాగ్రత గలుగుటలేదు. ఒక మనుష్యుడు సుందర దృశ్యము, సంగీతము, నృత్యమువల్ల ఆనంద ప్రాప్తికై సినిమా (చలన చిత్రము) చూచుటకు వెళ్ళును. కాని గృహమునందాతని భార్య అనారోగ్యముతో బాధపడుచున్నది. ఆతడు సినిమాను చూచుచున్నాడు. ఐనను ఆతనికి ఆనం దము కలుగుటలేదు. ఎందుకు? భార్య అనారోగ్యముతో బాధపడుచున్నందున ఆతని చిత్తమునందేకాగ్రత కలుగుటలేదు. నేనొక లడ్డూను నీకు తినుట కిచ్చితిని. నీవు దానిని తినసాగితివి కాని అప్పుడు నీ మస్సు ఏదో ఒక ముఖ్య కార్యము దిశకు మరలినది. నీవు పూర్తిగా లడ్డూను తినివేసితివి. ఐనను దాని సంపూర్ణ రుచి నీకు తెలియదు. తరచుగా ఇట్లు జరుగుచునే యుండును. మనుష్యుడు భోజనమొనర్చును. పరధ్యానము నందుండినచో వంటకముల గుణ దోషములను తెలిసికొనలేకపోవును. దీనివల్ల 'సుఖము' బాహ్య యుండును.

పదార్థములందుగాక కేవలము చిత్తముయొక్క ఏకాగ్రత యందే గలదని సిద్ధించినది.

**ఇందిర** : - ఇంతవరకు నీవు 'సుఖముల కేంద్రము పరమాత్మ" అని చెప్పితివి. ఇప్పుడేమో సుఖమనునది చిత్తముయొక్క ఏకాగ్రత యందుండునని చెప్పుచున్నావు. ఈ రెండు విధములగు మాటలెట్లు పొసగును?

**సువర్ణ** : - చిత్తైకాగ్రతవల్లనే సుఖ స్వరూపుడగు పరమాత్మ అనుభూతి గలుగును. దానివల్లనే సుఖము ప్రాప్తించును. అజ్ఞానియగు మనుష్యుడు సుఖము బాహ్య పదార్థముల వల్లనే కలుగునని యనుకొనును. ఇవి రెండు విధములైన మాటలు గావు. మాట ఒక్కటే. ఐనను కాస్త లోతుగా ఆలోచించదగిన విషయము. ప్రాపంచిక పదార్థములందు అభ్యాసమువల్ల క్షణిక ఏకాగ్రత గలుగును. దానివల్ల క్షణికమైన ఆనందమే లభించును. కావున మనము సంపూర్ణ రూపమున ఈశ్వర భక్తియందే మనస్సును ఏకాగ్రమొనర్చు అభ్యాసము చేసినచో చివరికి పరమాత్మ ప్రాప్తించగలడు. అదియే మానవ జీవిత లక్ష్యము. కావున ఈశ్వర స్తుతి, ప్రార్థన, ఉపాసనలు అత్యవసరమే. ఏలన ఇందువల్ల చిత్తము అధికాధికముగా ఏకాగ్రత నొంది అధికాధికముగా ఆనందము ప్రాప్తించగలదు.

**ఇందిర** : - చిత్త మెంత ఏకాగ్రత నొందిన అంత సుఖప్రాప్తి గలుగగలదను దానికి ఆధారమేమి?

**సువర్ణ** : - దీని ప్రమాణము నేను నీకు జాగృతి, మరియు సుషుప్తి అను అవస్థల ద్వారా ఇచ్చుచున్నాను. ఈ యవస్థలు మూడు. జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ. జాగ్రదవస్థలో మనుష్యుని వృత్తులు ప్రాపంచిక పదార్థములందు దగిలి వ్యాపించి యుండును. స్వప్నావస్థ యనునది మనస్సును చంచలముగా అటు ఇటుగాని డోలాయమానమందుంచును. కావున దానిని వదలివేసి జాగృతి సుషుప్త్యవస్థలనే పేర్కొనుచున్నాను. మేలుకొని యుండు స్థితియందు మనుష్యుని చిత్తవృత్తులు ప్రాపంచిక పదార్థములవైపున వ్యాపకమై యుండును. మనస్సు ఒకప్పు డొక పదార్థమువైపు, మరొకప్పుడు మరోవైపు పరుగెత్తుచుండును. ఈ కారణమువల్లనే దానియందు స్థిరమగు ఏకాగ్రత యుండదు. కాని గాఢముగా నిద్రించు స్థితియందు దాని మనోవృత్తులు నిరంతరము ఏకాగ్రమై

అప్పుడాతనికి ఎంతో ఆనందము లభించును. ఉదయమున మేల్కొని "నేను చాల సుఖముగ నిద్రించితిని. చక్కని నిద్ర పట్టిన"దని చెప్పును. నిద్రించుటవల్ల ఆతనికి గలిగిన ఆనందము చిత్తముయొక్క ఏకాగ్రతవల్లనే లభించినది. ఎందుకన ఆత్మకు ప్రాకృతిక వస్తువులతో సంబంధము వీడిపోయినందున పరమాత్మతో సంబంధము కలిగినది. జీవాత్మకు సదా ప్రకృతితోగాని, పరమాత్మతోగాని సంబంధము గలుగుచుండును. ప్రకృతితో ఎంత గాఢ సంబంధముండునో దుఃఖము లంతగా వృద్ధి యగుచుండును. ఈ సంబంధ మెంత అధికముగా పరమాత్మతో గలిగియుండునో ఆనంద మంత అధికముగ వృద్ధి యగుచుండును. మరొక ఉదాహరణమును వినుము.

ఒక మనుష్యుడు చెరసాల (జైలు) యందు పడియున్నా డనుకొనుము. జ్వరముచే బాధపడుచున్నాడు. కడుపులో ఒక వ్రణము కూడ లేచినది. లక్షల రూపాయలు ఋణపడియున్నాడు. నిప్పంటుకొని ఇల్లు కాలిపోయినది. భార్యా పుత్రాదులు మరణించినారు. తాత్పర్యమేమన, ఆతడనేక చింతలలో మునిగియున్నాడు. ఈ చింతలు, మరియు దుఃఖములెంత వరకుండును? ఆతడు జాగ్రదవస్థలో నుండునంతవర కుండును. ఆతడేదో విధముగా గాఢనిద్ర అనగా సుషుప్తావస్థకు చేరినచో ఆతని చింతలు, దుఃఖములన్నియు వదలిపోయి ఆతనికి ఒక మహారాజుకన్న మిన్నయగు ఆనందానుభూతి గలుగును. మనుష్యుడే యననేల? సుషుప్తావస్థయందు ప్రతి ప్రాణికిని ఆనందము ప్రాప్తించును. ఎందుకన అప్పుడు సకల ప్రాణుల మనోవృత్తులు వ్యాపించి యుండక ఒకే స్థానమున ఏకత్రితమై యుండును. చిత్తవృత్తుల ఏకాగ్రతయే యోగము. "యోగశ్చిత్తవృత్తి నిరోధః" అనగా సుషుప్త్యావస్థయందు జీవాత్మకు జ్ఞానమవ సరములేకుండగనే సహజముగా ఈశ్వరునితో సంబంధమేర్పడును. ఐనను స్తుతి ప్రార్థనోపాసనల ద్వారా జ్ఞానపూర్వకముగా పరమాత్మతో ఏర్పడిన సంబంధమునే 'ఆత్మికోన్నతి" అని యనవచ్చును. ఈ యున్నతియే సమాధిద్వారా పరాకాష్ఠకు చేరి జీవాత్మను పరమాత్మునితో తన్మయుని చేయును. అదియే జీవనోద్దేశ్యము.

**ఇందిర :** - స్తుతి, ప్రార్థన, ఉపాసనలని వేనినందురు?

**సువర్ణ :** - శ్రద్ధాపూర్వకముగా ఈశ్వర గుణముల వర్ణన మొనర్చుట స్తుతి, ఆ గుణములచేతనే తన దోషములను సరిదిద్దుకొనుటకు ఈశ్వరుని సహాయమర్థించుట ప్రార్థన. ప్రపంచ పదార్థముల ద్వారా కలిగిన అహంకార భావమును తొలగించుకొని "పరమేశ్వరుడెక్కడోకాదు. నా సమీపమునందే యున్నాడు. నేనాయన సమీపమునందే యున్నా"నను దృఢ ధారణయే ఉపాసన యనబడును.

**ఇందిర :** - అక్కయ్యా! ఈశ్వరుడు శరీరధారి గాడని నీవందువు. కాని ప్రపంచమందలి అనేకులు ఈశ్వరుని శరీరధారిగా విశ్వసింతురు. భక్తితో ఆతని కొలుచుచుందురు. ఆయనను శరీరధారిగా, సాకారునిగా విశ్వసించుటలో దోషమేమి?

**సువర్ణ :** - ఇప్పుడు సమయము ఎక్కువైపోయినది. దీనికి సమాధానము రేపు ఇచ్చుటకు ప్రయత్నింతును. నేటికింతయే చాలు.



**ప్రశ్న:-** ఈశ్వర భక్తిని - స్తుతి ప్రార్థన ఉపాసనల నేల చేయవలెను.
**ఉత్తరము:-** ఈశ్వర స్తుతిచే అతనియందు ప్రీతియు, అతని గుణకర్మ స్వభావములచే తన గుణ కర్మ స్వభావముల సవరణయు జరుగును. ప్రార్థనచే నిరభిమానము, ఉత్సాహము ఈశ్వర సహాయమును కలుగును. ఉపాసనచే పరబ్రహ్మ తోడి సంబంధము నతని సాక్షాత్కారమును గలిగి ఆనంద మగ్నులమగుదుము.

**- మహర్షి దయానంద సరస్వతి**
(సత్యార్థ ప్రకాశము)

# ఈశ్వరుడు సాకారు డేల కాడు?

(నాలుగవ దినము : - ప్రాతః కాలము)

ఇందిర : - అక్కయ్యా! నిన్నటి నా ప్రశ్నకు సమాధానము చెప్పుము.

సువర్ణ : - సోదరీ! నిన్నటి నీ ప్రశ్న " ఈశ్వరుని సాకారునిగా నమ్మినచో దోషమేమి?" అనునదే గదా! మంచిది వినుము. ఈశ్వరుని సాకారునిగా విశ్వసించినచో ఒక్క దోషమేగాదు పెక్కు దోషములుండును. చూడు. ఈశ్వరుని లక్షణము సచ్చిదానందుడు. దీనియందు 'సత్, చిత్, ఆనందము' అను మూడు పదములున్నవి. 'సత్' అనుదానికి భూత భవిష్యత్ వర్తమాన కాలములందును ఏక రసముగ (మార్పు చెందక) ఉండువాడని, అనగా ఎంత మాత్రమును పరివర్తనము చెందక యుండువాడని అర్థము. 'చిత్' అనగా, జ్ఞానము గలది' అని యర్థము. ఇక మూడవదాని యర్థము ముక్కాలములందును ఏ మాత్రము దుఃఖములేకుండుట. ఇదియేఆనందమనబడును. ఈశ్వరునిలో ఎట్టి పరివర్తనము జరుగదు. ఆతని జ్ఞానము ఎన్నడును నశించదు. ఆయనయందెప్పుడును దుఃఖములుండవు. కావుననే ఆయనను 'సచ్చిదానందు' డని యందుము. విశ్వమునందలి సమస్త పదార్థములంధును పరివర్తనము జరుగుచుండును. అందువలన అవి 'సత్' కావు. ఆత్మ, పరమాత్మ ఈ రెండే 'చిత్' పదార్థములు. ఇవి నిరాకారములు. ప్రపంచమందలి ఏ సాకార వస్తువుగాని, శరీర ధారిగాని దుఃఖములనుండి తప్పుకొనలేడు. మూడు కాలములలోను వానిలో 'ఆనంద' మనునది ఉండజాలదు. శీతోష్ణములు, ఆకలి దప్పులు, భయము, శోకము, రోగము, వృద్ధాప్యము, మృత్యువు మున్నగునవి ప్రతి సాకారుని లేక శరీర ధారిని పీడించును. పరమేశ్వరుడు ఈ రెండింటికి పూర్తిగా భిన్నుడు.కావున ఈశ్వరుడు సాకారుడని యెంచిన కలుగు మొదటి దోషము - ఆతడు సచ్చిదానందుడు, నిర్వికారుడుగ నుండడు. ఏలన ప్రతిసాకార పదార్థమునందును జన్మము, వృద్ధి, క్షయము, జరామృత్యువు మున్నగు వికారములుండును. రెండవ దోషము - ఈశ్వరుని సాకారుడని విశ్వసించినచో ఆతడు సర్వవ్యాపకుడుగా నుండలేడు.

'ఏకదేశి' యగును. ఏలన ప్రతిసాకార వస్తువు 'ఏకదేశి' అనగా ఒకే స్థానముననుండును. మూడవ దోషమేమన, ఈశ్వరుడు సాకారుడగుచో ఆయన అనాది, అనంతుడుగా నుండజాలడు. ఏలన ప్రతిసాకార (రూపముగల) వస్తువు ఉత్పన్నమగు చుండును. కావున వానికి ఆది యుండును. ఆది అనాది, అనంతముగాజాలదు. ఆది యుండుదానికి తప్పక అంతముకూడ ఉండును. ఏది ఉత్పన్నమగునో అది తప్పక నశించును. ఒక తీరముగల దానికి రెండవ తీరముకూడ తప్పక యుండును. నాలుగవ దోషమేమన - ఈశ్వరుడు సాకారుడగుచో ఆయన సర్వజ్ఞుడుగానుండడు. ఏలన సాకారుడగునేని ఒకే స్థానముననుండును. అంతట నుండజాలడు. అంతట ఉండనివానికి సకల స్థానములందలి జ్ఞానముగూడ ఉండదు. ఒకే స్థానపు జ్ఞానముండును. అట్లు ఈశ్వరుడు సర్వాంతర్యామి కాజాలడు. ఏలన ఆతడు ప్రతిప్రాణి మనస్సును తెలిసికొనజాలడు.

ఇక ఐదవ దోషమును చూడుము. సాకారుడగుచో ఈశ్వరుడు నిత్యుడుగాక అనిత్యుడైపోవును. నిత్యమనగా ఒక పదార్థపు ఉనికికి ఏకారణము లేకపోవుట, అది ఏ యితర పదార్థము కలిసినందున ఏర్పడినది గాకుండుట. సాకార పదార్థము తత్త్వముల కలయిక వలన ఏర్పడినదై యుండును.

ఆరవ దోషమేమన - పరమాత్మ సాకారుడగుచో సర్వాధారుడు గాజాలడు. పరాధారు (పరాధీను)డగును. ఆయన సర్వాధారుడెట్లనగా, విశ్వమంతయును ఆయన ఆధారముననే నడచుచున్నది. బ్రహ్మాండమునంతయును ఆయనయే ధరించియున్నాడు. పరమాత్మ సాకారుడని యెంచినచో ఆయన ఎవరో ఒకరిపై ఆధారపడి యుండవలెను. ఈ కారణమువల్లనే మతవాదులు ఈశ్వరుని సాకారునిగా నెంచి ఆయన ఉనికికి స్థానముల నేర్పరచినారు. ఆయన స్థానము వైకుంఠమని, కైలాసమని, గోలోకమని, క్షీరసాగరమని, ఏడవ ఆకాశ మని, నాల్గవ ఆకాశమని, ఆయా స్థానములందు ఆయన ఉండునని వివిధ మతస్థులు తెలుపుచుందురు. లోకులు ఆయనకు ఆకారమును కల్పించి సర్వాధారుడు, జగదాధారుడగు నాతనికి జగత్తును ఆధారముగా జేసినారు.

ప్రపంచమే పరమాత్మునకు ఆధారమైనచో ప్రపంచమునకు ఆధారమేమి? పరమాత్ముని సాకారునిగానెంచునప్పుడిట్టివే ఇంకెన్నియో దోషములు గలుగును.

ఇందిర : - విద్వాంసుల అభిప్రాయమేమన. ఈశ్వరుడు నిరాకారుడే. ఐనను అవసరమునుబట్టి అవతారమును దాల్చి సాకారుడగును. ఎట్లన, ఆవిరి నిరాకారము. కాని కాలమునుబట్టి ఘనీభవించి మేఘములేక మంచు రూపము దాల్చును. అగ్ని సర్వవ్యాపకమైనదే. నిరాకారమైనదే. ఐనను సమయ మాసన్నముకాగా స్థూలరూపమున ప్రత్యక్షమగును. ఇట్లే అనేక ఉదాహరణముల నీయవచ్చును. భౌతిక పదార్థములే నిరాకారమునుండి సాకారముగ మారునప్పుడు పరమాత్మ నిరాకారమునుండి సాకారముగా ఏల మార్పు చెందలేడు?

సువర్ణ : - నీవిచ్చిన ఆవిరి, అగ్ని ఉదాహరణములు సరిగాలేవు. కొంచెము లోతుగా ఆలోచించుము. ఆవిరి, అగ్ని ప్రత్యేక పదార్థములు గావు. అవి అనేక పరమాణువుల సముదాయము. జలముయొక్క అసంఖ్యాక సూక్ష్మ పరమాణువులే ఆవిరిగా మారిపోవును. అట్టి పరమాణువులే మరల స్థూల రూపముగ మారి మేఘములు, మంచు, జలమువంటి రూపములను దాల్చును. ఆవిరి ఒకే పరమాణువగుచో ఏకరసముగా నుండుచో ఎప్పుడును స్థూలముగా కుండెడిది. అగ్నియొక్క పరమాణువుల స్థితికూడా ఇట్టిదే. అవి అనేకమైన కారణమున పరస్పరము కలిసికొని స్థూలమగును. అగ్నివంటి ప్రచండ రూపమును ధరించును. అగ్ని సర్వ వ్యాపకము, నిరాకారమని నీవు చెప్పుట గొప్పపొరపాటు. అగ్ని పృథివి జలములకన్న సూక్ష్మమే. కావుననే యది పృథివి, జలములందు వ్యాపించి యుండగలదు. కాని ఆకాశ వాయువులందు కాదు. ఐనను ఆకాశము, మరియు వాయువు ఈ రెండును అగ్నియందు వ్యాపించియున్నవి. ఏలన ఇవి రెండును అగ్నికన్నను సూక్ష్మమైనవి. సూక్ష్మ పదార్థములు స్థూలమునందు వ్యాపించి యుండగలవు. ఏయే పదార్థములందు అగ్ని వ్యాపించియున్నదో ఆయా పదార్థములన్నియు రూపము గలవియే. విశ్వమునందు మనకు గాన్పించు రూపములన్నిటికి కారణము వానియందు అగ్ని వ్యాపించి యుండుటయే. అగ్నియొక్క వ్యాపకత్వమే. ఏలన అగ్ని గుణమే రూపము. కావున అనేక

పరమాణువుల కలయిక వలననే భౌతిక పదార్థములు సూక్ష్మమునుండి స్థూల రూపమునకు, స్థూలమునుండి సూక్ష్మ రూపమునకు మారుచుండును. పరమాత్మ సర్వ వ్యాపకుడు. అద్వితీయుడు. ఏకరసుడు. కావున ఆయన నిరాకారమునుండి సాకారుడు కాజాలడు. ఇక మిగిలిపోయిన ప్రశ్న. " పరమేశ్వరుడు ఆయా సమయములందు అవతారములను ధరించు"ననునది. ఇది అచ్చమగు కల్పనకన్న మరేమియునుగాదు. చూడుము. "అవతార" శబ్దమున కర్థము దిగుటయని. దిగుట, ఎక్కుట యనునది ఏకదేశీయము. అనగా ఒకే స్థానమునందుండు పదార్థములకు వర్తించగలదు. సర్వవ్యాపకమునకు వర్తించదు. అంతట వ్యాపించి యున్నదానికి రాకపోకలు, ఎక్కుట దిగుటలు పూర్తిగా అసంభవము. సర్వమున నిండియున్న దెచ్చటినుండి రాగలదు? ఎచ్చటికి పోగలదు?

**ఇందిర :** - రావణుడు, కంసుడు, హిరణ్యాకశ్యపుడు మున్నగు దుష్టులను సంహరించుటకు ఈశ్వరుడు అవతారములను ధరించలేదా? భవిష్యత్తులో దుష్టదమనమునకు ఈశ్వరుడు అవతారములను ధరించడా? ధర్మమునకు హాని గలుగునప్పుడెల్ల అవతారముండునని నేను వినియున్నాను. ఇది నిజముకాదా?

**సువర్ణ :** - ఈశ్వరుని అవతారమనునది ఇదివరకు జరుగలేదు. భవిష్యమునందును జరుగదు. ఆయా సమయములందు మహాపురుషులు జన్మించినారు. వారు దుష్టులను అణచివేసి ప్రజలకు సన్మార్గమును చూపినారు. ప్రజలు కృతజ్ఞతతో వారికి అనేక బిరుదములిచ్చినారు. అట్టి వారిని కొందరు 'ప్రవక్త' అని, మరికొందరు దేవదూతయని, ఇంకా కొందరు ఈశ్వరుని పుత్రుడనియు నమ్మినారు. కొందరు ఈశ్వరుని అవతారమని, మరి కొందరు సాక్షాత్తు ఈశ్వరుడనియే నమ్మినారు. కాని వారందరును మనుష్యులే. కావున చెల్లెమ్మా! కొంచెము నిదానముగా ఆలోచించుము. ఏ యీశ్వరుడు శరీరములేకయే శరీర ధారులను ప్రాణధారుల నుత్పన్నముచేయగలడో శరీర రహితుడగు ఆ పరమాత్మ శరీర ధారులగు ప్రాణులను చంపజాలడా? ఇప్పుడు కూడ అసంఖ్యాక ప్రాణులు పుట్టుచు చచ్చుచున్నవి. ఈశ్వరుడు శరీర ధారుడై వాని యుత్పత్తి వినాశములు నొనరుచున్నాడా? ఒక్క భూకంపమువలన

కోట్లాది ప్రాణులు మరణించును. ఒక్క తుఫాను (జంఝామారుతము) వల్ల మహానగరములు సైతము విధ్వంసమగును. ప్లేగు, మహమ్మారి, కలరా మున్నగు వాని వల్ల లక్షల మనుష్యుల సంహారము జరుగును. అట్టి తుచ్ఛ ప్రాణులను సంహరించుటకు ఈశ్వరునకు అవతారము లెత్తవలసి వచ్చునా? ఎంత చిత్రము ఆయన ముందు ఈ రావణ కంసాదులు తృణప్రాయులు గూడ కారు. పరమాత్మ శరీరము లేకయే సృష్ట్యుత్పత్తి, స్థితి, ప్రళయములనొనర్చగలిగిన ప్పుడు దుష్టులను సంహరించుటకు అవతారములను ధరించెననుట హాస్యాస్పదము. ఇది ఆతనిని ఘోరముగ అవమానపరచుటగాదా? "ధర్మమునకు హాని గలుగునప్పుడెల్ల ఈశ్వరుడు అవతారమునెత్తు"నను మాటయును పొరపాటే. అవతారములను నమ్మువారు ఈ విషయమునే అధికముగా చెప్పుచుందురు. కాని ఈ విషయము వారి మాటల చేతనే ఖండింపబడుచున్నది.

అవతారవాదులు పది అవతారములు, నాలుగు యుగములు అనగా కృత (సత్య) యుగము, త్రేతాయుగము, ద్వాపర యుగము, కలియుగములు ఉన్నవని నమ్ముదురు. ఈ నాలుగు యుగములందు సత్యయుగమున ధర్మము నాలుగు పాదములతో నడచె నని, త్రేతాయుగమున మూడు పాదముల ధర్మము, ఒక పాదము అధర్మము, అట్లే ద్వాపరమున ధర్మము రెండు పాదములు, అధర్మము రెండు పాదములు, అనగా సగము పుణ్యము, సగము పాపము అని, ఇక కలియుగమున ఒక పాదము ధర్మము మిగతా మూడు పాదములు అధర్మమని నమ్ముదురు. ఇప్పుడు అవతార క్రమమును గూర్చి ఆలోచింపుము. కృతయుగమున నాలుగు అవతారములని, త్రేతాయుగమున మూడవతారములని, ద్వాపరమున రెండవతారములని, ఇక కలియుగమున ఒక్కటే అవతారమని, అది నిష్కళంక భగవానుని రూపమున చివరిదిగా ప్రకటమగుననియు నమ్ముదురు. చెప్పుచుందురు. ఇదియే ఇప్పుడాలోచించదగిన విషయము. సత్య యుగమున ధర్మము నాలుగు పాదములతో నడచినది. ఆ కాలమున అధర్మమను మాటయే లేదు. అట్టిచో నాలుగవతారముల ప్రయోజన మేమి? త్రేతాయుగమున ధర్మము మూడు పాదముల నడచినది. ఐతే అప్పుడొక అవతారమేల తగ్గినది? మూడు

అవతారములే ఏల యుండిపోయినవి? ద్వాపరమున సగము పుణ్యము, సగము పాపముండెను. అవతారములు రెండే మిగిలినవి. కలియుగమున ఒక్క పాదమే పుణ్యము, మిగతా మూడు పాళ్ళ పాపముండినప్పుడు ఒక్కటే అవతారమెందుకు? అదియును కలియుగాంతముననే వచ్చి ఏమి చేయును? అధర్మము (పాపము) పెరిగిన కొలది అవతారముల సంఖ్య వృద్ధిగావలసి యుండెను. కాని జరిగిన దేమి? ఎట్లెట్లు అధర్మము పెరుగుచుపోయినదో అట్లట్లు అవతారముల సంఖ్య తగ్గుచు వచ్చినది. ధర్మమునకు హాని కలుగుటకును, అవతారములకును సంబంధ మేమియో ఇప్పుడు చెప్పుము.

**ఇందిర:-** అవతారములు మానవులు చూపలేని గొప్ప చమత్కారములను చూపినవి. గోవర్ధన పర్వతమును చిటికెన వ్రేలిపై ఎత్తి నిలుపుట మున్నగునవి. కావున అట్టివారు ఈశ్వరావతారములే యని ఒప్పుకొన వలసియుండును.

**సువర్ణ :-** వాస్తవమునకు ఈ పర్వతమును వ్రేలిపై ఎత్తి యుంచినాడను విషయమే నమ్మదగినది కాదు. ఒకవేళ ' దుర్జనతోష న్యాయముగా' దీనిని నిజమని విశ్వసించినను దీనియందు ఈశ్వరుడు, లేక ఆయన అవతారముల గొప్పదనమేమియును లేదు. ఎందుకని నీవడుగుదువేమో! వినుము. సూర్యుడు, నక్షత్రములు, మున్నగు గ్రహములను, ఉపగ్రహములను తన శక్తిచే ధారణమొనర్చియున్న పరమేశ్వరునికి ఈ గోవర్ధనము మున్నగు పర్వతములు ఒక ఆవగింజంతయైనను గావు. ఏ భూమిపై మనమున్నామోదానిపై చిన్న పెద్ద పర్వతములు లక్షలకొలది యున్నవి. ఇట్టి భూమినే పరమాత్మ ధారణమొనర్చి యున్నాడు. ఇక యా గోవర్ధనపర్వతమొకలెక్కలోనిదా? ఈశ్వరుడో, ఆయన అవతారమో గోవర్ధన పర్వతమును ఎత్తి నిలుపుట ఒక పరాక్రమ విషయమా? ఎమ్.ఏ విద్యార్థి యొకడు రెండవ మూడవ శ్రేణికి సంబంధించిన ఏదేని ప్రశ్నకు సమాధానమిచ్చిన ఆతని గొప్పదనమేమి? ఒకవేళ ఎమ్.ఏకు సంబంధించిన ఏదేని ప్రశ్నకు రెండవ, మూడవ తరగతి బాలుడు సమాధానమిచ్చిన వాస్తవముగ అది ప్రశంసించదగిన విషయమే. ఇదే విధముగ ఎవరో ఒక మనుష్యుడు పర్వతము నెత్తిన వాస్తవముగ నది చమత్కార విషయమే. ఏలన,అతడు ఆశించ నంతటి కార్యమును చేసిచూపినాడు. కాని ఈశ్వరుని అవతారము

ఒక్క పర్వతమును లేవనెత్తినాడని యనుకొనిన అదొక చమత్కారముగాని మహత్యము గాని కానేకాదు.

**ఇందిర :** - మీ దృష్టిలో ఈశ్వరుడవతారమెత్తనిచో ఆయన సర్వశక్తిమంతు డెట్లుకాగలడు? ఆయన ఈశ్వరుడై యుండియును అవతారమునైన ఎత్తజాలకున్న ఆయన సర్వశక్తిమంతుడెట్లనబడును? సమస్తము నొనర్చువాడే సర్వశక్తిమంతుడనబడునుగదా!

**సువర్ణ :** - సోదరీ! నీ వాలోచించవెందుకు? ఈశ్వరుడవతారములనెత్తు చుండిన సర్వశక్తిమంతుడు కాజాలడు. అదెట్లో వినుము. పరమేశ్వరుడు అవతారము నెత్తుటకు పూర్వము చేతులు లేకయే సమస్త కార్యము లొనర్చుచుండెను. ఇప్పుడు చేతులతో చేయును. పూర్వము కన్నులు లేకయే విశ్వమునంతయును చూచుచుండెను. ఇప్పుడు కన్నులవసరమైనవి. చెవులు లేకయే సర్వము వినుచుండువానికిప్పుడు చెవులు కావలసి వచ్చినవి. తాత్పర్యమే మనగా, ఆయన అవతారము లెత్తుటకు పూర్వము తన కార్యములన్నియు శరీరము లేకయే చేసికొనుచుండెను. ఇప్పుడు శరీరము నాధారముగా గొని కార్యములొనర్చుకొనవలసి వచ్చినది. శరీరమునకు, ఇతరులకు లోబడినవాడు సర్వశక్తిమంతుడెట్లు కాగలడు? అల్పజ్ఞుడగు జీవాత్మ తన కార్యములను శరీర మునకు లోబడి నిర్వహించుకొనునట్లే పరమాత్మయును శరీరమునకు లోబడిపోయినచో అల్పజ్ఞుడగు మానవునకు, సర్వజ్ఞుడు, సర్వశక్తి మంతుడునగు పరమాత్మకు భేదమేమున్నది? మనుష్యుని ఆకలిదప్పులు, శీతోష్ణములు బాధించునట్లే ఆయననుకూడ బాధించును. అన్నిటికన్న గొప్ప దోషమేమనగా ఈశ్వరుడు అవతారమునెత్తిన వెంటనే పరాధీనుడైపోగలడు. స్వాధీనుడుగా నుండజాలడు. అప్పుడాయనకు భోజన మవసరమగును. జలము కావలసియే వచ్చును. వస్త్రములు లేకున్న బాగుండదు. నివాసమునకు స్థానము తప్పనిసరి. సమస్త కార్యములను స్వశక్తితో చేయువాడు అవతారము నెత్తిన పిమ్మట శరీర సహాయమున కార్యములు చేయదొడగిన అతడు సర్వశక్తిమంతు డెట్లగును? ఒక వ్యక్తి మరొకరిని తన నేత్రముల ఆకర్షణ శక్తి (హిప్నాటిజం) ద్వారా మూర్ఛితునొనర్చగలడు. మరొకడు ఔషధము తినిపించి మూర్ఛితునిగా

జేయగలడు. ఇప్పుడు చెప్పుము. ఈ యిరువురిలో శక్తిమంతుడెవరు? ఆకర్షణ శక్తిద్వారా మూర్ఛితుని జేయువాడే శక్తిమంతుడు. ఏలన వాడు రెండవ వానిని మూర్ఛితునిగా జేయుటకు ఔషధమునకు ఆధీనుడుకాడు.

ఇప్పుడు నీకు చక్కగా తెలిసియుండును. ఈశ్వరునకు అవతారముల జంఝాటము లేనప్పుడే అతడు సర్వశక్తిమంతముగా నుండగలడు. సర్వశక్తిమంతుడు సకలము నొనర్చగలడను నీ యాలోచన భ్రాంతి పూర్వకమే. 'సర్వ శక్తిమంతుడు' అను శబ్దమునకు ఆయనయందు సర్వశక్తులు గలవని అర్థము. ఆయన విశ్వమందలి సూక్ష్మాతి సూక్ష్మ పదార్థములను కలుపను గలడు, వేరు పరచను గలడు. సృష్టిని ఉత్పన్నమొనర్చి, స్థిరపరచి, చివరికి ప్రళయమొనర్చను గలడు. మరియు ఆ సృష్టిని నియమము నందుంచను (నడపను) గలడు. దీని తాత్పర్యమేమన, పరమాత్మ తన కార్యములందు ఇతరుల సహాయమపేక్షించడు. ఇదియే పరమేశ్వరుని సర్వశక్తిమత్త్వము. కాని 'సర్వశక్తిమంతు'డనుదాని యర్థము అసంభవమును సంభవమొనర్చుట కానేకాదు.

**ఇందిర** :- ఏమేమీ! ఈశ్వరుడు అసంభవమును సంభవమొనర్చ జాలడా? అట్లగుచో ఆయన ఈశ్వరుడు కానేకాడు.

**సువర్ణ** : - అసంభవమును సంభవమొనర్చకుండుట, నియమమును అనియమమొనర్చకుండుటయే ఈశ్వరుని ఈశ్వరత్వము. ఒకవేళ నీవు ఈశ్వరుడు అసంభవమును సంభవమొనర్చగలడని తలచినచో నాయీ ప్రశ్నకు సమాధానమిమ్ము. ఈశ్వరుడు తన్ను తాను నశింపజేసికొనగలడా? తనకు సమానమగు మరో ఈశ్వరుని సృష్టించగలడా?

**ఇందిర** :- ఈశ్వరుడు తన్నుతాను నష్టపరచుకొనకపోయినను తాను సర్వశక్తిమంతుడగు కారణమున తనకు సమానమగు మరో ఈశ్వరుని అవశ్యముగా సృష్టించగలడు.

**సువర్ణ** : - కాదు చెల్లెలా! ఈశ్వరుడు తనవంటి రెండవ ఈశ్వరుని చేయలేడు. ఎందుకందువేమో! వినుము. నేడు ఈశ్వరుడు రెండవ ఈశ్వరుని చేసినాడని యనుకొనుము. ఇప్పుడాలోచించుము. ఈ చేయబడిన ఈశ్వరుడు ఈశ్వరుని సమానమైనాడా? ఎన్నటికి కాడు. ఎందుకు కాడందువా? వినుము.

ఒక ఈశ్వరుడు అనాది నుండి యున్నాడు. రెండవ క్రొత్తవాడు నిర్మింపబడినాడు. ఒకడు అనాది, మరొకడు సాదిగా నుండును. తేట తెల్లముగ చెప్పవలెనన్న ఒకడు నిర్మింపబడకనే యున్నవాడు. ఆయనకు ఆయువుతో సంబంధము లేదు. ఆయన నిత్యుడు. రెండవవాని యందు ఆయుష్యము నేటినుండి ఆరంభమైనది. ఏలన ఈతడు చేయబడినవాడు కదా! అనాదియగు ఈశ్వరుడు అంతట వ్యాపించియున్నాడు. ఈ చేయబడిన క్రొత్త ఈశ్వరుడు వ్యాప్యమైయున్నాడు. ఏలన, ఇరువును సర్వవ్యాపకులై ఉండనే యుండజాలరు. "సర్వ వ్యాపకముగా నుండనిచో నేమాయె. ఇరువురును సగము సగముగా నుండవచ్చునుగదా?" అని నీవనెదవు. సర్వవ్యాపకులుగానప్పుడు ఇరువురు ఈశ్వరులెట్లగుదురు? కావున 'సర్వశక్తిమంతు'డను దాని యర్థము ఈశ్వరుడు సర్వమును చేయగలడని కానేకాదు. ఈశ్వరుడు తాను చేయదగిన కార్యమునే ఇతరులపై ఆధారపడక చేయగలడు.

**ఇందిర :-** ఒకవేళ ఈశ్వరుని అవతారమును విశ్వసించినచో మనకు కలుగు హాని యేమి?

**సువర్ణ :-** ఈశ్వరుని అవతారముండనే ఉండదనునప్పుడు అతని అవతారమును విశ్వసించినచో సత్యమును ఉరిదీసినట్లే యగును. ఇది గొప్ప హానియే. ఇక రెండవ హాని యేమనగా వవిశ్వమంతటికి ఉన్నతిని చేకూర్చు పరమాత్మ అవినీతి పాలగును. ఏలన అట్లు చేసినచో ఆయన నారాయణునుండి నరుడు కాగలడు. నరునినుండి నారాయణుడగుట ఉన్నతికి సూచన యనవచ్చును. కాని నారాయణునుండి నరుడగుట యనునది సంపూర్ణముగా తన ఉన్నత పదవినుండి దిగజారుటయే యగును. ఒక భిక్షకుడు రాజైనచో అది నిజముగా ఆతని ఉన్నతియే. కాని ఒక రాజా భిక్షకుడుగా మారిపోయిన ఆతడు ఉన్నతిని చెందినాడని అమాయకులు తప్ప ఇంకెవరనగలరు? మూడవ హానియేమన, ప్రతి పాషండుడు (వేద బాహ్యుడు) తన్నుతాను ఈశ్వరావతారు నిగా చాటుకొని అమాయక స్త్రీ పురుషులను తన వలలో చిక్కించుకొని, వారిని పెడదారిని పట్టించి వారి ధర్మకర్మలను నష్టమొనర్చును. ఆశ్రయించిన వారిని శిష్యులు, శిష్యరాండ్రనుగా నొనర్చుకొని వారినుండి సమర్పణ రూపమున ధనమునుకాజేయుచు ఆనందమున నోలలాడుచుండును. భారత దేశములో

ఇట్టి పాషండుల ఉదాహరణము లెన్నియో గలవు. వారు తమను అవతారముగా చాటుకొనుచు మిక్కిలి అమాయకులగు ఎందరో స్త్రీ పురుషుల ధనమును, ధర్మమును నష్టపరచుచున్నారు. నాల్గవ హాని యేమనగా మానవులు అత్యాచార ములను సహించు అలవాటు కలవారగుచుందురు. దుష్టులు, మోసకారులు, దోపిడీదారులు వారిపై అత్యాచారముల నొనర్చినప్పుడు అక్కచెల్లెండ్ర, కూతుళ్ళ శీలమును, సంపదను నష్టపరచినప్పుడు ఇండ్లను, దుకాణములను కొల్లగొట్టినప్పుడు అవతారవాదులు 'ఇది సద్గురు లీల' అని సరిపెట్టుకొని ఉన్మత్తులై యుందురు. అట్టివారు అన్యాయమును, అత్యాచారమును ఎదుర్కొ నుటకు సిద్ధముగానుండలేరు. వారేమనుచుందురో తెలియునా? "అన్యాయమును, అధర్మమును నిలిపివేయుట యనునది తమ వశములోని విషయము కాదు. ఈశ్వరుడు అవతారమును దాల్చి వారిని నాశనమొనర్చి ధర్మ స్థాపన మొనర్చగలడు. అప్పుడు పాపాత్ములందరు నశించిపోవుదురు. పృథివీ (భూమాత) భారము తగ్గిపోయి తేలికపడగల"దని చెప్పుచు చేతులు దులుపుకొందురు. వాస్తవమునకిది మహాసోమరితనమే. ఈశ్వరుని అవతారమును విశ్వసించని జాతులు స్వయముగా నిలద్రొక్కుకొని, ఢీకొని శత్రువులను నాశనమొనర్చును. దుష్టులు నాశమగుదురు. ఈ సోమరితనము ఈశ్వరుని అవతారమును విశ్వసించు కారణముననే ఉత్పన్నమైనది. అత్యాచారములను, అన్యాయములను తొలగించుటకే ఈశ్వరుడవతారముల నెత్తుచుండునని ధీరులెప్పుడును విశ్వసించరు. ఈశ్వరుడు కాళ్ళు చేతులు అత్యాచారుల కిచ్చినట్లే మనకును ఇచ్చినాడని నిలద్రొక్కుకొని పోరాడి శత్రువులను నాశమొనర్తురు. తామొనర్చదగిన కర్మను ఈశ్వరునిపై నెట్టివేయరు. కావున సోదరీ! ఈ అవతారవాద సిద్ధాంతము ఆర్యజాతిని ఎంతో పతితము, పదదళితమొనర్చివేసినది. ఇది జాతినుండి ఆత్మ విశ్వాసమును సంపూర్ణముగ తొలగించినది.

**ఇందిర:-** అక్కయ్యా! నీ ఉపమానముల ప్రభావము నాపై ఎంతయోపడినది. ఒక్క విషయమునాకింకా తెలియకున్నది. అదేమన; ఈశ్వరుడు నిరాకారుడగుచో మనమాయన ధ్యానమునెట్లు చేయగలుగుదుము?

**సువర్ణ : -** పరమాత్ముని కృపవల్లనే ఈ సత్య సిద్ధాంతముల ప్రభావము పడినది. ఇప్పుడు నీవడిగిన ప్రశ్నను గురించి మనము రేపాలోచించుకొందము. నేటికింతయే చాలు.

**నమస్తే.**

# ఈశ్వరధ్యాన మెట్లు చేయవలెను?

(ఐదవ దినము : - ప్రాతఃకాలము)

**ఇందిర:-** అక్కయ్యా! "ఈశ్వరుడు నిరాకారుడగుచో ఆయన ధ్యానమెట్లు చేయనగును?'' అను నిన్నటి ప్రశ్నకు నేడు సమాధానమిమ్ము.

**సువర్ణ :-** 'ధ్యాన' మనునది రెండు విధములు. మొదటిది: ప్రాపంచిక ప్రాణులు, ప్రాపంచిక పదార్థముల ధ్యానము. రెండవది : సర్వవ్యాపకుడు, సర్వనియంత, ఇంద్రియములకు వేరై యుండు పరమ ప్రభువగు పరమాత్మ ధ్యానము. ఇక ప్రపంచ సంబంధ వస్తువుల జ్ఞానము వానిని చూచినప్పుడు లేక వాని వినియోగము జరిగినప్పుడు కలుగును. ఎట్లన ఒక సోదరిని నేను భాగ్యనగరమున చూచితిని ఆమెతో పరిచయమైనది. మరల ఐదారు సంవత్సరముల తరువాత నేనామెను ఇందూరులో చూచినాను. ఆమెను చూచిన వెంటనే నేనామెను ఐదారు సంవత్సరముల క్రిందట భాగ్యనగరమున చూచితినని తెలిసిపోయినది. రెండవది : వియోగమగుటచే కలుగు జ్ఞాపకము (ధ్యానము). అనగా నాకు అత్యంత ప్రియమగు స్నేహితురాలు బయటి ప్రదేశమునకెచ్చటికో భ్రమణమునకు వెళ్లినది. ఆమె నాకిప్పుడు పదేపదే జ్ఞాపకమునకు వచ్చుచున్నది. "ఆమె ఇప్పు డెచ్చట నుండును?'' మే మిరువురము పరస్పరము చూచుకొంటున్నప్పుడు ధ్యానముతో సంబంధము లేనే లేదు. ఎదుటనున్న వస్తువుపై ధ్యానమనునదెట్లు? వియోగము జరిగినప్పుడే ఆమె ధ్యానము జరుగును. ఇది ప్రాపంచిక వస్తువుల ధ్యాన విషయము. ఇక పరమేశ్వరుని ధ్యానము ఇందు కు పూర్తిగా భిన్నముగా నుండును. ఈశ్వర ధ్యానమనగా మనస్సును నిర్విషయ మొనర్చుట. అనగా మనస్సు, మరియు ఇంద్రియములందు వ్యాపించియున్న ఆత్మిక శక్తులను ఆత్మయందే ఏకత్రితమొనర్చుట. మనస్సు మరియు ఇంద్రియ ములు ప్రాపంచిక విషయములలో తగులుకొని యున్నంతవరకు ఆత్మ ఈశ్వరుని ధ్యానము చేయజాలదు. ఈశ్వరుని ధ్యానమొనర్చుటకు మనస్సును మరియు ఇంద్రియములను అభ్యాసము ద్వారా విషయములవైపు పరుగెత్త నీయకుండుటవసరము. 'ధ్యాన'మనునది యోగమునగల అష్టాంగములందు ఏడవ అంగమని మరువవలదు. మొదట

'యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణము''లను షడంగములను అభ్యాస పూర్వకముగా పాలన మొనర్చుట అత్యావశ్యకము. అప్పుడే మనుష్యుడు ధ్యానమున కధికారి కాగలు గును. నియమానుసారముగ ఈ షడంగములను పాలించుట జరిగినప్పుడు ధ్యానము సులభముగ సిద్ధించును. ఈ ఆరంగముల తరువాతనే ధ్యానమునకు స్థానముండగా అది మూర్తి ద్వారా ఎట్లు సాధ్యమగును?

**ఇందిర:-** అక్కయ్యా ఈ మనస్సు మిక్కిలి చంచలమైనదిగదా! నిరాకారమందెట్లు నిలువగలదు? దీనిని నిలుపుటకు సాకార వస్తువు సహకారము కావలసియుండును. సాకార పదార్థము లేకుండ మనస్సు స్థిరపడజాలదు గదా!

**సువర్ణ : -** నా ముద్దుల అమాయక సోదరీ! మనస్సు నిరాకారమునందు మాత్రమే స్థిరమగును. సాకారమునందు మనస్సు స్థిరము కానేకాదు. ఏలన సాకార వస్తువులు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ విషయకములై యుండును. కావున ఆ విషయములందు చిక్కుకొని మనస్సు చంచలమందును.

**కురంగ మాతంగ పతంగ భృంగాః మీనాః హతా పంచభిరేవ పంచ**
**ఏకః ప్రమాదీ స కథం న హన్యతే యః సేవితే పంచభిరేవ పంచ॥ మను॥**

లేడి, ఏనుగు, మిడత, భృంగము చేప ఇవి యైదును ఒక్కొక్క విషయమునందే చిక్కుకొని నశించుచున్నవి. ఓ మానవా! నీ వొక్కడవు ఈ యైదు విషయములందు చిక్కుకొనినచో నీ గతి యేమగునో ఆలోచించలేవా? (అనువాదకుడు)

సాకారవస్తువులందు మనస్సు స్థిరమగుననిన ప్రపంచమంతయును సాకారమే గదా! అందరి మనస్సు స్థిరపడిపోయేదే. కాని అట్లు జరుగదు. సాంసారిక విషయములందెట్లెట్లు మనస్సు చిక్కుకొని పోవునో అట్లట్లే మానసిక చంచలత్వము వృద్ధియగుచునే యుండును. ఒకవేళ నీవు నిదానముగా, లోతుగా ఆలోచించినచో మనస్సు స్థిరముగా నుండునది గాదని నీకు తెలిసిపోవును. మనస్సును స్థిరపరచునది కేవల మొక మృత్యువే. మనస్సు లేక హృదయము నడక ఆగిపోవుటయే మృత్యువు. మనస్సు నిలిచిపోలేదనగా మనుష్యుడు మరణించలేదని భావము. వాస్తవమునకు మనస్సుయొక్క బాహ్యావృత్తులు అంతర్ముఖమగుటయే మానసిక స్థిరత్వము. మానవుడు జీవించి యున్నంతవరకు

మనుష్యుని మనస్సు గతి శీలముగానే యుండును.

ఇందిర : - ఐతే మూర్తి ద్వారా ఈశ్వరధ్యానము నొనర్చువారు పొరపాటు చేయుచున్నారా? నా అభిప్రాయానుసారము మూర్తి ద్వారా మానసిక చంచలత్వము తొలగిపోగలుగును. కావుననే మనుష్యులు రాముడు, కృష్ణుడు మున్నగు మూర్తులను పూజించుచుందురు.

సువర్ణ:- మూర్తి ద్వారా ఈశ్వర ధ్యానమెప్పుడు జరుగజాలదని, "ధ్యానం నిర్విషయం మనః॥" (యోగదర్శనము) మనస్సు విషయములనుండి తొలగుటయే ధ్యానమని నేను మొదటనే చెప్పియుంటిని. మూర్తియందీ 'ఐదు' విషయములు ఉండనే యున్నవి. స్థూలముగా చెప్పవలెనన్న మూర్తియందు రూపముండనే యున్నది. మనము సమర్పించు మిష్టాన్నములు, పాలు, జలములందు రసము గలదు. పుష్పములందు గంధము గలదు. మనము మ్రోగించు గంటలు, జేగంటలయందు శబ్దమున్నది. ఇకపోతే స్వయముగానే మూర్తి ఈయైదు తత్త్వములతోగూడియున్నది. దాని ధర్మమే శబ్ద స్పర్శరూప రసగంధయుక్తము, ఐనప్పుడు మూర్తిద్వారా మన మానసిక చంచలత్వమెట్లు తొలగగలదు? మూర్తి ద్వారా మనోచాంచల్యము దూరమగునన్న లోకులు నిర్మాణమొనర్చు శ్రీకృష్ణుని మూర్తియే కాదు నిజమునకు సాక్షాత్తు శ్రీకృష్ణుడే అర్జునుని యెదుట నున్నప్పుడు అర్జునుని మనోచాంచల్యము తొలగిపోలేదు. అప్పుడర్జునుడు శ్రీకృష్ణునితో

**"చంచలం హి మనః కృష్ణ ప్రమాధి బలవద్దృఢమ్॥**
**తస్యాహం నిగ్రహం మన్యేz వాయోరివ సుదుష్కరమ్ "॥ గీత 6 -34॥**

అనగా మనస్సు మిక్కిలి చంచలము. మొండిపట్టు మరియు ధృఢత్వము గలది. దానిని నిలుపుట వాయువువలె అత్యంత కఠినమనుకొనుచున్నాను.

ఇది విని శ్రీకృష్ణచంద్రుడిట్లనుచున్నాడు.

**"అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహం చలమ్ ।**
**అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేన చ గుహ్యతే" ॥ గీత 6 -35॥**

అర్జునా! మనస్సు మహా చంచలము,పట్టుదల కలదనుటలో సందేహ మేమియును లేదు. ఐనను అభ్యాసము మరియు వైరాగ్యము ద్వారా దానిని వశపరచుకొనవచ్చును. సాక్షాత్తు శ్రీకృష్ణుడు ఎదురుగానున్నప్పుడే అర్జునుని

మనస్సు స్థిరపడలేదు. ఇంతేకాదు రాత్రింబవళ్ళు అర్జునుడు శ్రీకృష్ణుని చూచుచు మాట్లాడుచుండెడివాడు. ఐనప్పుడు కృత్రిమమగు జడపదార్థముచే నిర్మించబడిన శ్రీకృష్ణుని ప్రతిమతో మనస్సు ఎట్లు స్థిరము కాగలదు?

**ఇందిర:-** ఐతే మూర్తి పూజ చేయనేవలదా?

**సువర్ణ:-** మూర్తి పూజ చేయవలెను. కాని నిర్జీవమూర్తి అనగా జడమూర్తి పూజ జడమునకు వలెనే, జీవముగల అనగా చేతనమూర్తి పూజ చేతనమునకు వలెనే చేయవలెను.

**ఇందిర:-** "జడమూర్తి పూజ జడమునకువలె, చేతన మూర్తి పూజ చేతనమునకు వలెనే చేయవలె"ననుదాని ఉద్దేశ్యమేమో తెలియుటలేదు.

సువర్ణ:- పూజ అనుశబ్దమునకు ధాతువు సంబంధ మరియు వ్యావహారిక సంబంధ అర్థములెన్నియో యున్నవి. 'పూజ' అనగా ఆదరసత్కారము లొనర్చుట. పూజ అనగా ఏదేని వస్తువును తగు విధముగా వినియోగమొనర్చుకొనుట, పూజ యనగా తగు రీతిలో రక్షించుట, ఉచిత రీతిలో దండించుట కూడా యగును. జడమూర్తి పూజ యనగా నేమో ఇప్పు డాలోచించుము. అట్టి జడ వస్తువును అందముగా, భద్రముగా విరిగిపోకుండా, పగిలిపోకుండా సురక్షిత స్థానమున నుంచుట. దుమ్ము, ధూళిగాకుండా శుభ్రమగు కప్పడము ద్వారా జాగ్రత్తగా నుంచుట. ఇచ్చట ఉచిత రీతిలో ప్రయోగించుట, ఉచిత రీతిలో రక్షించుటయే జడమూర్తి పూజ. 'పూజ' అను శబ్దమునకు ప్రతి వస్తువు ముందు శిరస్సువంచుట, పత్ర పుష్పములను మిష్టాన్నమును సమర్పించుట కానేకాదు. సక్రమముగ వినియోగించుకొనలేని వానియెదుట రుచిగల, విలువైన పదార్థముల నెన్నియుంచినను నిష్ఫలమే గదా! ఎవడో ఒకడు ఈ మహాత్ముని పొట్టపూజ చేయుమన్నప్పుడు దాని యర్థమేమైనది? "ఆయనను సంతృప్తిగా భుజింప జేయుమనియే" కాని ఈయన కడుపుపై జలములను, పత్ర పుష్పఫలములను, క్షీరాన్న మిష్టాన్నముల నుంచి నమస్కారమొనర్చి మరల తీసికొని మ్రింగివేయుడని కాదుగదా! ఇంకొక అర్థము ఈ దుర్మార్గునికి పృష్ఠ (వీపు) పూజ చేయుమని చెప్పినప్పుడు

దాని యర్థము ఈ దుష్టుని వీపుపై నాలుగు లాఠీ దెబ్బలు వేసి గట్టిగా శిక్షించుమని అర్థమగును. ఇదియే జడపూజకు సరియైన అర్థము. ఏలన, ఆ నిర్జీవ జడపదార్థము (మూర్తి )లో, మన శ్రద్ధాసక్తుల నర్థము చేసికొనుటగాని, మనము సమర్పించిన నైవేద్యములను వినియోగించుకొను శక్తిగాని లేదు. ఇక చైతన్యమూర్తులు అనగా మాతాపితరులు, గురుజనము, విద్వాంసులు, అతిథులు, సాధువులు, సన్న్యాసులు, ఉపదేశకులు మరియు ఇతర ప్రాణులన్నియును మనము సమర్పించిన తినుబండారములను, మిష్టాన్నములను సంతృప్తిగా భుజించి మనను హృదయ పూర్వకముగా ఆశీర్వదింతురు. కావున అట్టి వారిని అనేక యోగ్య పదార్థములతో సత్కరించవలెను. ఇచ్చట 'పూజ' అనగా శ్రద్ధతో ఆదరించుట,సత్కరించుట యనియే వాస్తవిక అర్థము.

**ఇందిర:-** ఈశ్వరుడు సర్వత్ర వ్యాపించియున్నాడు. మూర్తియందును. వ్యాప్తమై యున్నప్పుడు మూర్తినేల పూజింపరాదు? పూజించువారు రాతిని కాదు. అందు వ్యాపించియున్న పరమాత్మను పూజింతురుగదా!

**సువర్ణ:-** "ఈశ్వరుడు సర్వత్ర వ్యాపించియున్న కారణమున మూర్తియందును వ్యాపించియున్నాడు. సకల స్థలములందు నిండియున్నాడు. కావున అన్ని స్థలములు,అన్నివస్తువుల పూజ జరుగవచ్చు"నను నీ వాదన వాస్తవమైనదిగాదు. చూడమ్మా! పూజించువాడు జీవాత్మ, పూజ ఉద్దేశ్యము పరమేశ్వరుని దర్శించుకొనుటయే. కలిసికొనువారుభయులున్న స్థలమందే కలయిక సంభవమగును. ఈశ్వరునితో కలువ వలెనన్న అచ్చట ఈశ్వరుడు కలడు. కాని కలిసికొనగోరు జీవాత్మ అచ్చట లేదు. అప్పుడెవరితో కలిసికొనుట జరుగును? ప్రతి మనుష్యుని హృదయమందే జీవాత్మ పరమాత్మలుపస్థితులై యున్నారు. శ్రద్ధాపూర్వకముగా ప్రయత్నించినచో ఆ యిరువురి కలయిక అచ్చటనే జరుగగలదు. కావున ఈశ్వరుని దర్శించగోరువారు మనస్సును, ఇంద్రియములను తమ వశమున నుంచుకొని తమ హృదయములందే ఈశ్వరుని పూజించవలెను. ఈశ్వరుడు సర్వమున వ్యాపించి యున్నాడని తెలియును. సకల స్థానములందలి జలములు త్రాగుటకు యోగ్యమై యుండునా? పరమాత్మ ఉనికి డేగలు, పావురములు, పిల్లులు, పులులు, పాములందును గలదు. అట్లని

మనము పులులు, సర్పముల వద్దకి చేరి సయ్యాటలాడుకొనెదమా? పరమాత్మ మూర్తియందును కలడని దాని పూజయొనర్చవలెననుట కేవలము అజ్ఞానము, మరియు అమాయకత్వముకాక మరేమగును? పరమాత్మ పాలయందును, విషము నందును గలడుకదా! అట్లని మనము విషమును త్రాగగలమా? అయోగ్యమగు పదార్థములవైపు మనము చూడనైన చూడము. మూర్తి పూజకులు "మేము మూర్తులను గాదు అందు వ్యాపించి యున్న పరమాత్మను పూజించు చున్నా"మని యనుకొనుటయును అజ్ఞానమే. అలంకరించు వస్తువులందు, ఫలపుష్పములందు మున్నగు వానియందంతటను పరమాత్మ నిండియున్నాడు. ఆకాశము నీటికుండ మరియు ఇటుకయందును వ్యాపించి యున్నది. ఎవరైన కుండలోని నీటియందు గాన్పించు ఆకాశమును ఇటుకతో కొట్టదలచినచో అది మూర్ఖత్వమే యగును. ఏలన అందున్న ఆకాశమునకు ఇటుక తగలకపోగా కుండమాత్రము బ్రద్దలగునే కాని ఆకాశముగాదు. ఇదే విధముగా పత్ర ఫలపుష్ప మిష్టాన్నములను అమాయకులు పరమాత్మపై ఉంచుచున్నామని యనుకొనుచున్నారు. కాని యవి జడమూర్తిపైననేగాని పరమాత్మపైన గాదు. ఏలన మనము సమర్పించు ప్రతి పదార్థమునందును పరమాత్మ వ్యాపించి యున్నందున అది పరమాత్మపై పరమాత్మనుంచుటయేయగును.

**ఇందిర:-** మూర్తులపై మనము ఫలపుష్పములు మున్నగువానిని ఉంచకున్నను వానిని శ్రద్ధాపూర్వకముగా చూచుటవల్ల అందు వ్యాపకమైయున్న పరమాత్మ మరియు ఆతని మహిమ యొక్క జ్ఞానము ఆవశ్యకముగా గలుగగలదు.

**సువర్ణ:-** ఇదియును అజ్ఞానమే. ఇందిరా! కొంచెము శ్రద్ధతో ఆలోచింపుము. మూర్తిని చూచుటవల్ల వ్యాపక పరమాత్మ మరియు ఆతని మహిమయొక్క జ్ఞానము ఎట్లు కలుగును? నువ్వులందు తైలము వ్యాప్తమై యున్నది. కాని చూచువారికి కాన్పించునది తైలమా, నువ్వులా? వారెంత శ్రద్ధాసక్తులతో చూచినను నువ్వులు మాత్రమే కనిపించును. కాని నూనె కనిపించదు. నువ్వులను గానుగాడించి గట్టిగా నలిపివేసినప్పుడే అందున్న తైలము మనకు కాన్పించును. అట్లే మూర్తులందున్న భగవంతుని చూడవలెనన్న

యోగముద్వారానే అది సాధ్యమగును. ఇక మూర్తులందు భగవంతుని మహిమయొక్క జ్ఞానము : మానవుల చేతనే నిర్మింపబడు మూర్తులందు భగవంతుని మహిమకాదు కాని అందు శిల్పియొక్క నిర్మాణ కౌశలము మాత్రమే కాన్పించును. అట్లుగాక పరమాత్మ రచించిన పదార్థములందు పరమాత్ముని మహిమ తప్పక కనిపించగలదు. నీవు పరమాత్మయొక్క జ్ఞానమును చూడదలచినచో ఆలోచనా పూర్వకముగా ఆయన సృష్టినంతటిని అధ్యయన మొనర్చుము. అప్పుడు చూడుము. ఈశ్వరుడు సృష్టించిన సూక్ష్మాతి సూక్ష్మమగు పదార్థములు, మరియు ప్రాణులయందెంతటి మహిమ మరియు గొప్పదనము గలదో తెలియగలదు. కాని మనుష్య నిర్మిత జడములందు పరమాత్మ మహిమయొక్క చిహ్నము కూడ మనకు గాన్పించదు.

**ఇందిర:-** అక్కయ్యా. ఫలమనునది సర్వదా భావనయందే యుండును గదా! మూర్తిని ఈశ్వరుడని నమ్మకున్నను మనము దానియందు ఈశ్వర భావమునుంచి ఫలమును పొందగలము. ఏ మనుష్యుడైనను ఒకేసారి పై అంతస్థునకు చేరుకొనజాలడు. పైకి చేరవలెనన్న నిచ్చెనయో మెట్లో అవసరమగును. ఈశ్వర ప్రాప్తికొరకు మూర్తి పూజను నేను మొదటి మెట్టుగా భావింతును. కావున ఎవరైనను భగవానుని కల్పితమూర్తులను సిద్ధపరచుకొని దానిని మొదటి మెట్టుగా భావించుకొనిన దోషమేమున్నది?

**సువర్ణ:-** భావన ఏ వస్తువుయొక్క యథార్థరూపమును మార్చజాలదని జ్ఞాపకముంచుకొనుము. సున్నపు నీటియందు క్షీరభావన నుంచిన దాని నుండి వెన్న వెళ్లదు గదా! జలములందు అగ్ని భావన నుంచినచో అవి మన శీతలము (జలుబు)ను తొలగించగలవా? రాతిముక్కలో రొట్టె భావన నుంచిన అది మన కడుపు ఆకలిని తీర్చగలదా? భావన చేతనే ప్రతి కార్యము సాధింపగలిగినచో ప్రపంచములో దు:ఖమనునదే యుండకపోవును. దు:ఖితులుండకుందురు. పరిశ్రమచేయు అవసరమే లేకుండును. సత్యముపై ఆధారపడునదే నిజమైన భావన. అట్లుగాకున్న అది అభావనయే యగును. ఎవనికైనను విరేచన గుళికలందు శక్తిగలిగించు భావననుంచి మ్రింగించినచో విరేచనములు గాకుండునా? శక్తినిచ్చుమాట అటుంచి విరేచనములై ఉన్న శక్తి గూడ ఊడ్చివేయగలదు.

వస్తువునందుండు సహజ గుణము దానినెట్లు వదలిపోగలదు? కావున భావన ద్వారానే ఫలప్రాప్తి గలుగగలదని తలచుట వెఱ్ఱి భావనయే యగును.

చూడమ్మా! సోమనాథ మందిర పూజారులు జడమూర్తిని సాక్షాత్తు మహాదేవునిగా భావించుచుండిరి. మహ్మద్ గజ్నవీయను విదేశీయుడు దండెత్తి వచ్చినప్పుడు పండాలు, పూజారులు కర్తవ్యతావిమూఢులై చేతిపై చేయి వేసి కొని కూర్చుండి "అందరు గలిసి సోమనాథ స్వామిని ప్రార్థించుడు. మనము శత్రువుల నెదుర్కొను అవసరమేలేదు. మహాదేవుడు స్వయముగానే వచ్చి మ్లేచ్ఛులను సంహరించగలడు" అని యనుకొనిరి. దాని పరిణామమేమైనది? ఇతిహాసమును చదివిన వారెల్లరును చక్కగా నెరుగుదురు. ఒక సోమనాథాలయమే యేమి? ఇట్టి భావనలవల్లనే వేలాది మందిరములు నేలమట్టమైనవి. మూర్తులు ముక్కచెక్కలైపోయినవి. అనేకార్బుదముల, ఖర్బుదముల రూపాయలు, సువర్ణాభరణములు, రత్నరాసుల సంపదలు దోపిడీదారుల వశమై విదేశాలకు చేరవేయబడినవి. ఐనను లోకుల అంధ విశ్వాసములు తొలగిపోలేదు. చేయదగిన వారేమియు చేయకుండ జడమూర్తులందు చేతన భావననుంచిన పరిణామమే మైనదో చూడుము. మన దేశ పతనమున కిదియే మూల కారణము. ఇప్పుడు నీకు తెలిసినది గదా! అజ్ఞానతాపూర్ణ భావన ఎంతటి అనర్థదాయకము మరి యు దుఃఖదాయకమైనదో తెలిసికొంటివి కదా!

ఇక మూర్తి పూజ ఈశ్వర ప్రాప్తికి ప్రథమ సోపాన మనుకొనుట కూడా పూర్తిగా అబద్ధము, అజ్ఞానముతో కూడినదే. ఐనను చైతన్యమూర్తుల పూజ ఈశ్వర ప్రాప్తికొరకు ప్రథమ సోపానమని అనుకొనుట అనేకాంశములందు నమ్మ వచ్చును. కాని జడమూర్తుల పూజ మాత్రము కాదు. హిమాలయపర్వతము నధిరోహించుటకు ఒక జడమూర్తిని ప్రథమ సోపానమని యెంచిన ఎంచవచ్చును. కాని ఈశ్వర ప్రాప్తికి అది మొదటి మెట్టు ఎట్లు కాగలదు? దాని యందు జ్ఞానమే లేదుగదా? ఆంగ్లము చదువదలచినవానికి దాని మొదటి మెట్టు A B C D మున్నగు వర్ణములే యగును. సంస్కృతము లేక హిందీని చదువ దలచినచో అ, ఆ, ఇ, ఈ లు మున్నగు వర్ణములు వానికి మొదటి మెట్లే కాగలవు. కాని ఎవరైన ఏ, బీ, సీ, డీలు ప్రథమ శ్రేణియని యెంచి సంస్కృతమును

చదువుట ప్రారంభించినచో ఎట్లు చదువగలరు? ఎద్దానికేది సోపానమో తెలిసికొని ఆచరించిన ఫలము లభించును. ఈశ్వర ప్రాప్తికొరకు మెట్లు చేతన ప్రాణుల నిష్కామ సేవయే యగును. అనగా సత్సంగము, యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార ధారణ, ధ్యాన, సమాధి యనునవి వాస్తవములైన సోపానములే. ఈ మెట్లపైన నిరంతరము అధిరోహించుచుండుట ద్వారా వీనిని విధి పూర్వకముగ పాలన మొనర్చుట ద్వారానే ఈశ్వర ప్రాప్తి కలుగగలదు.

"భగవంతుని కల్పిత మూర్తులను చేసి పూజించుటచే కలుగుదోషమే మని" నీ వడిగితివి. దీనివల్ల ఒక్క దోషముగాదు. పెక్కు దోషములున్నవి. మొదటి దోషము: కృత్రిమ పదార్థములందు వాస్తవ గుణములను భావించి మనుష్యుడు తనను తాను మోసగించుకొనుచున్నాడు. ఎట్టి కల్పిత వస్తువైనను వాస్తవ వస్తువు కార్యము చేయజాలదని పశుపక్షి క్రిమి కీటకాదులకు సైతము చక్కగా తెలియును. పిల్లి యెదుట వాస్తవ రూప ఎలుక బొమ్మ నుంచిన పిల్లి దానిపై దుముకదు. భ్రమరము నెదుట మంచి అత్తరు పూసిన ఎంత చక్కని కాగితపు పూలనుంచినను అది దానిపై వ్రాలదు. ఇదే విధముగ ఇతర ప్రాణులేవి యును కృత్రిమ పదార్థములను జూచి మోసపోవు. కాని సమస్త ప్రాణులందును శ్రేష్ఠులమని గర్వముగా చెప్పుకొను మనుష్యులు కృత్రిమ పదార్థములచే ఇష్ట ఫలములను పొందదలచుట ఎంతటి అమాయకత్వము? ఇంతకన్న ఆశ్చర్య మే ముండును?

రెండవ దోషమేమన: ఈశ్వరుని కల్పిత మూర్తులను పూజించువారు తమ అవసరములన్నియును ఈశ్వరుని యందున భావింతురు. ఎట్లన మనుష్యుడు తనకువలెనే మూర్తికిని భోజనావశ్యకత కలదని భావించి మూర్తికి భోజనాదులను సమర్పించును. తాను వస్త్రములను ధరించునటుల ఈశ్వర రూపమని మూర్తికిని ధరింపజేయును. తాను స్నానమాడుట, తాను నిద్రించుట మేల్కొనుట, ఆ భూషణములను ధరించుట మున్నగు ఆవశ్యకతలన్నియు పరమాత్మకు తగిలించి తన అవసరములనన్నింటిని ఇతరులచే చేయించుకొను పరమాత్మ మనకేమి చేయగల"డనియైన ఆలోచించరు. " ఒక గ్రుడ్డివాడు మరొక గ్రుడ్డివానికి త్రోవ చూపగలడా?" అనియైనను తలచరు.

మూడవ దోషము:- ఈశ్వరుడొక్కడు. కాని ఆయన మూర్తులు అనేకములు. సాంప్రదాయకులెల్లరు తమతమ విశ్వాసములననుసరించి మూర్తులను చేసికొన్నారు. ఫలితముగా పరస్పర సాంప్రదాయక రాగద్వేషములు, వివాదములు, విరోధములు, పోట్లాటలు గలుగుచుండును. ఇందువల్ల జాతీయ (దేశ) సంఘటనమునకు గొప్ప నష్టము గలుగును. ఇంతకన్న దేశద్రోహమేముండును?

**ఇందిర:-** మీ ఉద్దేశ్యములో మూర్తుల నిర్మాణము, వాని పూజలు అనర్థకములనియేకదా! ప్రశాంత గీతములు, భజనలు, రాగతాళములు వినుచుండుట మరియు మహాపురుషుల చిత్రములను, మూర్తులను చూచుచుండుట, వారి భజనను వినుచుండుటవల్ల మనస్సునకు చక్కని శాంతిలభించును. వాని ప్రభావము మన మనస్సులపై పడుచుండునుగదా!

**సువర్ణ:-** మూర్తులను, చిత్రములను నిర్మించరాదని నా ఉద్దేశ్యము కానేకాదు. మూర్తులను చిత్రములను చేసికొనుము. ప్రపంచమందలి మహాపురుషుల చిత్రములను గీయించుకొనుము. చిత్రములను చేయించి యుంచుట వారి స్మృతులను నిలిపియుంచుట యగును. కాని చేతన మనుష్యులకు వలె వానిని పూజించుట వానిని పరమాత్మ లేక ఆయన ప్రతినిధిగా నెంచి ధర్మార్థ కామమోక్షములను యాచించుట సరికాదు. నిర్జీవ పదార్థములు నిర్జీవములే. అవి జీవితులైయున్న మానవుల లేక పరమాత్మ స్థానముననుంచపనికిరావు. జీవించియున్న తండ్రి పుత్రుని ప్రేమించగలడు. కాని మరణించిన తరువాతగూడ అట్లే ప్రేమించగలడా? ఏ శరీరము ద్వారా పుత్రుని తన ఒడిలోనికి తీసికొని తినిపించినాడో, ప్రాణములు పోయిన పిదప అదే శరీరము పుత్రునికి ఏమైన పనికివచ్చునా? ఆ మరణించిన తండ్రి శరీరమునందు, మరియు శిలా నిర్మిత మూర్తియందు ఏమైన భేదమున్నదా? రాయి, లేక ధాతువుతో నిర్మింపబడిన మూర్తులు కుళ్లిపోవు. కాని మృతకుని శరీరము కుళ్లిపోవును. కేవలము ఈ రెండింటి యందిదియే భేదము. మూర్తులను చక్కగా ఉపయోగించుకొనుటయే వాని పూజ. ఒకవేళ అట్లు ఉపయోగించుకొననిచో ఆ పదార్థము లే మనుష్యునకు హానిని గలిగించగలవు.

అదెట్లు సంభవమని నీ వడిగెదవేమో! ఐతే వినుము.

ఒక భక్తుడు గంగాదేవి (నది)ని పూజించును. ఆ నదీమతల్లి మూర్తిని పూజించుచుండును. పూలు, పండ్లు, పాయసములు సమర్పించుచు గంగానది స్తోత్ర గీతములను పరమభక్తితో గానమొనర్చుచుండును. ప్రతి దినము వేకువనే గంగానదికి వెళ్ళి స్నానమాడి వచ్చెడివాడు. కాని ఆయనకు ఈదుట తెలియదు. ఒకనాడాయన భక్తి పరవశమున కొంత లోతుగల ప్రవాహములోనికి వెళ్ళినాడు. ఇప్పుడు చెప్పుము. ఇష్టదైవమగు గంగాదేవి ఆయనను తీరమునకు చేర్చినదా? లేదు. ఆయన మునుకలు వేయుచున్నప్పుడు తీరమున నిలుచుండి చూచిన, ఈదుట తెలిసిన ధైర్యశాలి యొకడు తక్షణము ప్రవాహములోనికి దుమికి ఆతని తీరమునకు చేర్చి రక్షించినందున బ్రతికిపోయినాడు. ఆతడెంతటి భక్తుడైనను ఈత తెలియని కారణమున గంగ ఆతనిని ముంచివేసెను. మరొక మనుష్యుడు గంగను దేవతగా నమ్మడు. ఎక్కడనో హత్యచేసి వచ్చినాడు. శరీరమంతా రక్తము చిందినది. వాస్తవ (సాకార) గంగలో దూకి రక్తపు మరకలను కడిగివేసికొని ఈదుచు క్షేమముగా దరికి చేరినాడు. ఇట్లెందుకు జరిగినది? వాడు గంగాజలములను చక్కగా వినియోగించుకొనినాడు. మొదటివాడు గంగా జలములను తప్పుగా పూజించినాడు. కావుననే గంగ వానిని ముంచి వేసినది. రెండవ వానిని కాపాడినది. మొదటివాడు కేవలము స్నానమొనర్చుట, పూజించుటయందే 'ముక్తి' యని తలచుచుండెను. ఇట్టివారు ప్రతి సంవత్సరము ప్రయాణములు, ఇతర వ్యయములకై లక్షలు, కోట్ల రూపాయలు వ్యయమొనర్చుచుందురు. త్రోపుళ్ళు, త్రొక్కుళ్ళు, తినీ తినక చావుబ్రతుకులలోబడి ఇంటికి చేరుకొందురు. అట్టివారు 'గంగా పూజ' అనగా అందులో స్నానము చేయుట, తలవంచుట, చెంపలు వాయించుకొనుట, ఫలపుష్పముల సమర్పించుట మాత్రమే అనుకొందురు

ఇక రెండవ వారిని చూడుము. వారు గంగ నుండి పెద్దపెద్ద కాలువలు త్రవ్వి నీటి పారుదల ఏర్పాట్లను చేసికొనినారు. కోట్లాది రూపాయల విలువగల పంటలను పండించి దేశమునందలి దరిద్రమును తొలగించుటకు చక్కని మార్గముల నూహించి సిద్ధపరచినారు. గంగాదేవి నుండి విద్యుత్తునుత్పన్నమొనర్చి

మర యంత్రముల ద్వారా దేశ సౌభాగ్యమును లక్షల రెట్లు అభివృద్ధిపరచినారు. వారెప్పుడు కూడ గంగ యందు స్నానమైనను చేయలేదు. నల్లా (కుళాయీ)ల ద్వారా తామున్న గృహములకే గంగను రప్పించుకొనినారు. అన్ని విధముల లాభమునొందుచున్నారు. అనగా వారు జడపదార్థముల వాస్తవ పూజయొక్క అర్థము, దాని ఉచిత ప్రయోగమును చక్కగా నెరుగుదురు. ఒక గంగయే యేమి? ప్రతి జడ పదార్థమును గురించియు ఇట్టివే అనేక ఉదాహరణముల నీయవచ్చును.

ఇక మిగిలిపోయినది మూర్తి లేక చిత్రములను చూచి ప్రభావితులగుమాట. వీని సంబంధమునను కొంచెమాలోచించుము. మంచి, లేక చెడు ప్రభావము కేవలము మూర్తులను, లేక చిత్రములను చూచినంత మాత్రముననే మనపై పడదు. కాని మన ఆంతరిక సంస్కారముల కారణముననే వాని ప్రభావము మనపై పడుచుండును. ఎట్లన: ఒక హిందువు రాముడు లేక కృష్ణుని మూర్తిని చూచినాడు. ఆయన తన తలను మూర్తియెదుట వంచినాడు. ఎందుకు వంచినాడు? ఆతడు రాముని , కృష్ణుని ఇతిహాసములను చదివి వారు ఈశ్వరావతారములు, రావణుని, కంసుని సంహరించినవారని వానికి తెలిసినది. ఈ సంస్కారము పుస్తకములను చదువుట వల్లనో ఒకరు మరొకరి ద్వారా వినుటవల్లనో ఏదో విధముగా వానిపై పడినది. కావుననే మూర్తులను చూచినంత మాత్రముననే వాడు ప్రభావితుడగును. ఒకవేళ ఆ హిందువు నెదుటికే జాపాన్ దేశపు దేవత 'కన్ఫూషియస్''ను తెచ్చి యుంచిన దానిని చూచి ఆతడెంత మాత్రము ప్రభావితుడు కాదు. దానియెడ ఆతనికెంత మాత్రము శ్రద్ధ గలుగదు. ఏలన, ఆతనికి 'కన్ఫూషియస్'ను గురించి కాని, ఆతని చరిత్రను గురించి కాని ఏమియును తెలియదు. కావున దాని ప్రభావ మెంత మాత్రమును ఆతని హృదయముపై పడలేదు. ఆతడు ఆ మూర్తి యెదుట తన తలను వంచడు. ఒక ముస్లిము ఏ హిందూ దేవత యెదుట శ్రద్ధతో తనతలను వంచ డేమి కారణము? ఆ ముస్లిం హృదయముపై దాని సంస్కార మేమియును పడలేదు. ఇందుకు విరుద్ధముగా ఒక దుర్బల మరియు కురూపియగు ముస్లిం చిత్రమెంతయో ఆతనికి బాగనిపించును. కాని హిందూ దేవీ దేవతల మూర్తి

లేక చిత్రము లెంత సుందరముగ నున్నను ఆతనికి బాగనిపించవు. ఆతనికి వానియెడ శ్రద్ధ గలుగదు. ముస్లిం చిత్రము ఆతనికెందుకు బాగనిపించినది? ఎందుకన ఆతని మనస్సు (హృదయము)పై మోమిన్, లేక ఇస్లాం సంస్కారము దృఢముగా పడియున్నది. ఇప్పుడు నీకు చక్కగా తెలిసియుండును. మన హృదయముపై ఏ ప్రభావము పడునో అది మన సంస్కారములవల్లనే పడుచుండును. మూర్తులను చూచుచుండుట వల్ల కాదు. అదే నిజమగుచో ప్రతి మనుష్యుడును ప్రతి మూర్తిని చూచుచుండుటచే ప్రభావితుడై శాంతిని ప్రాప్తించుకొనుచుండవలెను గదా! అట్లు జరుగదు.

**ఇందిర:-** పాఠశాలలందు బాలురకు పటము చూపబడుచుండును. ఒక చిన్న పటము ద్వారా విశ్వమంతటి జ్ఞానము వారికి కలిగించబడును. ఇదే విధముగా అతి చిన్న మూర్తి ద్వారా అతి విశాలమగు పరమాత్మ జ్ఞానమును కూడ కలిగింపవచ్చును గదా!

**సువర్ణ:-** నా ప్రియమైన సోదరీ! 'పట'మనునది సాకార జగత్తుది మాత్రమే చేయబడును. దాని ద్వారా సముద్రములు, సరస్సులు, నదీ నదములు, పర్వతములు, నగరములు, పట్టణములు, రాచబాటలు, అయోమార్గములు మున్నగు వాని జ్ఞానము మాత్రమే కలిగించబడును. పరమాత్మ సర్వవ్యాపకుడు. నిరాకారుడు, కావున ఆయన పటము (మూర్తి) అసంభవము. దాని వల్ల పరమాత్మ జ్ఞానము కలుగనే కలుగదు.

**ఇందిర:-** అక్షరములు, శబ్దములు నిరాకారములే. ఐనను వాని మూర్తులను చేసి బాలురకు బోధించుట జరుగుచుండునా లేదా? ఒకవేళ అక్షరముల, శబ్దముల ఆకారము చేయబడనిచో బాలబాలికలు విద్యనెట్లు పొందగలుగుదురు?

**సువర్ణ:-** అక్షరములు, శబ్దములను కన్నులతో చూడలేము. కాని చెవులతో మాత్రము వినగలుగుదుము కదా! గ్రాహ్యమొనర్చు కొనుటకు చెవుల విషయమును నేత్రముల ద్వారా తెలుపుటకు చిత్రములను చేయగలము. కాని ఇంద్రియముల విషయముకానిదానిని ఇంద్రియముగ చూపుట ఎంత మాత్రము సాధ్యముకాదు. అది కేవలము అనుభవము ద్వారానే తెలిసికొనబడును. దాని కొరకు నిరాకార అక్షరముల, శబ్దముల కల్పిత చిహ్నములను చేసియే విద్యగరపు ఆవశ్యకత

కాన్పించదు. అట్లే జరుగగలదన్న గొప్ప గొప్పవిద్యలను నేర్చిన గ్రుడ్డివారుండకనే పోవుదురు. ఏలన వారు అ ఆ ఇ ఈల రూపమునుగాని, ఏబీసీడీల రూపమునుగాని చూడలేదు. కాని గ్రుడ్డివారైన సంస్కృత, ఆంగ్ల విద్వాంసులెందరో మనకు గాన్పింతురు. రెండవది: వ్రాయబడిన కల్పిత చిహ్నములే 'వర్ణము' లనిపించుకొనును. కాని అక్షరములు కాదు. మనము పలుకుచున్నవన్నియును అక్షరములు. అవి నిరాకారములు. వ్రాయబడిన వన్నియును వర్ణములు. అవి సాకారములు.

**ఇందిర:-** ఇంకొక విషయము. సమయము నిరాకారమైనది. ఐనను దానికి మూర్తి రూప గడియారమును చేసి పనిని నెరవేర్చుకొనుచుందుము గదా!

**సువర్ణ:-** గడియారము సూర్యుని కార్యమునకు ప్రతిమూర్తి. కాని సమయమునకు మూర్తికాదు. సూర్యునివల్ల సమయమును తెలిసికొనునట్లే గడియారమువల్ల సమయజ్ఞానము కలుగును. గడియారముల క్రమమంతయును సూర్యునిపైననే ఆధారపడియుండును.

**ఇందిర:-** నిరాకార ధ్యానమొనర్చవలయునన్న ఎట్లు సాధ్యమగును? నిరాకార ధ్యానమొనర్చుటకు కూర్చున్నప్పుడు కన్నులు మూతలు పడుచుండును. ఏదో ఒక వస్తువు ఎదుట లేకున్నచో మనస్సు నిలువలేకున్నది.

**సువర్ణ:-** ప్రపంచము రెండు విధములుగనున్నది. ఒకటి ఆధ్యాత్మికము, రెండవది ఆధి భౌతికము. ఆధ్యాత్మికమనగా ఆత్మ సంబంధము. భౌతిక సంబంధమనగా పృథివి, అగ్ని, జలము మున్నగు పంచ భూతముల సంబంధమని జ్ఞాపకముంచుకొనుము. పరమాత్మ సంబంధ విషయములు ఆధ్యాత్మిక జగత్తునకు సంబంధించినవి. నీవు ధ్యానమొనర్చుటకు కూర్చున్నప్పుడు మూర్తియొక్క ఆకారవే మనస్సు మరియు మస్తిష్కమునందు తిరుగాడుచుండును. అప్పుడు ఆధ్మాత్మిక, అనగా పరమాత్మ సంబంధ చింతనమెచ్చట జరిగినట్లు? ఏలన, మూర్తి పంచభూతములచే నిర్మితమైనది గదా! ప్రాపంచిక మూర్తిమంతములై సమస్త వస్తువుల ఆలోచనలను వదలివేసి ఆత్మయందే పరమాత్మయొక్క వ్యాపకత్వ అనుభూతినొందినప్పుడే ఆధ్మాత్మిక ధ్యానము స్థిరమగును. ఆత్మ మరియు పరమాత్మల యందు దేశము,

కాలమునకు సంబంధించిన దూరము లేదు. కేవలము జ్ఞాన దూరము మాత్రము కలదు. అజ్ఞానమను తెర తొలగగనే పరమాత్మ అనుభూతి గలుగుచుండును. ఇక మనస్సు నిలుచు విషయము. మనస్సనునది నిలుపుటవల్లనే నిలువగలదు. అభ్యాసమువల్లనే మనస్సు నిలుపుట, అది స్థిరముగ నుండుట జరుగును. ఏ పనియైనను ధ్యాన పూర్వకముగా అభ్యాసము జరిగినప్పుడే మనస్సు దానిపై స్థిరపడుచుండును. అభ్యాసమొనర్చుచుండినచో ప్రపంచమునందలి సకల కార్యములు సాధింపబడుచుండును. ఎందరో స్త్రీలు రెండు మూడు నీటి పాత్రలను దొంతరలుగా నెత్తికొని, చంకన బాలునెత్తుకొని పరస్పరము వార్తాలాపముల నొనర్చుకొనుచు మెరక పల్లముల త్రోవలందు తలపై ఏ బరువు లేనట్లే చేతులు త్రిప్పుచు నడుచుచుందురు. ఒక నటుడు, లేక దొమ్మరివాడు పొడుగాటి వెదురు బొంగుపై తలపై ఎన్నెన్నో నీటి కుండలను పేర్చుకొని ఇంకా చంకలలో ఇరువురేసి పిల్లలనిరికించుకొని పైకెక్కుచుండును. సర్కసులలో అమ్మాయిలు పైకి కట్టిన ఇనుప తీగపై సైకిళ్ళు నడుపుదురు. కుక్కలు, పిల్లులు ఫిరంగులు, తుపాకులు పేల్చుటయును చూపబడుచున్నది. ఇవన్నియును అభ్యాసముయొక్క పరిణామమే కదా! బక్కచిక్కిన మనుష్యులు ప్రాత: నాలుగు గంటలకు మేల్కొని మిక్కిలి చలిలో గంగ, యమున మున్నగు నదులందు స్నానమొనర్చుటకు వెళ్ళుచుందురు. చక్కని బలము, ఆరోగ్యము కలిగియును కొందరు ఉదయం నాలుగు గంటలకు నిండుగా రజాయి (ఊలు దుప్పటి) కప్పుకొని ముఖము బయటకు దీయుటకును భయపడుచుందురు. ఎందుకు? శీత జలములలో స్నానమొనర్చు అలవాటు గలవారు ఉష్ణము, చలిని సమముగా చూతురు. ఇదే విధముగా పరమేశ్వరుని చింతనమొనర్చు అభ్యాసముగలవారు యమనియమాదులను సాధనముల ద్వారా ఎన్నో గంటలు నదీ పర్వత సానువులందు కూర్చుండి ఈశ్వర చింతన మొనర్చుచుందురు. వారేదైనా ఒక మూర్తినే ధ్యానించుచున్నారా? ఎంత మాత్రము కాదు. నీవు చక్కగా, లోతుగా ఆలోచించితివేని మూర్తియందు మనస్సు ఏకాగ్రతగా నిలువదని నీకే తెలియగలదు. ఏలన, ఒకప్పుడా మూర్తియొక్క ముక్కుపై, కన్నులపై, కిరీటముపై, వస్త్రములపై ఆభూషణములపై దృష్టి తిరుగుచుండును. ఇంకా మూర్తిని చూడకుండా కన్నులు

మూసికొన్నను ఆతని వృత్తులు ఆత్మపై స్థిరపడుచుండును.

**ఇందిర:-** మిఠాయి కొట్టువానివద్ద ఒక రూపాయి కోవా బిళ్ళ (పేడా) లు కొని తినినచో మనకు దాని చక్కని రుచి అనుభూతి కలుగును. కోవా బిళ్ళలు సాకారములు. కాని వాని రుచి నిరాకారము గదా! కాని మిఠాయి వానితో ఒక రూపాయి నిరాకారమగు రుచి (తీపి) నీయుమని కోరినచో వాడెట్లీయగలడు? దీనివల్ల బోధపడునదేమన సాకార మూర్తి ద్వారానే నిరాకారుడగు పరమాత్మయొక్క ఆనందానుభూతి ప్రాప్తించగలదు.

**సువర్ణ:-** చూడు చెల్లెమ్మా! ఏది ఏ వస్తువు గుణమో, అనుభవమునకు వచ్చినప్పుడు మనకు తెలిసిపోవును. కోవాబిళ్ళలు తినుటవల్ల కోవా బిళ్ళల రుచి, లడ్డూలు తినునప్పుడు లడ్డూల రుచి మనకు కలుగును. కోవా బిళ్ళ, మరియుదాని రుచియందు గుణము, గుణి సంబంధమే యుండును. కాని వ్యాప్య, వ్యాపక సంబంధముగాదు. పేడా (కోవాబిళ్ళ) యనునది ద్రవ్యము. రుచి యనునది దాని గుణము. కాని మూర్తి మరియు పరమాత్మ రెండును ద్రవ్యములే. పేడాను తినుటవల్ల దాని గుణమగు తీపి రుచి మనకేర్పడును. కాని మూర్తివల్ల పరమాత్మయొక్క ఆనందమెట్లు ప్రతీతము కాగలదు? మూర్తియొక్క గుణము పరమాత్మ కాదుగదా! రెండవది:- పేడా తినుటవల్లనే పేడా రుచి తెలియును. ఎవడో ఒకడు మట్టితో పేడా ప్రతి రూపము చేసి తినినచో అసలు పేడా రూపము రాగలదా? రానేరాదు. వాస్తవ రూపములో పరమాత్మ అనుభూతిని పొందుట ద్వారానే పరమాత్మయొక్క ఆనందము కలుగగలదు. ఆయన స్థానమున మట్టి, శిల, లోహముల మూర్తులను చేసి మ్రొక్కుటద్వారా పరమాత్మ ఆనందమెట్లు లభ్యముకాగలదు?

**ఇందిర:-** రాజా మూర్తిని ముద్రించుటవల్ల నోట్లు, రూపాయల వ్యవహారము సుఖదాయకముగ నడుచుచుండును. ఇట్లే మూర్తి పూజయును సుఖదాయకముగా నుండునుగదా!

**సువర్ణ:-** మొదటి విషయము. రాజు శరీర ధారి, కావున ఆయన మూర్తిని నోట్లు, మరియు నాణెములపై ముద్రించవచ్చును. కాని పరమాత్మ నిరాకారుడగుటచే ఆయన మూర్తి నిర్మింపబడజాలదు. **రెండవది:-** నోట్లు,

రూపాయలు మున్నగు నాణెములు రాజాజ్ఞతో, రాజుగారి కర్మాగారములందే నిర్మింపబడినవి మాత్రమే సుఖదాయకముగ నుండగలవు. కాని ఎవడైన రాజాజ్ఞకు విపరీతముగ నకిలీ (ప్రతి రూప) నాణెములు, నోట్లు తన గృహమందే చేసినచో వాడు చెరసాల సుఖమనుభవించగలడు. ఇదే విధముగ నిర్మింపబడిన పరమాత్మ, లేక ఇతర మూర్తులను యథాయోగ్యముగ వ్యవహరించుకొనిననే సుఖదాయకముగ నుండును. కాని పరమాత్మ ఆజ్ఞకు విరుద్ధముగ పరమాత్మ స్థానమున మట్టి, రాయివంటి కృత్రిమ మూర్తులను చేసి వానిని పూజించుట అనేక చెరసాల (జైలు) రూపయోనులందు ప్రవేశించు ప్రయత్నమొనర్చుటయే యగును.

**ఇందిర:-** ఏకలవ్యుడు ద్రోణాచార్యుని మూర్తిని నిర్మించుకొని శస్త్ర విద్యల నభ్యసించినాడని మహాభారతమందు కలదుగదా!

**సువర్ణ:-** ద్రోణాచార్యుడు సజీవ మూర్తి. అందుకే ఏకలవ్యుడు ఆతని మూర్తిని నిర్మించుకొనినాడు. ఆతడు పరమేశ్వరుని స్థానమున ఆ మూర్తిని పూజించలేదు. **రెండవది:-** శస్త్ర విద్యలను మూర్తి నేర్పలేదు. ఒకవేళ మూర్తియే నేర్పగలిగినచో వానికి అభ్యసించవలసిన అవసరమే ఉండెడిదిగాదు. వాడు తనశస్త్ర విద్యనంతయును తన అభ్యాసముద్వారా శ్రద్ధతో నేర్చుకొనినాడు. ఈ విషయము ద్రోణాచార్యునకు కూడా తెలియదు. అది తెలిసిన పిదప మూర్తిని చేసినందుకు గాను అతని బొటన వ్రేలిని నరికివేయించినాడు. మూర్తియందు ఏదేని కార్యము నభ్యసింపజేయు యోగ్యత యెక్కడిది? ఒకవేళ నేర్పగల నేర్పు మూర్తులకున్నచో వేదవ్యాసుని మూర్తిని ముందుంచుకొని ప్రతి మనుష్యుడును దాని నుండి వేదములను చదువుకొనుచుండెడివాడు. కాని అట్లు జరుగదు. ఒక సేవకుడు ఆంగ్లేయుని కొలువు చేసి ఆంగ్లమును మాట్లాడుట నేర్చుకొనినాడు. మిఠాయి కొట్టువాని నౌకరి చేసి మిఠాయిని చేయుట నేర్చుకొనినాడు. అగ్నిముందర కూర్చున్నప్పుడు వేడి అనుభూతి కలుగును. మనమెవని సాంగత్య మొనర్చెదమో వాని గుణములు మనలో ప్రవేశించగలవు. జడమూర్తుల సాంగత్యమువల్ల జడత్వమే కలుగును. ఈ జడత్వకారణము వల్లనే

బానిసత్వము, పరాధీనత ప్రాప్తించినది. జడ సాంగత్యమువల్ల ఆత్మ విశ్వాసము కర్మణ్యత నశించిపోయినది.

**ఇందిర:-** మంచిది. ఈ విషయముపై ఎంతయో చర్చ జరిగినది. ఈశ్వరుడు దయాళువు, న్యాయకారి అగునా, కాదా? అగునన్నచో దయ, మరియు న్యాయములు కలిసి యుండజాలవు కదా! ఏలన, దయ దలచినప్పుడు న్యాయము నష్టమగును. న్యాయము జరుపునప్పుడు దయయనునది తప్పక నశించగలదు.

**సువర్ణ:-** ఈ విషయముపై రేపు మాట్లాడుకొందుము.



**అపాం సమీపే నియతో నైత్యికం విధి మాస్థిత: ।**
**సావిత్రీ మప్యధీయాత గత్వారణ్యం సమాహిత: ॥ (మనుస్మృతి 2-104)**

నదీ తీరము నందలి అడవికిగాని, ఉపవనమునకు గాని (లేకున్న ఒక చక్కని ఏకాంత ప్రదేశమునగాని) వెళ్ళి సావధానులై నిత్యకర్మయైన సంధ్యోపాసన నొనర్చవలెను. సావిత్రీ - గాయత్రీ మంత్రమును అర్థభావముతో జపించుచు దాని ననుసరించి నడువ వలయును.
ఈ జపము మనసుతో చేయుట ఉత్తమము.

## ఈశ్వరుడు న్యాయకారియా, దయాళువా?

(ఆరవ దినము : ప్రాతఃకాలము)

**ఇందిర:-** అక్కయ్యా! నిన్నటి నా శంకను దీర్చుము.

**సువర్ణ:-** "దయ, మరియు న్యాయమను ఈ రెండు గుణములు ఈశ్వరునియందు కలిసి ఎట్లుండగల"వనియే కదా నీ శంక? వాస్తవముగా దయ, న్యాయము అను రెండు గుణములు కలిసియే యుండును. భేదమేమనగా 'దయ' ను దయాళువగు పరమేశ్వరుడు తన దిశనుండియే చేయును. కాని 'న్యాయ'మను దానిని జీవుల కర్మానుసారముగా నొనర్చును. ఎట్లన, కర్షకుడు ఒక విత్తును భూమియందు నాటును. ఒక గింజకు బదులుగా వందలాది విత్తులను ఈశ్వరుడు ఆతనికిచ్చును. ఇది ఆతని దయ. ఇక న్యాయమేమన, నీ వెట్టి విత్తనములను నాటెదవో అట్టి వానినేకోసికొనెదవు. నీ వేది చేసెదవో దానినే పొందెదవు. అనగా శనగలను నాటి శనగలనే పొందెదవు. కాని గోధుమలను కాదు. ఇదియే ఆయన న్యాయము. ఒక తండ్రికి నలుగురు పుత్రులు గలరు. ఆ నలుగురికి ఒక్కొక్కనికి ఒక్కొక్క వేయి రూపాయిలిచ్చినాడు. ఇది ఆతనికి పుత్రులపైనున్న దయ. కాని ఒక కొడుకు రెండవవాని రూపాయలను బలవంతముగా లాగుకొనినాడు. అప్పుడు తండ్రి రూపాయలు లాగుకొనిన కొడుకును దండించినాడు. ఇది ఆతని న్యాయము. రూపాయలను తండ్రి తనవైపు నుండి ఇచ్చినాడు. ఇది అతని దయ. ఇక దుష్టుడగు పుత్రుని దండించి ఎవని అధికారమును వానికిప్పించుట తండ్రియొక్క న్యాయము. ఒక రాజు ఒక హంతకునికి మరణదండన విధించును. ఇది యాతని న్యాయము. ఎట్లన, ప్రాణ దండన విధించి హంతకుని ద్వారా పీడింపబడినవారిని రక్షించును. ఇది ఆతని దయ. ఒకవేళ రాజు హంతకుని వదలివేసినచో అది ఆతని అన్యాయమే యగును. వాస్తవమునకు ఏ ఉద్దేశ్యము దయవల్ల నెరవేరునో అదియే న్యాయమువల్ల చేకూరును. ఎచ్చట న్యాయముండదో అచ్చట దయయును ఉండదు. అన్యాయముగల మనుష్యుడెప్పుడైన దయగలవాడు కాగలడా? అన్యాయముగలవాడు స్వార్థి యగును. కాని దయగలవాడు మాత్రము కాడు.

పరమాత్మ న్యాయకారి. కావుననే దయాళువు. ఆయన ప్రాణుల కళ్యాణము కొరకే సకల సౌకర్యములతో సృష్టిని నిర్మించినాడు. ఇది ఆయన సంపూర్ణ దయయే. కర్మానుసారము ప్రతి ప్రాణికి ఫలము నిచ్చుచుండును. ఇదియే ఆయన న్యాయము.

**ఇందిర:-** ఒక వ్యక్తి చెడు కర్మ నొనర్చుదలచిన దానిని పరమాత్మ ముందుగా తెలిసికొనునా? ఒకవేళ ముందుగానే ఎరిగినచో తక్షణమే నిలిపివేయవచ్చునుగదా? అట్లెందుకు చేయలేదు?

**సువర్ణ:-** చెడు కర్మలనుండి పరమాత్మ తక్షణమే నిలిపివేయును. ఇందుకు నిదర్శనమేమన, చెడు కర్మల నొనర్చుదలచినవానిని చేయుటకు ఉద్యుక్తుడగునప్పుడు వాని అంతఃకరణమున భయము, లజ్జ, సందేహభావ ముత్పన్నమగును. ఇది యంతయు పరమాత్మ దిశనుండియే కలుగును. దీనినే "అంతఃకరణ ధ్వని" అనియందుము. మనుష్యుడేయేమి? పశువుల అంతఃకరణములందును భయము, లజ్జ, అనుమానము మున్నగునవి ఉత్పన్నమగును. కుక్కకు మనము రొట్టెముక్కను వేసినప్పు డది సంతోషముతో తోకనాడించుచు తినును. కాని భయపడుచునో దాచుకొనియో తినదు. ఆ కుక్కయే రొట్టెను దొంగిలించి నోట కరచుకొని ఎక్కడో దాచికొని తినుచుండును. అప్పుడది ఆనందముగా తోకనాడించుటగాని, నిర్భయముగా తినుటగాని చేయదు. ఇట్లెందుకు ఎందుకనగా ఇది పాపకర్మయని ప్రాణుల అంతఃకరణము హెచ్చరించును. కాని ప్రాణుల స్వాతంత్ర్యమును ఎవ్వరును భంగపరచరు. కావున వాని స్వభావము ననుసరించి ఎట్టి ప్రేరణను లక్ష్యపెట్టక అవి కర్మలను చేయుచునే యుండును. ప్రతి ప్రాణికిని కర్మచేయు స్వాతంత్ర్యమును పరమాత్మకూడ నిలిపివేయడు. జీవుడు అనాది. కర్మమొనర్చుటలో స్వతంత్రుడు. కావున ఎవ్వరైనను ఆతని స్వాతంత్ర్యమునెట్లు హరించగలరు? పరమాత్మ జీవాత్మ స్వాతంత్ర్యమును హరించుచో జీవాత్మ జీవాత్మగా నుండుటగాని, దానికి ఉన్నతి కలుగుటగాని జరుగదు. ఒక పాఠశాల యందు విద్యార్థుల పరీక్షలు జరుగుచున్నవి. ఉపాధ్యాయులు పర్యవేక్షించుచుందురు. కొందరుబాలురు తప్పు సమాధానములను వ్రాయుచుండగా చూతురు.

చూచియును ఊరకుందురేకాని వాని స్వాంతంత్ర్యమునకు భంగము గలిగించరు. ఒకవేళ ఉపాధ్యాయులు బాలురచే సరియైన సమాధానములు వ్రాయించినచో బాలురకు వ్యక్తిగత ఉన్నతి గలుగదు. వారికి బాలురను చదివించి పరీక్షించు అవసరమే యుండదు. అట్టి పరిస్థితిలో విద్యార్థి విద్యార్థిగా నెట్లుండును? కేవల మొక యంత్రభాగముగా మిగిలిపోగలడు. ఉపాధ్యాయుల కార్యము విద్యార్థులను చక్కగా చదివించుటయే. చక్కగా చదివి పరీక్షలయం దుత్తీర్ణులై ఉన్నతినొందుట యనునది స్వయముగ విద్యార్థి కార్యము. ఇదే విధముగా పరమాత్మ కార్యము జీవులకు వేదము ద్వారా విధి నిషేధ (ఆచార అనాచార) కర్మల జ్ఞానమును ప్రాప్తింపజేయుటయే. మంచి చెడు కర్మలను చేయుటకాదు. జీవుడు కర్మలను తనకుగల స్వతంత్రముతోనే యొనర్చుచుండును. జీవుడు జ్ఞానముతో గూడిన కర్మల నొనర్చినచో సుఖము నొందగలడు. అజ్ఞానముతో గూడిన కర్మలనొనర్చినచో దుఃఖమును పొందగలడు. వేద జ్ఞానముగాక ప్రతిప్రాణి అంతఃకరణమునందును దుష్కర్మలను చేయకుండుటకు ఆదేశము పరమాత్మ దిశనుండి తప్పక లభించును. ఆయన ఆదేశముపై ధ్యానమునుంచుట, ఉంచకపోవుట ప్రాణుల స్వంత విషయము. దీనినే "చెడు కార్యముల నుండి తొలగించి యుంచుటకు పరమాత్మ ఆదేశ"మని యందుము. కాని జీవుల కర్మనొనర్చు స్వాతంత్ర్యమును లాగుకొనుట నిలిపివేయుట మాత్రము కాదు.

**ఇందిర:-** మంచిది. పరమాత్మ జీవులకు వెంటనే కర్మల ఫలము నేల ఈయడు?

**సువర్ణ:-** ప్రతి కర్మకు తక్షణమే ఫలము నిచ్చుటయును సరియైనది కాదు. పరమాత్మ ఒక మనుష్యునకు ఆయన కర్మకు ప్రసన్నుడై తత్కాలమే ఒక సంవత్సరము ఆనందమునను భవింపజేసినాడనుకొందము. వాడొక సంవత్సరము సుఖమునను భవించగలడు. కాని వాడు రెండవ దినముననే ఏదో ఒక దుష్కర్మనొనర్చినందున దాని ఫలముగా వానికి వెంటనే ఒక సంవత్సరము దుఃఖములనను భవింపజేసినాడని యనుకొందుము. ఇక నిప్పుడాలోచించుము. పరమాత్మ నియమానుసారము వాడు ఆనందము ననుభవించుచున్నాడు.

వెంటనె దుష్కర్మ ఫలము ననుభవింపజేసిన మొదట నొనర్చిన నియమమునకు భంగము వాతటిల్లగలదు. జీవుడు కర్మల నొనర్చుటయందు స్వతంత్రుడగుటచే సదా సత్కర్మ దుష్కర్మల నొనర్చుచునే యుండును. ఒకవేళ పరమేశ్వరుడు తత్కాలమే కర్మల ఫలము నిచ్చుచుండినచో సత్కర్మ దుష్కర్మల వ్యవస్థ సక్రమముగ నెట్లు నడువగలదు? కావుననే పరమాత్మ సమస్త కర్మల ఫలములను తన వ్యవస్థననుసరించియే ఇచ్చుచుండును.

**ఇందిర:-** ఈ ప్రపంచమున మనము చూచుచున్న యోనులన్నియు కర్మ ఫలములవల్లనే ప్రాప్తించినవా?

**సువర్ణ:-** ప్రపంచములో రెండు ప్రకారములు, అనగా భోగయోనులు, ఉభయ యోనులు అని గలవు. ఇవియన్నియు జీవులకు వాని కర్మానుసారమే ప్రాప్తించినవి.

**ఇందిర:-** భోగయోని, ఉభయయోనులనువాని తాత్పర్యమేమి?

**సువర్ణ:-** భోగయోనులందు జీవుడు సుఖ దుఃఖములననుభవించు చుండునే కాని భవిష్యత్తును గూర్చి ఎట్టి కర్మలను స్వతంత్రముగా ఆచరించజాలడు. పశుపక్ష్యాది జీవులన్నియు నిట్టివే. మనుష్యయోని మాత్రమే ఉభయయోని. దీని యందాతడు సుఖ దుఃఖ రూపమున ఫలమనుభవించుచు భవిష్యత్తు కొరకు మంచి చెడు కర్మల నొనర్చుచుండగలడు.

**ఇందిర:-** మనుష్యయోని ఉభయయోనిగా ఎందుకు ఎంచబడినది?

**సువర్ణ:-** పశుపక్ష్యాదులకు కడుపు నింపుకొనుటకు 'తినుట' యను చింతయే యుండును. పదార్థముల నుత్పన్నమొనర్చు చింత వానికి లేదు. వాని జన్మ పరమాత్మ వ్యవస్థననుసరించి కేవలము భోగములను భోగించుటకొరకే యున్నది. ఉత్పన్నమొనర్చుట, సంపాదన మొనర్చుటకు కాదు. చూడమ్మా! గోధుమలు, శనగలు, బియ్యము ఇతర ధాన్యములను సకల పశుపక్ష్యాదులు తిని కడుపు నింపుకొనునేకాని వాని నుత్పన్నమొనర్చలేవు. ఏలన, వానియందు ఆ ఆలోచనా శక్తిలేదు. కాని మనుష్యుడు తన ఆలోచనా శక్తితో పశువులతో పనిచేయించుకొని ధాన్యములనుత్పన్నమొనర్చును. ఆలోచనా శక్తిగల కారణముననే మనుష్య యోని 'ఉభయయోని' అని యనబడినది. తన

ఆలోచనా శక్తి ద్వారా ఆతడు సకల పశు పక్ష్యాదులను తన యధీనమునందుంచుకొనును. ఒక గొల్లవాని యధీనములో వేలాది గొర్రె మేకలుండును. ఒక పశుల కాపరి స్వాధీనమున వేలాది గోవులుండును. మనుష్యుడు సింహ శార్దూలములు మొదలగు పెద్దపెద్ద ఘాతుక మృగములను సైతము సరస్సులలో ఆటాలాడించును. జంతువులనేయేమి? తన ఆలోచనా శక్తి ఆధారమున పృథివి, జలము, వాయువు, అగ్ని మున్నగు మహత్తత్త్వములతో గూడ పనితీసికొనుచున్నాడు. ఈశ్వరుడు మనరుష్యులకు ఆకాశమునందెగురుటకు పక్షుల వంటి పక్షముల నీయకున్నను ఆతడు విమానములను సిద్ధపరచుకొని యధేచ్ఛగా ఆకాశమున విహరించుచున్నాడు. నీటియందీదుటకు తాబేలు, చేపలు, మొసలి వంటి శరీర సాధనములు లేకున్నను పెద్దపెద్ద పడవలు, ఓడలు మున్నగు అనేక రకముల జల యానసాధనముల నేర్పరచుకొని మహా సముద్రములపైన, లోపల నిర్భయముగ ప్రయాణమొనర్పగలుగుచున్నాడు .గ్రద్దలు, రాబందుల వంటి దూరదర్శన దృష్టి లేకున్నను ఆతడు దూర దర్శని, సూక్ష్మ దర్శని వంటి సాధనముల నెన్నిటినో తన ఆలోచనా శక్తితో సిద్ధపరచుకొని అనేక గోళముల విషయములను తెలిసికొన గలుగుచున్నాడు. కావుననే ఆతడు ఉభయ యోనిగా నెంచబడినాడు. ఈతడు పూర్వ జన్మల కర్మల ఫలమనుభవించుచు భవిష్యత్తు కొరకు కర్మలను గూడ చేయుచుండును.

**ఇందిర:-** మనకు ప్రాప్తించు యోనులన్నియును మన కర్మానుసారమే లభించునా? మానవుని లోని ప్రాణి పశుపక్ష్యాది యోనులందును చేరగలదా?

**సువర్ణ:-** ఔను. సమస్త యోనులు స్వకర్మానుసారమే లభించును. జీవుడు సకల యోనులందును వచ్చుచు పోవుచునుండును. ఐనను మనుష్య యోనియందొనర్చిన కర్మలే పాపపుణ్యములతో సంబంధము గలిగియుండును ఏలన, నేనిది వరకు తెలిపినట్లు మనుష్యునియందే ఆలోచనా శక్తి యుండును. ఈతడు తన ఆలోచనా శక్తిని దురుపయోగమొనర్చుకొని పాపాత్ముడై అనేక యోనులందు భ్రమించుచుండును. ఈశ్వరుడు తన న్యాయ వ్యవస్థననుసరించి.

ప్రతి జీవుని సంస్కరించు ఉద్దేశ్యముతోనే యోనులను ప్రాప్తింపజేయుచుండును. మనుష్యుడెట్టి సత్కర్మ దుష్కర్మల నొనర్చుచుండునో వాని సంస్కారములు వాని సూక్ష్మ శరీరముపైబడుచుండును. ఈ సత్కర్మ దుష్కర్మల సంస్కారముల ఆధారమున ఉత్కృష్ట నికృష్ట యోనులను పొందుచుండును.

*"స్థావరా కృమికీటాశ్చ మత్స్యా సర్పాశ్చ కచ్ఛపః ।*

*పశవశ్చ మృగాశ్చైవ జఘన్యా తామసో గతిః ॥ మను 12-26*

**భావము:-** అధిక నికృష్ట తమోగుణముగల మానవులకు వారి జుగుప్సాకరములగు కర్మలననుసరించి స్థావరములు, క్రిమి కీటకాదులు, జల చరములు, పశుపక్షులు, మృగాదుల యోనుల ప్రాప్తికన్న గత్యంతరమే లేదు.

**ఇందిర:-** మనుష్య యోని ఎట్లు ప్రాప్తించును? ముక్తి ఎప్పుడు లభించ గలదు?

**సువర్ణ:-** పాపములకన్న పుణ్య సంస్కారములు ఉత్కృష్టమైనప్పుడు మనుష్య యోని ప్రాప్తించును. నిష్కామ కర్మల సంస్కార ప్రాబల్యము అధికమైనప్పుడు పూర్ణ జ్ఞానము కలుగును. అట్టి స్థితిలో మరణించిన వారికి ముక్తి ప్రాప్తించును. మరో విధముగ చెప్పవలెనన్న జీవుడు సాంసారిక దుఃఖముల నుండి విముక్తుడై పరమపద ప్రాప్తినొందగలడు.

**ఇందిర:-** ఏనుగు యందుండు జీవుడు చిన్న చీమయందెట్లు ఇమడగలడు? అనగా పెద్ద శరీరమునకు పెద్ద జీవుడు, చిన్న శరీరమునకు అల్ప జీవుడుండునా?

**సువర్ణ:-** జీవుడు చిన్నగా పెద్దగా నుండడు. జీవుడు సమస్త శరీరములందును ఒకే పరిమాణములో నుండును. శరీరములందు అధిక, అల్ప ప్రమాణములతో భిన్నత్వముండును. ఒకే ఇంజనులో అనేక యంత్రములను తగిలించి యున్నట్లుండును. అందొకటి ముద్రించును, ఒకటి కూర్చిపెట్టును. ఒకటి కుట్టును, మరొకటి సమానముగా కోయును. ఐనను యంత్రము (ఇంజన్) అన్నిటికి ఒకే విధమగు శక్తినిచ్చుచుండును. కాని, యంత్రముయొక్క అంగములందు భిన్నత్వముండు కారణమున కార్యములు భిన్నభిన్న రూపములతో రూపొందుచుండును. మనుష్యులవంటి పెదువులుగల ప్రాణులు

పాలు త్రాగును. పక్షుల వంటి ముక్కుగల ప్రాణులు పొడుచుకొని తినుచుండును. ఒక మనుష్యుడు అనేక వేషముల ధరించునట్లు రూపములందు భేదమేగాని జీవులందు భేదముండదు.

**ఇందిర:-** జన్మలు కర్మానుసారమే లభించునా? ఒకవేళ అట్లే జరిగినచో జన్మకు పూర్వము (ఆదిలో) కర్మలేదు గదా! శరీరము లేకుండా కర్మ జరుగనప్పుడు మొట్టమొదటి శరీరమును పొందక జీవుడు కర్మను ఏ యాధారమున చేసినాడు? ఈ జనన మరణరూప బంధనములందెట్లు చిక్కుకొనినాడు?

**సువర్ణ:-** జన్మలు అజ్ఞానమువల్లనే కలుగును. యోనులు కర్మానుసారము ప్రాప్తించుచుండును. విద్యార్థులు మొదట అవిద్యా కారణముననే పాఠశాల యందు ప్రవేశింతురు. ఇక శ్రేణులను ప్రాప్తించుకోవడమనునది కర్మ, లేక యోగ్యత యొక్క ఆధారముపై నుండును. ఇదే విధముగా విశ్వరూప పాఠశాల యందు జీవునిరాక అనగా ప్రథమ శరీర ధారణ జీవుని అల్పజ్ఞత్వ కారణముననే జరుగును. అనేక శ్రేణుల (తరగతుల) రూపయోనులను ప్రాప్తించుకొనుట జీవుని కర్మానుసారమే జరుగును.

**రెండవది:-** జీవునకిది మొదటిలేక చివరి జన్మ కానేకాదు. అనంతకాలము నుండి లక్షలాది శరీరములతో సంయోగ వియోగములు జరుగుచు వచ్చినవి. జరుగుచునే యుండును. అనంత జన్మముల సంస్కారములు ఆత్మపై పడుచునే యుండును. సృష్ట్యాదినుండి అంతకు పూర్వపు సృష్టియొక్క సంస్కారములుండెను. ఈ సృష్టి ప్రవాహము అనాది. రాత్రింబవళ్ళవలె ఈ ప్రపంచ చక్రము నిరంతరము నడుచుచునే యుండును. ఇక ముందు కూడ నడుచుచునే యుండగలదు.

**ఇందిర:-** "చిన్నచిన్న అల్ప ప్రాణులు వికాసము నొంది మనుష్యుని రూపముగా మారినవి, మానవుడు సృష్టియందలి చివరి వికాస" మనికొందరందురు. ఇది వాస్తవమేనా?

**సువర్ణ:-** కాదు. ఈ మాట తప్పు. ఇది నిజమగుచో మనుష్యులున్నప్పుడు ఇతర ప్రాణు లెచ్చటినుండి యుండగలవు? అవన్నియు చివరి వికాసముగ

మనుష్యులుగా మారినప్పుడు మరల నవి ఎచ్చటినుండి వచ్చినవి? ఇంకా చిన్నా పెద్ద ప్రాణులు అసంఖ్యాకములుగ నున్నవి. ప్రాణులనుండి వికాసము జరుగుచు జరుగుచు చివరికి మనుష్యుడుగా వికాసమునొందినాడని ఎట్లు నమ్మవచ్చును. అంకురమునుండి వికాసము జెంది వృక్షముగా మారినప్పుడు అంకురమనునది యుండదుగదా! మొగ్గలో వికాసము గలిగి పుష్పముగా మారిన పిదప మొగ్గ యందు దాని యస్తిత్వమెట్లుండగలదు? ఇక ఆలోచించదగిన రెండవ విషయ మేమన, మనుష్యుడు తప్ప మిగతా అన్ని ప్రాణులందు సామాన్య జ్ఞానమే గలదు. కాని విశేష జ్ఞానమనునది కేవలము మనుష్యుని యందే కాన్పించును. ఈతని కీ విశేషజ్ఞాన మెట్లు కలిగినది? ఆలోచనా శక్తి వల్లనే. అనగా ఈ ఆలోచనా శక్తి ఇతర ప్రాణులందు లేదు. ఒకవేళ పశుపక్షులు మున్నగువానియందు ఆలోచనా శక్తి యుండినచో మానవుడు వానిపై శాసనము (అధికారము) నొనర్చజాలక పోవును.

చెల్లెమ్మా! అభావమునుండి భావమెప్పుడును గలుగదను విషయమును అందరును స్వీకరించినదే. ఒకవేళ మానవుడు ఇతర ప్రాణుల వికాసపరిణామమే యగుచో ఇతర ప్రాణులందును ఆలోచనాశక్తి యుండెడిది. కాని అట్లులేదు. వేదజ్ఞానశూన్యులగు వికాసవాదులు. (డార్విన్ మున్నగువారు) వానరులవల్ల నరులైనారని వ్రాసి, చాటి కూర్చున్నారు. అట్లేయని నమ్మినచో మానవ శిశువును నీటియందు వేసినచో మునుగకుండ నుండవలెను. కోతి నుండి మనుష్యుడుగా వికాసమైనప్పుడు కోతి పిల్లను నీటిలో వేసిన అది ఈదుచువచ్చి తీరమునకు చేరుకొనగలదు. కాని మానవ శిశువు ఈదజాలని కారణమున నీటియందు మునిగిపోవును. దీనివల్ల సిద్ధమైన దేమన మనుష్యులు, పశువులు, పక్షులు మున్నగు ప్రాణులన్నిటి నిర్మాణము తన న్యాయ వ్యవస్థననుసరించి వాని కర్మానుసారము పరమేశ్వరుడే చేయుచుండును.

**ఇందిర:-** భూతప్రేతములనగానేమి? భూత ప్రేతములను వాని యోనులు ప్రత్యేకముగా ఏమైన నుండునా? లోకులు భూత ప్రేతాదులను గురించి పెద్దపెద్ద కథలను వినిపించుచుందురు. మంత్ర, యంత్ర, తంత్ర వాదులెందరో యంత్ర తంత్ర తాయెత్తులు, రక్షాబంధములు మున్నగు వానిని గట్టుచు

మంత్రముల నూదుచు భూతప్రేతాదులను తొలగించుచుందురు. ఇది వాస్తవముకాదా?

**సువర్ణ:-** భూత ప్రేతములనువాని సత్తా (ఉనికి) ఏదియును లేదు. ఈ విషయములో లోకులు వినిపించుచుండు కథలన్ని వట్టి కల్పితాలు, కాకమ్మ కథలే. భూతము, వర్తమానము, భవిష్యత్తులనునవి సమయ, (కాల) భేదముల నామములే. 'భూత'మను దాని యర్థము గడచిపోయినదని, ఒక మనుష్యుడు చనిపోయిన తరువాత ఆతని సత్తా వర్తమానముకాదు. భూతకాలమున పరిగణింపబడును. ప్రాణములు పోయిన పిదప మిగిలిపోయిన శరీరమును 'ప్రేత' మందుము. భూత ప్రేతాదుల కథలను చెప్పువారెల్లరును వానిని రాత్రివేళలందు చూచినారమని చెప్పుచుందురు. మిథ్య (కల్పన)లగు మాటలన్నియు చీకటులందే యుండును. విశ్వమందలి సమస్త స్థూల, సూక్ష్మ పదార్థముల నన్నింటిని మన ఇంద్రియముల మరియు యంత్రముల ద్వారా సర్వకాలములందును చూచుచుందుము. ఒకవేళ భూత ప్రేతములను యోనులేవైన నున్నచో అవశ్యముగా మనకవి కాన్పించుచుండెడివే. కాని అట్లు జరుగుటలేదు. ఎవరి మనస్సులందు భయము, భ్రమ యుండునో, లేక ఎవరి మనస్సుపై 'భూత ప్రేతములు' అను సంస్కారములు పడియున్నవో అట్టి వారికే అవి కనిపించు భ్రమ కలుగును. ఇతరుల కట్లు జరుగదు. ఇది మనో విజ్ఞాన సిద్ధాంతములో మనస్సుపై ఎట్టి సంస్కారములుండునో భయభీతులైనప్పుడు(PSYCHOLOGY)లేక మానసిక వ్యాధులలో అట్టి చిత్రములే కన్పించుచుండును. ఇప్పుడాలోచించదగిన విషయమేమన, మనుష్యుడు మరణించగా మిగిలిపోయిన శరీరము పంచభూతములందు విలీనమైపోవును. జీవుడు తన కర్మానుసారము వేరే శరీరము ధరించును. ఇక మిగిలిన దేమి? భూతమేది, ప్రేతమేది?

జీవాత్మ లేక సూక్ష్మ శరీరములే భూత, ప్రేతములనిన జీవాత్మ స్థూల శరీరములేక కనిపించుట యటుండ శారీరక సంబంధ కార్యములేవియును చేయజాలదు. సూక్ష్మ శరీరముయొక్క పరిస్థితియు నింతే. ఇక తాయెత్తులు, మంత్ర, తంత్ర, యంత్రములు, ఊదుట, నీటిని చిలుకరించుట, వేప కొమ్మలతో

దులుపుట, మున్నగు వానిచే రోగములను, భూత ప్రేతాదులను దొలగింతురను మాట కూడ పచ్చి యబద్ధము, అచ్చమైన మోసము, టక్కరితనము మాత్రమే. వీనివల్ల రోగములు తొలగిపోవుననినచో ఈ ప్రయోగము నొనర్చువారి పిల్లలు, పెద్దలు వ్యాధిగ్రస్థులగుటగాని, మరణించుటగాని జరుగకుండెడిది. కాని వారి పిల్లలు కూడా మరణింతురు. స్వయముగా వారు కూడ కాలగర్భములో గలిసిపోవుదురు. ఈ యంత్ర తంత్రములచేతనే కార్యము నెరవేరుచో వైద్యులు, (డాక్టర్లు)గాని, వైద్యశాలల అవసరముగాని ఉండెడిది కాదు. ఎవరిపై నైనను భూత ప్రేత పిశాచములుగాని, దేవీదేవతలుగాని ఆవహించినప్పుడు ఏదేని ప్రశ్న వారి ముందుంచవలెను. అప్పుడు వారి బండారము బయటబడిపోవును. ఎవరిపైనైనను ఏదేని హిందూదేవీ దేవత, ఆవాహమైనప్పుడు ఏదేని యొక వేద మంత్రమును, ముస్లిం దేవత సయ్యద్, పీర్ ,జిన్ ,సైతాను, ఆవహించినపుడు ఖురాన్‌యొక్క ఆయతును చదువుమనవలెను. ఇట్లు చేసినప్పుడు వారి టక్కరి తన మంతయు గాలిచే చెత్తవలె ఎగిరిపోవును. కాని ఇంకా అనేక మోసములను ఈ టక్కరిగాళ్ళు అతినేర్పుతో ప్రయోగించుచుందురు. వానిని అర్థము చేసికొనలేక నిజముగా ఈ భూతప్రేత, పిశాచములను వారు వశపరుచుకొన్నారని నమ్ముచుందురు. కాని నిజముగా వీని సత్తా ఏదియునుండదు. ఇది కేవలము అపోహ, సంశయము మాత్రమే. ఇవి కేవలము అజ్ఞానులను, అంధ విశ్వాసపరులను మాత్రమే బాధిం చుచుండును. మన భాగ్యము నందేమిగలదో అది భోగించక తప్పదని అందరును తెలిసికొనదగిన విషయము. దీనినెంతటి వారైనను తప్పించుకొనలేరు, తప్పించుకొనజాలరు. న్యాయశీలి పరమాత్మ సర్వదా సర్వత్రయున్నాడు. పూర్వజన్మ కర్మఫలమో, సంస్కారమో తప్ప ఈశ్వరుని న్యాయ వ్యవస్థకు విరుద్ధముగా ఎవ్వరును, ఏమియును పరిష్కరించజాలరు.

**ఇందిర:-** మంచిదక్కయ్యా! భూత ప్రేత యోనులుండవని చెప్పితిరి. సరే! కాని గ్రహముల కారణమున సుఖదుఃఖములు కలుగుచుండునుగదా! నవగ్రహ ఫలితములను భోగించవలసియే యుండును గదా! జ్యోతిష్కులమాటలెట్లు వృధాయగును? మాసములు, సంవత్సరములు ముందు రాబోవు సూర్యచంద్ర గ్రహణముల విషయములో ఒక్క నిముషముకూడ

వెనకాముందు కాకుండా చెప్పుదురుగదా!

**సువర్ణ:-** సుఖదుఃఖములు గ్రహముల కారణమున కలుగవు. తమతమ కర్మ ఫలముల ననుసరించియే కలుగుచుండును. ఎన్ని గ్రహములున్నచో అవి ఎవ్వరికిని సుఖములనుగాని, దుఃఖములనుగాని కలిగించజాలవు. ఈ గ్రహములన్నియు భూగోళముపై తన ప్రభావమును తప్పక కలిగించుచుండును. కాని అట్టి ప్రభావమువల్ల కలుగు సుఖ దుఃఖములు, వస్తువులందు గలుగు పరివర్తనము ఆయా వస్తువుల పరిస్థితులననుసరించియే కలుగుచుండును. ఒక వృక్షము భూమిపై నిలిచియున్నది. దాని ప్రక్కనే మరొక వృక్షము నరికివేయబడియున్నది. ఈ రెండింటిపైనను సూర్యుని ప్రభావము సమముగనే పడుచున్నది. కాని నరికివేయబడిన వృక్షము క్షీణించుచు ఎండిపోవుచున్నది, భూమిపై నిలిచియున్న వృక్షము వృద్ధియగుచున్నది. ఆ సూర్యుని ప్రకాశమే శిలపై మరియు మంచుపై సమముగనే పడుచున్నది. సమముగా పడుచున్న సూర్య కిరణముల పరిణామము మాత్రమే వేర్వేరుగా జరుగుచున్నది. సూర్యుని ఉష్ణమునకు మంచు కరిగిపోవుచున్నది. రాయి వేడెక్కి గట్టిపడుచున్నది. ఈ సూర్య ప్రకాశమే ఆరోగ్యముగ నున్న కన్నులకు సుందర దృశ్యములను దర్శింపజేసి ఆనందముననుభవింపజేయును. కాని ఆనందముననుభవింప జేసిన ఆ ప్రకాశమే కన్నుల నొప్పితో బాధపడుచున్న వ్యక్తికి ఇంకా అధిక బాధను దుఃఖమును గలిగించును. ఇప్పుడు చెప్పుము. ఇందు ప్రత్యేకముగా సూర్య గ్రహము గలిగించిన దోషమేమున్నది? వస్తువునందు గల పరిస్థితి ననుసరించియే వానియందు కష్టసుఖముల పరివర్తనము గలుగుచున్నది.

చూడు చెల్లెమ్మా! జ్యోతిష్యము రెండంగములుగా నమ్మబడుచున్నది. ఒకటి గణితము, రెండవది ఫలితము. గణితమునకు సంబంధించినంతవరకే సత్యము. ఇక ఫలితమనునది అనుమానమగు కారణమున అసత్యమే. ఈ సూర్యచంద్రగ్రహణములుగణితముతో సంబంధము గలిగియుండును. కావున నే నెలలు, సంవత్సరముల విషయము ముందుగానే చెప్పవచ్చును. సృష్ట్యాది నుండి సూర్య చంద్రులు మున్నగు గ్రహములు తమతమ కార్యములను నియమపూర్వకముగ నిర్వర్తించుచున్నవి, అంతము వరకు

నిర్వర్తించుచుండగలవు. కావుననే వాని గణితమేర్పరచబడినది. జ్యోతిష విద్వాంసులు గ్రహముల నడకను (గతిని) గూర్చి గణితవిద్యద్వారా చక్కగా నెరుగుదురు. ఒకానొక సమయమున చంద్రుని ఛాయ ఇంతసేపటివరకు సూర్యునిపై లేక పృథివిపై కొండొక ప్రాంతము, దిశకు పడగలదని గణితము ద్వారా తెలిసికొని ఒకానొక సమయమున గ్రహణము ఏర్పడునని చెప్పగలుగుదురు. ఏ వస్తువునందు నియమ పూర్వక గతిగలదో దాని పరిణామము గణితముద్వారా క్షణమైనను భేదములేక తక్షణమే తెలియగలదు. గడియారము నడకను చూచి చిన్న పిల్లవాడు కూడ సమయమును తెలిసికొని సరిగా చెప్పగలడు. గడియారపు ముండ్లు ఒకటిపై ఒకటి చేరుటను గాంచి సరిగా పండ్రెండు గంటల సమయమైనదని ఎవ్వరైనను సరిగానే చెప్పగలుగుదురు. ఈ విషయము వారికెట్లు తెలిసినది? గడియారము నియమ పూర్వకముగ నడచినప్పుడే అది సాధ్యమగును. వాస్తవముగ జ్యోతిష్యము గణిత విద్యయే. స్వార్థపరులు దాని యందు 'ఫలిత' మనునది తగిలించి దానిని అపకీర్తిపాలొనర్చినారు.

**ఇందిర:-** జ్యోతిష్కుడు జన్మపత్రమును వ్రాయును. జన్మకుండలిని వేసి నవగ్రహముల పరిస్థితిని తెలుపును. ఎవనిపై ఏ గ్రహము ఆరోహించినదో వెంటనే కుండలి వేసి చెప్పును. ఒకనిపై శని 'ఢైయా' (రెండున్నర సంవత్సరములు), మరొకనిపై సాఢేసాతీ (ఏడున్నర సంవత్సరములు) ఇంకొకనిపై రాహువు, మరొకనిపై కేతువు, ఒకచోట దిశాశూల, మరొకచోట యోగినీ చక్రము మున్నగు వాని ఆరోహణము, అవరోహణము, వీని ప్రభావములను గూర్చి చెప్పుదురు. ఇంతేకాదు ధరల పెరుగుట విరుగుటలు, హాని లాభములు, పాతిపెట్టబడిన నిక్షేపములు, జంట బిందెల ఉనికి, ఉద్యోగములు, లాటరీ, న్యాయలయ వ్యవహారములు, భూత భవిష్యద్వర్తమానముల కాలగతులు, ముక్కాలముల స్థితిగతుల విషయములను చెప్పుదురు. ఇవన్ని వాస్తవమే గదా!

**సువర్ణ:-** చెల్లెలా! నీ తార్కిక బుద్ధిచే నీవేమియు ఆలోచించకయే నన్ను పరీక్షించుటకే అడుగుచున్నట్లనిపించుచున్నది. కొంత లోతుగా ఆలోచించినచో నీకే తెలియగలదు. నీవు నిశ్చయముగా ఆలోచించుము. ఇవన్నీ అమాయకులను

భ్రమలో బడవేసి డబ్బును దండుకొని పొట్టనింపుకొనుట కేర్పరచుకొనిన మోసపుటెత్తులు. భగవంతుని వ్యవస్థననుసరించి మన భాగ్యమునందున్నవాని నెవ్వరును తప్పించజాలరు. ఇది నీకు మొదటనే తెలిపియుంటిని. గ్రహములు స్వయముగ జడములగు కారణమున మనకే విధమగు సుఖదుఃఖములను కలిగించజాలవు. సుఖ దుఃఖములనునవి మన కర్మల ఫలితముగానే మనకు లభించుచుండును. ఇతర దేశములకన్న జ్యోతిష్కులమని చెప్పుకొనువారు మన దేశముననే అనేకులుగా నున్నారు. ఇచ్చట ప్రతి చిన్న పెద్ద కార్యములన్నియు గ్రహనక్షత్రములపైననే ఆధారపడి యున్నట్లు నమ్ముదురు. సర్వజనులు నక్షత్రములను గూర్చియే అడుగుచుందురు.

**"నక్షత్ర మతిపృచ్ఛన్తం బాలమర్థోహి వర్తయేత్ ।**
**అర్థోహ్యర్థస్య నక్షత్రం కింకరిష్యన్తి తారకాః ॥"**

కావుననే భారత దేశము సర్వవిధములుగ దీన, హీన, దుఃఖములతో గూడి యున్నది. ఇతర దేశములన్నింటికన్న నిరుద్యోగులు, దరిద్రులు, ఆకలిచే అలమటించువారు మన దేశమునందే అధికముగ గాన్పింతురు. దాదాపు మూడు కోట్ల మంది విధవలు ఈ దేశమందున్నారు. ప్రపంచమందలి ఇతర దేశములందెచ్చటను ఇంతమంది వితంతువులు కానరారు. మరి వీరి వివాహ ముహూర్తపత్రములు గ్రహ నక్షత్రములను గుణించియే సిద్ధపరచిరి గదా! తిథి వార నక్షత్ర రాశి వర్గ లగ్న కూటమి మున్నగువానిని జ్యోతిష్కుడు కలిపియే ఏర్పరచినాడు కదా! ఐనప్పుడింతమంది విధవలు ఎట్లేర్పడిరి? బ్రహ్మపుత్రుడగు వశిష్ఠుడు గ్రహముహూర్తములను చక్కగా చూచియే ప్రాతః కాలమున శ్రీరామ చంద్రుని పట్టాభిషేకము ఆనందోత్సాహములతో జరుగగలదని శుభముహూర్తము నిశ్చయించెను. కాని కర్మగతి(కర్మభోగము) వలన రాజ్యాభిషేకమునకు బదులుగా ఆ శుభముహూర్తమున, ఆ ప్రాతః కాలమునందే రామచంద్రుడు వనవాసమునకు వెళ్లినాడు. దశరథుడు ప్రాణములను వదలినాడు. ముగ్గురు మహారాణులు వితంతువులై కూర్చున్నారు. సీతాదేవి వనములందు అపహరించబడినది. శ్రీరామ చంద్రుడు పదునాల్గు సంవత్సరములు అనేకానేక కష్టములననుభవించవలసి వచ్చినది.

ఈ గ్రహముల ఆరోహణ, అవరోహణములు మహా విచిత్రముగ నున్నవి. మనము నివసించుచున్న భూగోళ పరిధి 25 వేల మైళ్లున్నది. సూర్య గోళము పృథివి గోళముకన్న 13 లక్షల రెట్లు పెద్దది. అనగా పదమూడు లక్షలభూగోళములు కలిసిన ఒక సూర్యగోళమంతయగును. దీని భారము భూగోళమునకన్న 3,43,432 రెట్లు అధికముగ నుండును. మనము గంటకు వంద మైళ్ళ వేగముతో నడుచు విమానముపై అహర్నిశలు ప్రయాణము చేసినచో పృథివి నుండి సూర్య గోళమునకు చేరుటకు 105 సంవత్సరముల కాలము పట్టును. ఈ సూర్య గోళము, ఇంతకన్న చాలా పెద్దవగు బృహస్పతి వంటి ఎన్నియో గ్రహములు ఆకాశమున గలవు. అనేక నక్షత్రముల ప్రకాశము భూమిని చేరుటకు లక్షల కోట్ల సంవత్సరముల కాలము పట్టును. ఇప్పుడాలోచించుము. అట్టి గ్రహములు మనుష్యునిపై ఎక్కుట, దిగుటఎట్లు సాధ్యమగును? ఇంకా అతి విచిత్రమేమనగా, గ్రహములు షావుకారుపై ఆరోహించినవి. ఈ విషయమాతనికి తెలియదు. కాని జ్యోతిష్కునికి తెలియుచున్నది. ఒక చిన్న చీమ మనపైకెక్కిన వెంటనే మనకు తెలియును. కాని ఏనుగో, గుర్రమో ఎక్కినప్పుడు మనకు తెలియుటలేదు. అవి మనపై ఎక్కినపుడు మనము పచ్చడియై పోవలెనుగదా! కాని వీనికన్నను ఎన్నియో రెట్లు పెద్దవగు గ్రహములు సేటుగారిపై ఆరోహించునప్పుడాయనకు తెలియదు. ఇదెంత ఆశ్చర్యము! ఇది కేవలము మోసకారుల, దోపిడికాళ్ళజాలమేగాని దీనియందే సారమును లేదు. మన భాగ్యమువనుసరించి వచ్చు కష్టసుఖములను మనము భోగించక తప్పదు. దిశాశూలలు, వార శూల లనునవన్నియు మోసకారుల టక్కరి తనమే. ఈ కాలమున రైళ్ళు, మోటారులు, బస్సులు మున్నగునవి ఈ వార దిశాశూలలను త్రొక్కివేసినవి. ఒక ఉదాహరణ చూడుము .

ఒక భాగ్యవంతుని వ్యాజ్యము కలకత్తా నగర న్యాయ స్థానమున నడుచుచున్నది. కేసు విచారణ దినమున అచ్చటికి వెళ్ళుటకు సిద్ధమగుచుండగా ఆతని కుటుంబ పురోహితుడు వచ్చి "నేడు నీకు దిశాశూల గలదు, కావున ప్రయాణము వల"దని తెలిపినాడు. ఆనాడాతడు కోర్టుకు వెళ్ళనందున కోర్టు తీర్పు ఆతనికి విరుద్ధముగ జరిగినది.

మరొక సేటుగారికి బొంబాయి నుండి "నీవు వెంటనే బయలుదేరి రమ్ము. లేకున్న అనేక లక్షలు నష్టము వాటిల్లగల"దని టెలిఫోన్ వచ్చినది. బయలుదేరుటకు సిద్ధమగుచున్నంతలో ఆతని పురోహితుడు వచ్చి " నేటి ప్రయాణమున మీకు గ్రహబలము క్రూరముగనున్న"దని నిలిపివేసినాడు. మరునాడు బయలుదేరుచుండగా పిల్లి త్రోవకడ్డముగా దాటినది. మూడవనాడు కారుపై ఎక్కునపుడు ఒక స్త్రీ తుసుక్కుమని తుమ్మినది. నాల్గవ నాడు బయలుదేరుచుండగా "నీవు రానందున (20) లక్షల రూపాయల నష్టము వచ్చిన"దని బొంబాయినుండి ఫోన్ వచ్చినది. చెల్లెమ్మా! సందేహము, మూడనమ్మకము మూలముగా ఎంత భయంకర పరిణామము గలిగినదో తెలిసినదిగదా! పాతిపెట్టబడిన ధన నిధులు మున్నగు వాని రహస్యములను తెలుపుట యనునది అచ్చమైన టక్కరితనమే. భూమిలోగల నిధులను తెలుపగల విద్వాంసులు స్వయముగా త్రవ్వి తెచ్చుకొనరేల? ఇంతటి జ్యోతిష్కులుండగా భూగర్భ శాస్త్ర విద్వాంసులు తలలు బ్రద్దలు గొట్టుకొను అవసరమేముండును. భూగర్భమునందుగల సకల విషయముల నెరుగగల జ్యోతిష శాస్త్రజ్ఞాలున్నప్పుడు ప్రపంచ దేశములందలి ప్రభుత్వములు అర్బుద, ఖర్బుద సంఖ్యలో రూప్యములను ఈ విభాగమునందేల వ్యయమొనర్చు చుండును? కొద్దిపాటి వ్యయముతో ఈ జ్యోతిష్కులతోనే పనివెళ్ళును గదా! కావుననే బుద్ధిమంతులగువారు ఈ టక్కరిగాళ్ళ జాలమునుండి జాగ్రత్తపడవలెను. తమ కర్మ ఫలముపై పరమేశ్వరుని న్యాయముపై దృఢవిశ్వాసము నుంచుకొని బుద్ధిపూర్వకముగా శుభకర్మలనొనర్చుచుండుటయే శ్రేయస్కరము.

**ఇందిర:-** అక్కయ్యా! శ్రాద్ధ తర్పణముల నొనర్చవలెనా లేదా? అను విషయమును కూడా తెలుపుము.

**సువర్ణ:-** ఈ విషయము రేపు మాట్లాడుకొందము. నేటికింతయే చాలు.



## శ్రాద్ధమొనర్చవలెనా లేదా?

(ఏడవదినము: ప్రాతఃకాలము)

ఇందిర:- నిన్న నేనడిగినట్లు శ్రాద్ధమొనర్చవలెనా, లేదా? తెలుపుము.

సువర్ణ:- చెల్లెమ్మా! శ్రాద్ధము తప్పక యొనర్చవలెను. జీవించియున్న తల్లిదండ్రులు,నాయనమ్మ అమ్మమ్మలు, తాతలు,గురుజనులు, ఆచార్యులు,ఉపదేశకులు, తత్త్వవేత్తలు, ఇతర విద్వాంసులందరికి అవసరమగు అన్న పానీయాదులనిచ్చి శ్రద్ధతో సేవించుటయే శ్రాద్ధమనబడును.

ఇందిర:- జీవితులకెచ్చటనైన శ్రాద్ధములు చేయబడునా? మరణించిన వారికే శ్రాద్ధము లొనర్చుట జరుగును గదా!

సువర్ణ:-మొదట'పితరులు' అను శబ్దమునకు అర్థము గ్రహించుము. రక్షణ యొనర్చువారిని'పితరు' లనెదరు. జీవితులే రక్షణ యొనర్తురుగదా! జీవితులు మాత్రమే తమ సంతానమునకు తమ జీవితానుభవముల దృష్టితో ప్రాపంచిక వ్యవహారములను తమ జ్ఞానము ద్వారా ఉపదేశించగలరు. జీవితులు మాత్రమే తమ సంతానమును సకల విధముల రక్షించగలుగుదురు. మరణించిన పిదప పితరులు పితరులుగా నుండరు. ఏలన: 'పితరు'లనగా ఆత్మగాని, శరీరముగాని కాదు. పితరులనునది ఆత్మమరియు శరీర సంయోగ విశేషము పేరు. మృత్యువు ఆరెండింటి సంబంధమును విడదీసినప్పుడు ఇక పితరులెచ్చట నుందురు? ఆత్మపేరే పితరు లగుచో ఆత్మ నిత్యము, మరియు అవినాశిగా నుండదు. నశించిపోవలెను. ఏలన, పితరులని అనుకొన్నప్పుడు దానియందు ఆయుష్యము, మరియు చిన్న పెద్ద అను తారతమ్యము నంగీకరించ వలసి వచ్చును. ఒక ఆత్మయొక్క ఉత్పత్తి మొదట అంగీకరించవలసినప్పుడు రెండవ ఆత్మ ఉత్పత్తి తరువాత స్వీకరించవలసియుండును. ఒకవేళ ఇట్లు నమ్మకపోయినచో 'పితరులు' అను శబ్దమునకు ఆత్మలతో సంబంధమే పొసగదు. సంబంధమే లేనప్పుడు శ్రాద్ధమొనర్చుట యెవరికి? ఆత్మను సర్వజనులు 'అవినాశి'యని నమ్ముదురు గదా? కావున దానియందు ఆయువు,చిన్న,పెద్ద అను భేదముండజాలదు. ఇక మిగిలినది శరీరము. దీనిని కూడా 'పితరు' లనలేము.

మొదటిది:- ఆత్మ శరీరమును వదలినతోడనే శరీరము 'శవము' అను పేర మిగిలిపోవును.

రెండవది:- ఒకవేళ శరీరములనే పితరులనిన వానిని ఖననమొనర్చువారికి, దహన మొనర్చువారికి ఘోరమగు పాపము చుట్టుకొనగలదు. మరణించిన తరువాత ఏ పితరుల శరీరములనైనను భూమియందు పాతిపెట్టుటయో, దహనమొనర్చుటయో జరుగును. ఇట్టిపని పుణ్యకార్యమనిపించదు. కాని మరణించిన వారిశరీరములను ఖననమో,దహనమో చేయుట 'పుణ్యకార్య' మని యెంచబడుతున్నది. వాస్తవమునకు వాని వరుసలు, పితాపుత్రాది బంధుజన సంబంధమీ ప్రపంచమున నున్నంతవరకే యుండును. ఇక మరణించిన పిదప శవము ఒకరికి పితరులుగాకాని సంతానముగాకాని యెంచబడదు. సకల జీవులు తమతమ కర్మఫలములననుభవించుటకు ప్రపంచక్షేత్రమునకు వచ్చెదరు. శరీరధారణ మొనర్చినపిదప పరస్పరము అనేక విధములగు సంబంధము లేర్పడును. మరణించిన పిదపగూడ జీవులతో తల్లిదండ్రులు, సోదరీసోదరుల సంబంధము నిలిచియున్నచో పునర్జన్మయందు తల్లికి పుత్రునితో,చెల్లెలికి అన్నతో,పుత్రికకు తండ్రితో వివాహములు జరుగుట సంభవమైపోగలదు. కావున జీవుని (ఆత్మ)తో తల్లిదండ్రి మున్నగు ఏలాంటి సంబంధమును మిగిలియుండదు. జీవాత్మ మరియు శరీరమునకు సంయోగ విశేషముతో మాత్రమే సంబంధము కావున శ్రాద్ధమనునది జీవితులకే జరుగును.

ఇందిర:- సంవత్సరములో 15 దినములు శ్రాద్ధమునకు నిశ్చితమైయున్నవి. ఒకనాడు పితరులకు, మరొకనాడు మరొకరికి శ్రాద్ధమొనర్చబడును, పితరులు సూక్ష్మ శరీరము ధరించి శ్రాద్ధదినములందు వచ్చి బ్రాహ్మణులతో కలిసి భోజనమొనర్చెదరు. ఎప్పుడైనా పితృలోకమునుండి పితరులు రాజాలకపోయినను బ్రాహ్మణులకు భుజింపచేసిన భోజనము పితరులకు చెందుచుండును గదా?

సువర్ణ:- 'పితరు' లను పేరు ఆత్మలేక శరీరమునకుగాదు. అది ఆత్మ, శరీరముల సంబంధ విశేషము. సూక్ష్మ శరీరము ధరించి భోజన మొనర్చుటకు

వచ్చుచుందురనుట సంపూర్ణముగ తమ హఠమును, అవివేకమును పరిచయమొనర్చుకొనుటయే యగును. ఒకవేళవారు "సూక్ష్మ శరీరమును ధరించి వచ్చి భుజించెద"రని విశ్వసించినను స్థూలశరీరములు లేకయే పితరులు సూక్ష్మ శరీరములతో మనమిచ్చు శ్రాద్ధభోజనము నెట్లు తినగలరు? సూక్ష్మశరీరముతో భోజనమొనర్చుట సంభవమగునా? ఒకవేళ వారు వచ్చి బ్రాహ్మణులతో గలసి భుజించెదరనిన మొదట పితరులు తినెదరా, లేక బ్రాహ్మణులా? ఒకవేళ బ్రాహ్మణులే మొదట తినెదరనిన మిగిలిపోయిన ఎంగిలి పితరులు తినెదరా? ఒకవేళ కలిసి తినెదరనిన పరస్పరము ఎంగిలి తిన్నట్లు గాదా? ఎంగిలి తినుట ఆరోగ్యము మరియు సిద్ధాంతము ఈరెంటి దృష్ట్యా నిందనీయమగును. సంవత్సరకాలములో 15 దినములే ఎందుకు నిశ్చయమై యున్నవి? పదకొండున్నర నెలల కాలములో పితరులకు ఆకలి వేయదా? 15 దినముల భోజనముతోనే సంవత్సరము వరకు తృప్తిపడి యుందురా? ఇట్లు జరుగుట సంభవమేనా? జరుగగలదని యనినచో ఒకమనుష్యునకు 15 దినములు తినిపించి సంవత్సరము వరకు భోజనమీయకున్న జీవించి యుండగలడేమో చూపుడు. ఆ పదిహేను దినములైనా ఎక్కడివి? శ్రాద్ధములొనర్చుటకు సంవత్సరములో పదిహేను దినములు మాత్రమే కేటాయించబడినవి. వీనినుండి ఏ ఒక్కదినము మాత్రమే పితరులను పరివారమువారు ఎన్నుకొందురు.

రెండవ విషయము:-"బ్రాహ్మణులకు తినిపించుటలో మృతక పితరులకు భోజనము చేరగల"దనిన భోజనమొనర్చిన పిదప బ్రాహ్మణుల పొట్టలెందుకు నిండవలెను? ఈ శ్రాద్ధ భోజనములనొనర్చు బ్రాహ్మణులను ఒక్కవిషయమడుగవలెను, ఏమన: "మీరు భోజ్యపదార్థములను చేరవేయు మాపితరులెచ్చటనున్నారు? ఎట్లున్నారు. ఆరోగ్యముగానున్నారా, రోగిష్ఠులై యున్నారా? వారు అనారోగ్యముతో బాధపడుచున్నచో ఈ హల్వా, పూరీ, ఖీర్ మున్నగు పిండివంటకములతో పనియేమి? ఈ ఘనపదార్థ భోజనములతో వారింకా బాధననుభవించెదరు గదా! వారికిప్పుడు చేదు మందులు,కషాయములు, పథ్యపుకూడుకావలయునేమో!" అని ఒక్కమాట అడిగిచూడుడు. మరణించిన

వారి ఆత్మలుఏయోనులందు ఏరూపములలో నున్నవో, వారెట్టిస్థితియందున్నారో, ఎచ్చటనున్నారో తెలియనప్పుడు ఈ పిండివంటకములను బ్రాహ్మణుల ద్వారా పంపించు ఉద్దేశ్యమేమి? శ్రాద్ధదినములందు ఎవరి పితరులైనా సూక్ష్మశరీరముతోభుజించుటకు వచ్చెదరనిన ఏయోనినుండి వారువచ్చెదరో, అచ్చటవారి మృత్యువు అవశ్యముగా జరిగియుండవలెను. ఇంకా కొంత శ్రద్ధగా ఆలోచించుము. ఒక ఆత్మ తత్వజ్ఞానమును ప్రాప్తిచేసికొని ముక్తిని పొందినది. దానికి ప్రాపంచిక భోజనముల చింత ఎక్కడిది? ఒక ఆత్మతన కర్మవశమున పులి లేక సింహము, మరొక ఆత్మ మలము మురికి గుంటల కీటకమైపుట్టినది. ఇంకొకటి పందియై పుట్టినదనుకొందము. మనమర్పించిన షడ్రసోపేత భోజనపదార్థములతో వానికేమిపని? వానికి తగిన భోజ్యపదార్థములను బ్రాహ్మణుల ద్వారా వారికి పంపించగలమా? ప్రతిప్రాణికి వానికి హితమైన భోజ్యపదార్థములు వేర్వేరుగానున్నవి. మనుష్యుడు వాటన్నిటికి తగినవి ఎట్లు పంపించగలడు?

చూడమ్మా! ఒక మనుష్యుడు మరొకనికి జాబువ్రాయవలెనన్న వాని చిరునామా తెలిసియుండవలెను. అది తెలియనిచో పూర్తిజాబు విషయములతో నింపివేసి చిరునామా వ్రాయకుండా జాబును తపాల డబ్బాలో పడవేసిన వానిని బుద్ధిమంతుడనెదమా? ఆపత్రము వ్రాయబడిన వారికి చేరగలదా? ఎన్నటికీ చేరదు. ఐతే గుర్తులు,చిహ్నములు, చిరునామాలు తెలియకుండానే బ్రాహ్మణులకు తినిపించిన భోజ్యపదార్థములు పితరులకెట్లు చేరగలవు? ఇది కేవలము మూర్ఖత్వము, అంధవిశ్వాసమే యగును. ఒకవ్యక్తి కిచ్చట సుష్టుగా భుజింపచేసిన అది ఇతర వ్యక్తికి చేరగలదేని పరదేశములకు వెళ్లువారికి భోజన పదార్థములను కట్టియిచ్చు అవసర మేముండును? ఇచ్చటనే బ్రాహ్మణులకు తినిపించిన పరదేశములకు వెళ్లినవారి పొట్టలు స్వయముగానే నిండిపోవలెనుగదా! కావుననే మరణించిన పితరులకు శ్రాద్ధమొనర్చుట యనునది పూర్తిగ వ్యర్థము. అది తన్నుతాను మోసగించుకొనుటయే యగును.

**ఇందిర:-** అక్కయ్యా! మీరు తర్కముద్వారా మరణించిన పితరుల శ్రాద్ధము జరుగదు, ఒకరికి తినిపించినది మరొకరికి చెందదని నిరూపించినారు.

సరే: కాని ఒకని తండ్రి ఋణగ్రస్థుడై మరణించినాడు. ఆతడు ఋణపాపమును తనపై వేసికొని పోయినాడు. పుత్రుడు కొంతకాలమునకు ధనవంతుడై తండ్రి చేసిన ఋణమును తీర్చివేసినాడు. ఇప్పుడు చెప్పుము మృతుని ఆత్మ ఋణరూపపాపమునుండి విముక్తమగునా,లేదా? పుత్రుడు తన తండ్రిచేసిన అప్పును తీర్చివేసినాడు కదా? ఇక తండ్రి ఋణగ్రస్తుడుగా ఎట్లుండును? పుత్రునిద్వారా తండ్రి ఆత్మఋణ పాపమునుండి విముక్తమగునప్పుడు పుత్రునిద్వారా బ్రాహ్మణులకు భోజనాదుల నొనర్చిన పితరులకు తృప్తి ఏల కలుగకుండును?

సువర్ణ:- చెల్లెమ్మా! తండ్రిచేసిన కర్మఫలము పుత్రులకు, పుత్రులుచేసినది తల్లిదండ్రులకు ఏరూపముననను చేరదు. మనుష్యు డొనర్చిన మంచి, చెడుకర్మల సంస్కారములు వాని సూక్ష్మశరీరముపై పడును. అట్టి సంస్కారములే వానికి సుఖదుఃఖ రూప భోగములగును. అట్టి భోగములు ఏరూపములో నైనను అనుభవించక తప్పదు. లౌకిక దృష్టితో పుత్రుడు తండ్రిచేసిన ఋణమును తీర్చివేయగలడు. కాని తండ్రి ఆత్మపైబడియున్న ఋణ సంస్కారమును కొడుకు తుడిచివేయలేడు కదా? అది సాధ్యమగుపని కాదు. ఎవ డొనర్చిన కర్మల సంస్కారములు వాని యాత్మపై తప్పక పడును. వానిని మరొకడు తుడిచివేయలేడు. పుత్రుడు ఇచ్చి పుచ్చుకొను ప్రాపంచిక చికిత్సల నొనర్చగలడు. కాని తండ్రియొక్క సూక్ష్మశారీరక సంబంధములకు ప్రాపంచిక వ్యవహారముల చికిత్సలు పనిచేయవు. కొడుకు తండ్రిచేసిన ఋణమును తీర్చివేసినను, తండ్రి ఆత్మపైబడిన ఆ సంస్కారములు పోగలవని తలచినను, ఒకతండ్రి కోట్లరూపాయల సంపదలను ధర్మ రూపముననే సంపాదించి మరణించినాడు. ధర్మయుక్తముగా ధనము సంపాదించిన సంస్కారములను తనవెంట గొనిపోయినాడు. కాని వాని పుత్రుడు తెలివిహీనుడై తండ్రి సంపాదించిన సంపదలను దురాచార, భ్రష్టాచార కృత్యములద్వారా నష్టపరచినాడు. ఈ పాపముల వల్ల వాడు నిందలపాలైనాడు. అనేక పాపకార్యములను కూడ చేసినాడు.వాడు తండ్రి సంపాదించిన ధనమువల్లనే ఘోరపాపకర్మల నొనర్చి నందువల్ల తండ్రి ఆత్మకు పాపము లంటుకొనవు . అట్లే తండ్రి చేసిన

ఋణమును తీర్చినందువల్ల తండ్రి చేసిన ఋణ సంస్కారము లెట్లు తొలగిపోగలవు? ఇది ఇచ్చిపుచ్చుకొను వ్యవహారము మాత్రమే. తండ్రి సంపాదించిన ఆస్తిపాస్తులను పొందు అధికారము పుత్రుని కున్నప్పుడు తండ్రి చేసిన ఋణములను పుత్రుడు తీర్చవలసియే యుండును. పుచ్చుకొను అధికార మున్నప్పుడు చెల్లించు బాధ్యతకూడ ఉండును. ఇది మానవ సమాజములో ఒక నియమముగా నడుచుచున్నది. కొన్ని కొన్ని దేశములలో ఈ నియమముకూడ లేదు. యూరోపు ఖండములోని అనేక దేశములం దీ నియమములేదు. ఆదేశములందు సంయుక్త పరివారమువంటి ఆచారము లేదు. తల్లిదండ్రులు, తమపుత్రులు స్వతంత్రముగా సంపాదించుకొని స్వయముగా బ్రతుకగల యోగ్యత కలుగువరకే తమ సంతాన పాలన పోషణ బాధ్యతను వహింతురు. వారు యోగ్యులైనప్పుడు తల్లి దండ్రులు మరియు సంతానమునకు ఆర్థిక సంబంధము లేవియు నుండవు. పరస్పరము ఇచ్చిపుచ్చుకొను సంబంధములు కూడా ఉండవు. అచ్చట పితరుల ఋణమును తీర్చుట తీర్చకపోవుట అను ప్రశ్నయే ఉండదు. అచ్చట ప్రతివ్యక్తి తానుచేసిన ఋణమువరకే భాధ్యుడుగ నుండును. ఋణమొనర్చిన పాప సంస్కారములు పితరుల ఆత్మపై నుండిన వానిని పుత్రుడు కడిగివేయు ననునది సంపూర్ణముగా మిథ్యాకల్పనయే . ఈ సృష్టియందు ఎవడు, ఎవనికి ఋణపడి యున్నాడు? మరియు ఏరూపములో నున్నా డనునది భగవంతుడే యెరుగును. ఆయనయే ఒకడు మరొకని ఋణమును తీర్చు వ్యవస్థలను వారి వారి కర్మానుసారము చేయుచుండును. సృష్టియందలి అనేక కర్మలు ఒకరికొరకు సాధ్యములు, మరొకరి కొర కవి సాధనము లగును. ఐనను ఒక రొనర్చు కర్మఫలము మరొకరికి చెందజాలదనునది నిశ్చితము.

చూడమ్మా! శ్రాద్ధ దినములను కనాగతము, లేక కర్ణాగత మనియు అందురు. ఒక పౌరాణిక కథను వినుము. సువర్ణదానమొనర్చిన కర్ణునికి స్వర్గలోకములో సువర్ణమే లభించినది. కాని అన్నము దొరకలేదు. ఆతని ఆకలి తీరలేదు. అప్పు డాతడు స్వర్గమునుండి సెలవు తీసికొని మృత్యులోకమునకు వచ్చి బ్రాహ్మణులకు భోజనము చేయించి మరల స్వర్గమునకు వెళ్లినాడు.

అప్పు డాతనికి స్వర్గమున అన్నము తినుటకు లభించినది. కర్ణుడు తిరిగివచ్చుటవల్లనే "కనాగత, కర్ణాగత"మను పేరు వచ్చినది. ఈ కథ సృష్టిక్రమమునకు విరుద్ధమే. ఐనను దీనివల్ల " ఎవరి కర్మఫలమును వారే అనుభవించ వలసి యుండు"నను పరిణామము తీసికొనవచ్చును. కర్ణుడు స్వయముగనే స్వర్గమునుండి వచ్చి స్వయముగనే అన్నదానమొనర్చినాడు. అప్పుడే అతనికి అన్నము లభ్యమైనది. కానిచో కర్ణుని సంబంధీకులు ఈ భూలోకమున బ్రాహ్మణులకు మెక్కింపజేసిన స్వర్గలోకమున కర్ణునికి అన్నప్రాప్తి కలిగెడిది గదా?

**ఇందిర:-** మంచిదక్కయ్యా! మరణించిన పితరులకు భోజనము లభించకపోతే పోని కాని మృతులగు పితరుల పేరుతో భోజనము తినిపించిన హాని యేమి? ఈనెపము (సాకు)తో కొంత దానము జరుగును. వారిజ్ఞాపకములలో ఏదో కొంత పుణ్యమైన లభించునుగదా!

**సువర్ణ:-** హాని యేమనుచున్నావా? హానియేమన, వైదిక సనాతన మర్యాద నాశనమగుచున్నది. ఎందుకని యడిగెదవేమో వినుము. పితృయజ్ఞము, అనగా పితరుల సత్కారము, నిత్యకర్మవిధియందు వచ్చుచున్నది. బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము,పితృయజ్ఞము, అతిథి యజ్ఞము, బలివైశ్యదేవ యజ్ఞము అను నీ పంచమహాయజ్ఞములను శక్త్యనుసారము ప్రతివారు ప్రతిదినము చేయుచుండవలెను. ఇట్లని వైదిక శాస్త్రముల ఆజ్ఞకలదు. ఒకవేళ మృతకశ్రాద్ధమని 15దినములు నిశ్చితమొనర్చుకొని 'వానికి పితృయజ్ఞ'మని పేరిడినచో నిత్యమర్యాదలు ఖండితమై పోగలవు.

వర్ణాశ్రమ ధర్మము ననుసరించియును మృతక శ్రాద్ధము నిలుజాలదు. ఎట్లన, పుత్రుడు బ్రహ్మచర్యాశ్రమమున నున్నప్పుడు తండ్రి గృహస్థాశ్రమమున నుండును. ఇదేవిధముగ పుత్రుడు గృహస్థాశ్రమమునకు చేరినపుడు తండ్రి వానప్రస్థమున ప్రవేశించును. ఇట్లే పుత్రుడు వానప్రస్థి యైనపుడు తండ్రి సంన్యాసమున నుండును.ఇప్పుడాలోచించుము.సంన్యాసి మృతకశ్రాద్ధ మెట్లు నెరపగలడు? ఏలన ఆతడు సమస్తసకామభావనలను త్యజించినాడు. అప్పుడేగదా! సంన్యాసియైనది? సంన్యాసితో పారివారిక సంబంధ

ముండనేయుండదు. అప్పుడాతడు ఎవ్వరికిని తండ్రిగా కాని, కొడుకుగా కాని యుండడు. ఇక శ్రాద్ధమెవ్వరికి చేయును? సంన్యాసియైనవాడు పరివ్రాజకుడగును, సదుపదేశముల నొనర్చుచు ఎప్పుడు,ఏతిథియందు ఎచ్చట మరణించినాడనునది సంతానమునకు,పరివారమునకుఎట్లు తెలియగలదు? కావున ఏవిధముగ చూచినను'మృతకుల శ్రాద్ధమనునది ఋజావు కాజాలదు. ఇక మిగిలిపోయినది దానము పుణ్య మనుమాట. పితరుల అనగా మరణించిన పూజనీయుల స్మారకముగా తినిపించుట, దానమొనర్చుట మున్నగునవి చెడు కాదు. ఐతే సుపాత్ర, కుపాత్రముల నెరిగి చేయుట మంచిది. కాని ఏకార్యమైనను ఖ్యాతికొరకో, గొప్పదనము చాటుకొనుటకొరకో చేయుదాని పరిణామము శుభస్కరముగ నుండదు. ఏలన హృదయములో సత్య మనునది లేని కారణమున దానమొనర్చువారి ఆత్మపై ఉత్తమ సంస్కారముపడదు. మనస్సునందేదిగలదో అదియే వాణియం దుండవలెను. వాణియం దున్నదియే కర్మయం దుండవలయును. అప్పుడే అది పుణ్యకార్య మనిపించుకొనును. సాకు (నెపము)తో నొనర్చుదానము దానము గాదు. పుణ్యము పుణ్యముగాదు. ఎట్టికర్మ నొనర్చవలెనో అట్టిది సద్భావన, సత్యరూపములో నుండవలెను. ఆలోచించకుండా 'దానము' 'పుణ్యము'లని చేయుట ప్రపంచములో సోమరుల,పనికిమాలినవారి సంఖ్యను పెంచుటయే యగును. ఒకవేళ తమ పూర్వజాల స్మారకముపేర భుజింపజేయుట, దానమొనర్చు టనునది పుణ్యమైనచో భాద్రపదమాసమునందే 15 దినములలో నిశ్చితతిథియందే భోజనాదుల, దానధర్మముల నొనర్చవలెనా? అదియైనను కేవలము బ్రాహ్మణులమని చెప్పుకొనువారికేనా? ఎందరో వికలాంగులు, నిరుపేదలు, అనాథలున్నారుగదా? వారిని తృప్తిగా భుజింపజేసి దానధర్మముల నొనర్చిన ఎంతోమంచిది కదా! వారి జ్ఞాపకార్థము ఏదేని దార్మిక కార్యము, ధర్మ ప్రచారమునకు ఉత్తమవైదిక గ్రంథములను అచ్చువేయించి అర్హులకు పంచుట ఎంతయో ఉత్తమము. వారి సంస్మరణములో జయంతి (పుట్టిన) దినములందు ఏవైన శాశ్వత సత్కర్మ లొనర్చుచుండవలెను. శ్రీరామనవమి, కృష్ణాష్టమి వారు పుట్టిన తిథులందే జరుపబడుచుండునట్లే పితరుల జ్ఞాపకార్థము చేయు

ఉత్తమకర్మలు వారు మరణించిన తిథులందే చేయుట సమంజసము. అప్పుడే వారిస్మృత్యర్థము ఈ శ్రద్ధచూపబడుచున్న దని ఎంచ వచ్చును. కానిచో 'మృతక పితరుల శ్రాద్ధ మనునది ఒకబూటకము, ఆడంబరమే యని తలచబడగలదు.

**ఇందిర:-** అక్కయ్యా! మీరీవిషయములో ఏంతో వివరముగా వివేచనమొనర్చినారు. ధన్యవాదములు. మరొక విషయమును తెలిసికొనదలిచినాను.యజ్ఞముల నొనర్చుటవల్ల లాభమేమి?లోకులు నేయి మరియు సామాగ్రిని అగ్నియందువేసి ఎందుకు పాడుచేయుచున్నారు?
సువర్ణ:-దీని సమాధానము రేపు తెలిపెదను.



**ఓ3మ్ మైవమగ్నే విదహో మాభి శోచో మాస్యత్వచం**
**విక్షిపో మా శరీరం। యదాకృతం కృతం**
**కృణవో జాత వేదోz థేనం ప్రహిణుతాత్ పితృభ్యః**
**(ఋగ్వేదం 10-16-1)**

**ఓ3మ్ శతం యదా కరసి జాతవేదో అథైనం పరిదత్తాత్**
**పితృభ్యః। యదాగచ్ఛత్యసునీతి మేతా మథా**
**దేవానాం వశనీర్భవాతి॥ (ఋగ్వేదం 10-16-2)**

భావము:- మరణించిన వెంటనే జీవాత్మ మంచి కర్మల నొనర్చినచో తన పూర్వులైన పితరులు వెళ్ళిన చోటికి వెళ్ళుచున్నది. లేక ముక్త ఆత్మల దగ్గరకు వెళ్ళుచున్నది. లేదా తన కర్మాను సారము ఈ భూమిపై మరల జన్మించుచున్నదని భావము.

# యజ్ఞము మరియు యజ్ఞోపవీతము

(ఎనిమిదవ దినము: ప్రాతఃకాలము.)

**సువర్ణ:-** నిన్నటి నీ ప్రశ్న " యజ్ఞమేల చేయవలయు?"ననియేకదా''? యజ్ఞమొనర్చుట వల్ల అనేక లాభములు గలవు. ఇది నేయి, సామాగ్రులను వ్యర్థముగాకాల్చివేయుటకాదు. యజ్ఞమునందునేయి,సామాగ్రులనుఆహుతిగా నిచ్చినచో అగ్నిద్వారా అవి సూక్ష్మరూపము ధరించి వాయుమండలమును శుభ్రపరచును. వాయువు శుద్ధమగుటవల్ల పర్యావరణము శుద్ధియై వ్యాధులు రాగల అవకావము ఉండదు. కాకున్న అత్యల్పముగ నుండును.

**ఇందిర:-** యజ్ఞముతో వాయుమండల మెట్లు శుద్ధమగును?

**సువర్ణ:-** యజ్ఞసామగ్రియందు రోగనాశకములు, సుగంధితములు, మధురములు,పుష్టికారకములు అను నాలుగు విధముల పదార్థములుకలిసియుండును. ఈ పదార్థములతో యజ్ఞమొనర్చినప్పుడు వాయుమండలముననుండు వ్యాధులను గలిగించు కీటాణువులు నశించును. వాయువు శుద్ధమగుట అనున దిదియే. ఈ యజ్ఞములద్వారా మేఘమండలము శుద్ధమై వర్షమును గలిగించు అవకాశము గూడా నుండును. దీనియందు ధాన్యములకు, ఓషధులకు పుష్టిగలిగించు గుణముండును. ఇందువల్ల సకలప్రాణులకు మేలు గలుగుచుండును.

**ఇందిర:-** నా ఉద్దేశ్యములో రోగనాశకములైన, పౌష్టికపదార్థములను భుజించుటవల్ల లాభముండును. కాని యజ్ఞములపేర వానిని దహించివేసి పదార్థములను నష్టపరచుటయేయగును. యజ్ఞములద్వారా వర్షములు కురియు ననునది మరీ విచిత్రముగా నున్నది.

**సువర్ణ:-** పుష్టిదాయక, వ్యాధినాశక పదార్థములను తినవలదని నాఉద్దేశ్యముకాదు. వానిని యథోచితముగా భుజించవచ్చును. వానితో యథాశక్తియజ్ఞములనుకూడ చేయుచుండవలెను. పదార్థములద్వారా శరీరమును పుష్టివంతమొనర్చుట ఆవశ్యకమైనచోట ఈ పదార్థముల ద్వారానే వాయువును శుద్ధపరచుటయును అత్యావశ్యకమే. వాయువును శుద్ధపరచదలచనివాడు పాపాత్ముడేయగును. వాయువును కల్మషమొనర్చునప్పుడు దానిని

శుద్ధపరుచుటయు వాని ధర్మమే యగును. చూడమ్మా! మన శరీరములనుండి బయటికి వచ్చున వన్నియు అపవిత్రములు, దుర్వాసనగల మలములేగదా?చెవి గుబిలి, కండ్ల పుసులు, ముక్కుచీమిడి, నోటినుండి వచ్చు ఉమ్మి, కళ్లె మున్నగునవి మురికి పదార్థములే గదా! మనము విసర్జించు మలమూత్రముల మాటయేమి? మనము విశుద్ధమగు ప్రాణవాయువును తీసికొని ప్రాణఘాతకమగు అశుద్ధగాలిని వదలుచున్నాము. బయటినుండి మనము అన్నము, జలము,పండ్లు,కాయగూరలు, వాయువు మున్నగు పవిత్ర పదార్థములను సేవించి వదలివేయుచున్నదేమి?ఉత్తమమైనవానిని మనము భుజించి వానిని అపవిత్రముగా దుర్వాసనగా మార్చి బయటకు వదలివేయుచున్నాము. ఇట్లు వదలివేసి బయటనున్న పవిత్ర పర్యావరణమును విషమయముగా నొనర్చుచున్నాము. వాయువే సకలప్రాణులకు జీవనాధారమని అంద రెరిగిన విషయమే. జలము, అన్నములేనిదే రెండు మూడు దినములు జీవించి యుండగలవేమో కాని వాయువు లేనిదే అరఘడియయైనను జీవించజాలము.వాయువు ప్రాణులజీవనాధారమైనప్పుడు అది శుద్ధముగా నుండుట ఎంతయో అవసరము. వాయువు అశుద్ధమైనప్పుడు ఎన్నిభయంకర వ్యాధులు ప్రబలునో తెలియును గదా! ప్లేగు, కలరా, మహమారి, మున్నగు అతి ప్రమాదకర వ్యాధులు వ్యాపకమై ప్రబలిపోవుటకు కారణము కల్మష వాయువే గదా? మనుష్యులు, ఎలుకలు మున్నగువాని శరీరములనుండి వెలువడు కీటాణువులు వాయువునందు కలిసిపోయి భయంకర వ్యాధులకు జన్మనిచ్చును. ఇందుకొరకే వాయువును శుద్ధపరచుటకు యజ్ఞము అనగా హవనము నొనర్చుటకన్న వేరే ఉపాయమేదియును లేదు.

పదార్థములను కాల్చివేసి నష్టపరుచుచున్నామను మాట అజ్ఞానముతో కూడినదే. విశ్వమునందు ఏపదార్థమును నాశము నొందదు. కేవలము రూపములను మార్చుచుండును. జలము వేడిచే ఆవిరియైపోవుటను నీరు నష్టమైనదని మూర్ఖులు మాత్రమే అనుకొందురు. అ నష్టము కాలేదు. ఆవిరియై వాయుమండలముతో కలిసి మేఘములుగా మారునని బుద్ధిమంతులే యెరుగుదురు. ఇదే విధముగ యజ్ఞసామగ్రి కాలి నష్టముకాలేదు. అగ్ని

సూక్ష్మరూపము తాల్చి వాయువును సంశోధనమొనర్చి దాని యందు కలిసి యున్న ఆవిరిని శుద్ధమేఘముల రూపమున ఘనపరచు కార్యమునొనర్చును. ఆవిరిని కూర్చుటకు నేయి తోడువలె పనిచేయును. వందల క్వింటాళ్ల పాలను కొద్దిపాటి మజ్జిగ తోడుకొనజేసి పెరుగుగా మార్చివేయునుగదా! నేయిని సూర్యుని తీక్షణమగు కిరణములు గట్టిపరచజాలవు. అట్టి నేయి ఆవిరి మేఘములను దృఢపరచి వర్షమును గురిపించు కార్యమొనర్చును. లోకులు విధి ననుసరించి నియమపూర్వకముగా యజ్ఞముల నొనర్చుచుండిన నిశ్చయముగా సరియైన సమయములందు వర్షములు కురియగలవు ప్రాచీన కాలములో అత్యంత విధి పూర్వకముగ యజ్ఞములు జరుపబడుచుండెడివి. కావుననే చక్కగా అవసరమున్నంత మేరకు వర్షములు కురియుచుండెడివి. దాని ఫలితముగ క్షామము, కరవు కాటకములు వచ్చెడివికావు. ఇప్పటివలె ప్రజలు ఇతర ప్రాణులు వ్యాధిగ్రస్థులు గాకుండెడివారు.

**ఇందిర:-** గృహములందు సుగంధిత, రోగనాశక పదార్థముల నుంచినచో వాయువు శుద్ధ మగునుగదా! కాల్చివేయుట వల్లనే వాతావరణము శుద్ధియగునా? కాల్చివేయుట యందుగల విశేషమేమి?

**సువర్ణ:-** గృహములందు సుగంధితములు, రోగనాశకములు నగు పదార్థములను తప్పక యుంచవలెను. ఐనను వానితో యజ్ఞములను కూడ చేయుచుండవలెను. యజ్ఞముల నొనర్చుటవల్ల పదార్థముల గుణములు కోట్లరెట్లు అధికమగును. ఇందుకు ప్రమాణమును చూడుము. ఒక మనుష్యుడు నాలుగైదు మిరపకాయలను నమిలి మ్రింగగలడు. ఆతడు వాని తీక్షణత, మరియు కారమును సులభముగ భరించగలడు. కాని ఒక చిన్న మిరపకాయ ముక్కను అగ్నిలో వేసినచో ఆమనుష్యుడే దాని తీక్షణతను భరించలేకపోవును. దగ్గుచు దగ్గుచు అపసోపాలు పడిపోవును. ఇరుగు పొరుగువారికి కూడా ప్రాణములు కొలికికి వచ్చును"ఏ దౌర్భాగ్యుడు మిరపకాయలను కాల్చినాడో" అని తిట్టిపోయుదురు. మనుష్యులు ఘృతము, ఉత్తమ సామగ్రితో హవనమొనర్చినచో, "ఏ సోదరి గృహమందో యజ్ఞము జరుగుచున్నది. దాని సుగంధమే వచ్చుచున్నది" అనియందురు. ఏవస్తువును

అగ్నికాల్చివేయునో దాని శక్తి ఎన్నిరెట్లు పెరిగిపోవునో ఇప్పుడు నీకు తెలిసిపోయియుండును. యజ్ఞముకన్న గొప్పదగు ఉపకారము యజ్ఞముల ద్వారా మన గృహములందలి వాయువు శుద్ధమగుటయే గాక అది మన మిత్రులు, శత్రువుల గృహములందలి వాయువును కూడా శుద్ధపరచును. ఎవరైనను ఇతరుల దానమును గ్రహించమని దీక్షగొనినను ఈ యజ్ఞముద్వారా సర్వ ప్రజలును ఈ అమృతమయమగు దానమును గ్రహించుచునే యుందురు. ఎట్లన యజ్ఞ సామాగ్రి కాలి సూక్ష్మరూపమున వాయువుద్వారా అందరి గృహములలోనికి ప్రవేశించి రోగాణువులను నష్టమొనర్చివేయును. ఇందుకే ఇది "గుప్తదాన" మనబడినది.

**ఇందిర:-** ప్రపంచమందలి దుర్గంధమును వ్యాధుల కీటాణువులను సూర్యరశ్మియే నాశమొనర్చును గదా! ఇక యజ్ఞముల నొనర్చు అవసర మేముండును? మనుష్యులు కష్టపడకుండనే కార్యము పూర్తియగుచున్నప్పుడు వ్యర్థముగా తల బ్రద్ద లేల చేసికొనవలెను?

**సువర్ణ:-** సూర్య చంద్రులు మానవ ప్రయత్నము లేకనే ఉదయించు చున్నప్పుడు మనుష్యులు ప్రకాశముకొరకు విద్యుద్దీపములచే, గ్యాసు లాంతర్లచే, తైలదీపములచే పనులేల తీసికొనుచున్నారు? సృష్టియందు ఫల పుష్పములు, వనస్పతులు, ఔషధు లెన్నియో నిరంతర ముత్పన్నమగుచున్నవి కదా! ఐనప్పుడు మనుష్యులు వ్యవసాయ కృషిద్వారా ధాన్యముల నేల ఉత్పన్నమొనర్చుకొనుచున్నారు? శరీరమునందు స్వయముగనే వ్యాధులను నాశపరుచు క్రియను, శక్తులను పరమేశ్వరుడే ప్రసాదించినాడుకదా! హృదయము నిరంతరము రక్తమును శుద్ధపరచుచున్నది. కడుపులోని ఆంత్రములు (ప్రేగులు) సక్రమముగా భోజన పానీయాదులను విభాజన మొనర్చుచున్నవి. మరియు క్రమాను సారముగా ప్రతి ఇంద్రియమునకు ఉత్తమ భాగము నందించుచు, చెడు భాగములను శరీరమునుండి బయటికి నెట్టివేయుచున్నవి. మనలోనే వ్యాధులను దూరమొనర్చుటకు సముచితమగు ప్రబంధమున్నది. ఐతే మనుష్యులు ఔషధముల నెందుకు మ్రింగుచున్నారు. ? పథ్యముల నేల చేయుచున్నారు? వాస్తవముగ ఈ సృష్టి ఈ నియమములు మానవుల

కల్యాణముకొరకే. వారు తమ కనుకూలముగ వ్యవహరించవలెనని ప్రేరణ నిచ్చుచున్నవి."సృష్టినియమములను చక్కగా అవగాహన మొనర్చుకొనుము, సూర్యుడు తన రశ్మిలద్వారా దుర్గంధములను తొలగించునట్లే మీరును దుర్గంధములను తొలగించుకొనుచుండుడు. ఆయన సృష్టియందలి వాయువును శుద్ధపరచుచున్నట్లే మీరు కూడ వాయువును శుద్ధపరచుచుండు"డని తెలుపుచున్నవి. ఈ యజ్ఞయాగములు, మున్నగునవి పరోపకార కార్యములను ఆచరించుటకు సృష్టి నియమములు ప్రబల ప్రమాణమునకు ప్రత్యక్ష పరిచయమును గలిగించుచున్నవి.

**ఇందిర:-** మంచిది యజ్ఞమొనర్చుచు మంత్రములేల చదువవలెను?

**సువర్ణ:-** మంత్రములందు యజ్ఞముల లాభములను గురించిన వర్ణన యుండును, అవి శ్రోతృగణమునకు (వినువారికి) వినిపించబడును. రెండవది:- మంత్రములు కంఠస్థ మగును దాని ఫలితముగ వేదముల రక్షణ జరుగును. మూడవది:- పదేపదే చదువుచుండు విషయముపై శ్రద్ధ గలుగును. శ్రద్ధవలన కార్యములందు ప్రవృత్తి గలుగును కార్యమున ప్రవృత్తులైయుండుట వలన ఆత్మపై కర్మకాండయొక్క ఉత్తమ సంస్కారములు పడుచుండు కారణమున మానవులు తమ జీవనోద్దేశ్యమును సఫలమొనర్చుకొన గలుగుదురు.

**ఇందిర:-** అక్కయ్యా ఈ విషయము తెలిసినది. మరి యజ్ఞోపవీతమును ధరించుకొనుటవల్ల లాభమేమి? ఈ దారములను లోకులు మెడలో ఏల వేసికొందురు? కొందరు మూడు దారములను, మరికొందరు ఆరుపోగు (దారము)లను వేసికొందురు. ఇందులో ఏమైన ప్రత్యేక రహస్యమున్నదా?

**సువర్ణ:-** యజ్ఞోపవీతము ప్రతిజ్ఞా సూత్రము, లేక వ్రతబంధ మనియు అనబడుచున్నది. దీనిని ధరించి మనుష్యుడు కర్తవ్యపాలన మొనర్చుటకు వ్రతదీక్షను గొనును. వాస్తవముగ యజ్ఞోపవీతమునకు మూడుదారములే యుండును. ఈ మూడు పోగులు ఒక బ్రహ్మముడియందు బంధించబడి యుండును. ఈ మూడు దారములు ప్రతి మనుష్యునిపై నుండు మూడు విధములగు ఋణములను జ్ఞాపకమొనర్చుచుండును. ఇవి దేవఋణము, ఋషిఋణము, పితృఋణములు. ఈ ఋణములనుండి మానవులెల్లరును

విముక్తులు కావలిసియుండునని, ఇవి మనకు నిరంతరము జ్ఞాపకమొనర్చుచున్నవి. దేవఋణమనగా పరమేశ్వరుడు మనకీ మానవజన్మమును ప్రసాదించినాడు. కావున ఆతని స్తుతి,ప్రార్థన,ఉపాసనలను ప్రతి నిత్యము నియమపూర్వకముగా చేయుచుండవలెను. సంధ్యాహవనముల నొనర్చనివారు దేవఋణమునుండి విముక్తులు కాజాలరు. ఈ సంధ్యాయజ్ఞముల నొనర్చుటవల్ల ఈశ్వరుని కెట్టి లాభమును లేదు. ఇందువల్ల మనకే ఉత్తమమగు లాభముగలదు. ఎట్లన, సంధ్యనొనర్చుటవల్ల ఆత్మికోన్నతి కలుగును. హవనమువలన శారీరకోన్నతి జరుగును. ఏమనుష్యుడు ఉపకారమొనర్చువారికి ప్రత్యుపకారమొనర్చడో, వాడు కృతఘ్ను డగును. కృతఘ్ను డెవ్వరికిని విశ్వాసపాత్రుడు కాజాలడు. వానికి నిష్కృతి యుండదు.

"బ్రహ్మఘ్నేచ సురాపేచ చౌరే భగ్నవ్రతస్తథా।
నిష్కృతిర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతి"

ఈమూడు దారములం దొకటి సంధ్యాహవనముల ద్వారా దేవఋణము నుండి విముక్తుడగుటకు ప్రతిజ్ఞనొనర్పజేయును. రెండవ దారము. పితృఋణముతీర్చుకొనుటకు, అనగా మాతాపితరుల, పెద్దల సేవ నొనర్చుటకు ప్రతిజ్ఞచేయించును. ఇకమూడవ దారము ఋషిఋణమునుండి విముక్తుడగుటకు ప్రతిజ్ఞ చేయించును. గురువులు, ఆచార్యులు, విద్యాధ్యాపనము, సదుపదేశముల ద్వారా మనకు సన్మార్గమును దర్శింపజేయుదురు. కావున సదా వారిసేవల నొనర్చుచుండవలె'నని మనకు నేర్పుచున్నది. ఇంకా ఎన్నెన్నో సూక్ష్మవిషయములను గూర్చిన ప్రతిజ్ఞలను ఈ త్రిసూత్రములు అనగా జంధ్యము మనచే చేయించుచున్నది ఎట్లన జ్ఞాన,కర్మ ఉపాసనలనెడి ఈ మూడు సాధనములు ఈశ్వర ప్రాప్తి కొరకె యున్నవి. యజ్ఞోపవీతమును ధరించి మనుష్యుడు "నేను జ్ఞానకర్మఉపాసనలతో ఈశ్వరుని ప్రాప్తించుకొందును. జాగ్రత్, స్వప్న,సుషుప్తి అవస్థలను పూర్ణమొనర్చుకొని తురీయావస్థకు చేరి పరమేశ్వరుని దర్శించుకొందు"నని యనును. ప్రకృతియొక్క సత్వరజస్తమములు అను నీమూడు గుణములతో యథావతుగా లాభమును పొందుచు జీవితముయొక్క పరమోద్దేశ్యమగు పరమాత్మతో దృఢసంబంధమును

గలిగించుకొందును. నేను పిన్నలు,పెద్దలు, సమానస్థులతో ఉత్తమ నడవడిని గలిగియుందును. అనగా పెద్దలను గౌరవింతును, సమానస్థులతో ప్రేమ పూర్వకముగా నుందును. పిన్నల యెడ దయగలిగి యుండెద"నను అనేక మహత్వపూర్ణమగు విషయములను, ప్రతిజ్ఞాబద్ధ ఆదర్శములను ఈ యజ్ఞోపవీతము మన యెదుట నుంచును.

**ఇందిర:-** "యజ్ఞోపవీతమునందు మూడు దారములే యుండవలె" నని నీవు చెప్పు విషయము నాకు నిజమనిపించుట లేదు. నేను ఆరు, తొమ్మిది, దారములతో రెండు మూడు ముడులు గల జంధ్యాలను వేసికొనినవారి నెందరినో చూచితిని, ఇక నీవు చెప్పుచున్న ప్రతిజ్ఞా విషయములను ఈ జంధ్యము లేకున్నను జ్ఞాపకముంచుకొన వచ్చును గదా! ఈ దారముల బంధనములందు మనుష్యులను బంధించు అవసరమేమున్నది?

**సువర్ణ:-** నీవు ఆరు తొమ్మిది దారములను రెండు మూడు ముడులుగల యజ్ఞోపవీతములను ధరించుకొనినవారిని అవశ్యముగా చూచియుందువు. కాని యజ్ఞోపవీతమునకు మూడే దారము లుండవలెను(యజ్ఞోపవీత రహస్యమును సంపూర్ణముగా తెలిసికొనదలచినవారు నాచే రచింపబడిన "శిఖా,యజ్ఞోపవీతములు" అను పుస్తకమును తప్పకచదువవలెను((లోకమల్హారి)) ప్రాచీన కాలమున యజ్ఞోపవీతమును స్త్రీలుకూడా ధరించి వేదములు మున్నగు సచ్ఛాస్త్రము (సత్ శాస్త్రము) ల నధ్యయన మొనర్చుచుండిరి. కాని కాలచక్ర ప్రవాహమున స్వార్థముతో గూడిన పురుష సమాజము మహిళామతల్లులను యజ్ఞోపవీత ధారణ మరియు వేదాధ్యయనమొనర్చు అధికారమునుండి వంచితుల నొనర్చినది. ఆ స్త్రీలవంతు యజ్ఞోపవీతములను పురుషులు తామే మెడలందు వేసికొన సాగినారు. కాని ఇప్పుడు మహర్షి దయానందుల కృప వలన స్త్రీలకు మరల యజ్ఞోపవీతముల ధరించు, మరియు వేదాది శాస్త్రముల అధ్యయన మొనర్చు అధికారము ప్రాప్తించినది. దాని ఫలితముగా లక్షలాది ఆర్యసోదర సోదరీమణులు ఈ త్రిసూత్రములను ధరించసాగినారు. ఏ ఆర్య పురుషుడును ఆరు,తొమ్మిది పోగుల జందెమును ధరించడు. స్త్రీల ఉన్నతికి మరియు శిక్షణకు విరోధులైనవారు మాత్రమే రెండు మూడు ముడుల జంధ్యములను

ధరించుచుందురు. ఇక మిగిలి పోయినది "యజ్ఞోపవీతము లేకున్నను (ప్రతిజ్ఞలను జ్ఞాపకముంచుకొన వచ్చును గదా! వ్యర్థముగా జంధ్యములు ధరించుట ఎందుకు? అనుమాట "సీవను విషయము" పోలిసు సిపాయికి వాని కర్తవ్య సంబంధ సకల విషయములను నేర్పించి, అందుకు తగిన తొడుగు ((డెస్సు)లు, అధికార బిళ్ల నీయక "అట్టిదుస్తులు, బిళ్లల" బంధనము నందేల బంధించవలె" నన్నట్లున్నది. సిపాయి దుస్తులు, బిళ్ల ధరించనిచో సామాన్యునికి, ఆ పోలీసు బం(ట్రోతునకు గల భేద మేముండును? ఆతడు 'పోలీసు' అని ఎట్లు గుర్తింపబడును? లోకులైనను వాని అధికారముల నెట్లు గుర్తించగలరు? ఈ చిహ్నము పోలీసు అధికారిని గుర్తింపజేయునట్లే యజ్ఞోపవీతము ఆర్యునకు (ధార్మికునకు) అత్యావసర చిహ్నామే. ద్విజాలకు కర్తవ్య సంబంధ (ప్రతిజ్ఞలను జ్ఞాపకముంచుకొనుట అత్యంతావశ్యకమైనటులనే ద్విజత్వ చిహ్నమగు యజ్ఞోపవీతధారణమును అత్యవసరమే.

**ఇందిర:-** మంచిది, కొందరు దీనిని చెవిపైకేల యెక్కించుకొందురు?

**సువర్ణ:-** మలమూ(త విసర్జన కాలములందే దీనిని చెవిపై కెక్కించు కొనుచుందురు.

**ఇందిర:-** ఇట్లెందుకు?

**సువర్ణ:-** మల మూ(త్రముల విసర్జనానంతరము ముఖము, కాళ్లు చేతులు కడుగుకొని శుద్ధపరచుకొనవలెను గదా! ఈ సూ(త్రము చెవిపైనుండి "ఇంకా నీవు శుద్ధముకాలే"దని తెలుపుచుండును. కాళ్లుచేతులు, ముఖము కడుగుకొనిన పిదప దీనిని చెవిపైనుండి తీసివేయుదురు. ఈ దృష్టితో జంధ్యము యొక్క పవి(త్రతను జ్ఞాపకమొనర్చుకొనుటకు కూడ ఇది ఒక సాధనమగుచున్నది.

**ఇందిర:-** జంధ్యమును చెవిపైకెక్కించుకొనుట అత్యవసరమా?

**సువర్ణ:-** మిక్కిలి ఆవశ్యకమేమి కాదు. ఐనను చెవిపైకెక్కించుకొనినను దోషమేమి కాదు. నేను మొదట చెప్పినట్లు దీనివల్ల శు(భతను గూర్చిన జ్ఞాపకము నిలిచియుండును. ఒక విషయమును వినుము. జంధ్యమొకవేళ పొడవుగా నుండినచో మలమూ(త్రము వల్ల మురికి యగుట సంభవమగును.

అట్టి స్థితియందు చెవిపైకెక్కించుకొనుట తప్పనిసరియే.

**ఇందిర:-** మంచిది, లోకులు శిఖ(పిలక) నేల యుంచుకొనెదరు? సంధ్యనొనర్చుకొనుటకు పూర్వము దానినేల ముడివేసికొందురు?

**సువర్ణ:-** శిఖ(శిఖరము)అను ఈ పిలక మనుష్యుని శరీరమునందు అత్యున్నత స్థానమున నున్నందున ఈ చిహ్నము అన్నిటికన్న ఉన్నతమైన దని తెలుపుచున్నది. శిఖనుంచు స్థానమును 'బ్రహ్మరంధ్ర'మని యందురు. విద్వాంసు లీ స్థానమును 'బ్రహ్మయొక్క గుప్తకోశ'మనియు అందురు. కావుననే వైదిక సంధ్యయందు "ఓం సత్యం పునాతు పున: శిరసి" అని వచ్చినది. సంధ్య చేయుటకు ముందు గాయత్రీ మంత్రోచ్చారణ నొనర్చుచు సర్వప్రథమముగ శిఖను ముడివేసికొందురు. దీనియుద్దేశ్యమేమన, వెంట్రుకలు గాలికి కదలినచో మనుస్సును చెదిరిపోకుండా నుంచగలదు. రెండవది:- ఉపాసకుడు తన ఆత్మను పరమాత్మతో ముడివేసి యుంచుకొనుటకు కూడా ఇది చిహ్నమే, ఎట్లన, కన్యవివాహ సమయమున తనపతిని వరించు చివరి చిహ్నముగ తన ప్రతిజ్ఞను కార్యరూపమున నుంచుచు తనకొంగుముడిని తనపతి ఉపవస్త్రపు కొంగుముడిచే బంధించివేసికొనును. ఈ ముడియే బ్రహ్మముడి. వివాహ ప్రతిజ్ఞల కిది చివరి బంధ మని కూడా నెంచబడును. వాస్తవమునకు పిలక కూడ ధర్మమునకు చిహ్నమే. దీనివిస్తరణకూడ నాచే రచింపబడిన "శిఖాయజ్ఞోపవీతము" అనుపుస్తకమున కలదు.

**ఇందిర:-** అక్కయ్యా! హిందువులే ఈ శిఖను ఉంచుకొందురు. ఇతరులు ఉంచుకొనరు ఎందుకో కొంత వివరించి చెప్పగలవా?

**సువర్ణ:-** ఇది ఆర్యులకు'ధర్మచిహ్న'మని నే నిదివరకే తెలిపియుంటినిగదా! శిఖ అనుదాని యర్థమే శిఖరము, లేక ఉన్నతము అని. వైదికధర్మము ఈశ్వరీయమగు కారణమున ఇదిశిఖరాగ్ర ధర్మము. కావుననే దీనిని ధర్మరూప చిహ్నముగ నుంతురు. వేద ధర్మము నాచరించనివారు పిలక నెట్లుంచుకొందురు? శిఖర ధర్మము నాచరించువారే అందుకు చిహ్నముగ శిఖనుంచుకొని దాని మర్యాదను కాపాడుకొనుచుందురు.

**ఇందిర:-** మంచిది అక్కయ్యా! నేటికింతయేచాలు, రేపు మరియొక ఆవశ్యక విషయము గూర్చి మాట్లాడుకొందము. నమస్తే.

**సువర్ణ:-** మంచిది అట్లేజరుగగలదు. నమస్తే.



## యజ్ఞోపవీతధారణ విధి

**యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్ సహజం పురస్తాత్**
**ఆయుష్య మగ్ర్యం ప్రతిముఞ్చ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజ:**
**(పారస్కర గృ. సూ.2-2-10-1.)**

భావార్థము: పంచ మహా యజ్ఞాదులను చేయుటకు ధరించు ఈ యజ్ఞోపవీతము పరమ పవిత్రమైనది. ఏది ప్రజాపతియైన పరమేశ్వరుని చేర్చుటకు సహకరించునో, జన్మించక ముందునుండి తల్లి గర్భములో బొడ్డు త్రాడుగా సహజముగా నుండునో ఆ యజ్ఞోపవీతము ప్రాణశక్తిని బలపరచి దీర్ఘాయువు నిచ్చును. అన్ని రంగములలో అగ్రే సరత్వమును (ఉన్నతిని) కలిగించును. శుభ కర్మలకు భిన్నమైన అన్ని చెడు పనులనుండి విడిపించి మేలు చేయును. అట్టి ఈ యజ్ఞోపవీతము నాకు తేజస్సు నిచ్చు శారీరక, మానసిక, ఆత్మిక బలముల నిచ్చుగాక.

తదుపరి యీ క్రింది మంత్రమును పఠించవలెను

**యజ్ఞోపవీత మసి యజ్ఞస్యత్వా యజ్ఞోపవీతే నోపనహ్యామి**
**(పారస్కర గృ సూ. 2-2-10-2.)**

ఓ సూత్రమా! నీవు యజ్ఞోపవీతమవు నిన్ను ఉత్తమ కర్మలు చేయుట కొరకు గ్రహించుచున్నాను. అందుకొరకే - ఉత్తమ కర్మలు చేయుట కొరకే నన్ను నేను స్వయముగా బంధించు కొనుచున్నాను.

# వర్ణవ్యవస్థ జన్మవలనా? లేక కర్మవలనా?

(తొమ్మిదవ దినము: ప్రాత:కాలము)

**ఇందిర:-** అక్కయ్యా జాతి జన్మవలననా లేక కర్మవలననా? నే డీ విషయమునుగూర్చి తెలుపుము.

**సువర్ణ:-** జాతి జన్మమువలన కాని కర్మవలన కాదమ్మా.

**ఇందిర:-** బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య,శూద్రులనునది కర్మతోనే యని నీ వొకనాడు చెప్పితివి. ఇప్పుడేమో జన్మతో నని చెప్పుచుంటి వేల?

**సువర్ణ:-** బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్య, శూద్రులనువారు గుణ కర్మల ద్వారానే యగుదురు. కాని జాతి జన్మమువలనే లెక్కించబడును.

**ఇందిర:-** దీనియుద్దేశ్యమేమి? బ్రాహ్మణ,క్షత్రియ,వైశ్య,శూద్రు లనునవి జాతులు కావా?

**సువర్ణ:-** కావు. ఇవి వర్ణములు. జాతి యనునది జన్మనుండి మృత్యువు వర కుండునది. దానియందు పరివర్తనము(మార్పు) ఉండదు. ఎట్లన, మనుష్య జాతి,పశు పక్షిజాతి మున్నగునవి. మనుష్యులు పశువులుగా గాని, పశుపక్షులు మనుష్యులుగా గాని మార్పుచెందరు. ఏ జాతులలో యేవి జన్మించిన అవి ఆయాజాతియందే ఉండును.

**ఇందిర:-** ఐతే వర్ణము మారగలదా?

**సువర్ణ:-** ఎందుకు మారదు? వర్ణమను దాని అర్థమే స్వీకరించబడిన దని, వర్ణః స్వీకారః. వర్ణములు గుణకర్మలతో స్వీకరించబడునప్పుడు ఎట్లు గుణ కర్మలుండునో అట్లే వర్ణము లుండును.

**ఇందిర:-** ఐతే బ్రాహ్మణ,క్షత్రియ,వైశ్య,శూద్ర వర్ణములు ఈశ్వరుడు చేసినవి కావా?

**సువర్ణ:-** ఈశ్వరుడు జాతుల నేర్పరచినాడు కాని మానవ సమాజమునకు గుణ కర్మానుసారము వర్ణముల నేర్పరచు ఉపదేశమ్మును పరమేశ్వరుడు వేదములద్వారా ప్రతిపాదించినాడు.

**ఇందిర:-**ఏయేగుణకర్మలద్వారాబ్రాహ్మణ,క్షత్రియ,వైశ్య,శూద్ర వర్ణము లేర్పడినవి?

సువర్ణ:- వేదము శరీర దృష్టాంతము నిచ్చి ఈవిధముగ వివరించినది.

**"బ్రాహ్మణోZ స్య ముఖమాసీద్బాహూ రాజన్యః కృతః॥**

**ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత॥ యజు. 31-11**

సమాజరూప శరీరమునకు బ్రాహ్మణులు ముఖము వంటివారు. క్షత్రియులు బాహువులవంటివారు,వైశ్యులు ఉదరము(పొట్ట)వంటివారు శూద్రులు పాదముల వంటివారు. ఈ దృష్టాంతములో శరీరాంగము లన్నింటి యందు ముఖము జ్ఞానప్రధానాంగము. ఏలన, ముఖమునందు ముక్కు,చెవులు,కన్నులు,నోరు,జిహ్వాఅనెడి ఐదు జ్ఞానేంద్రియము లున్నవి.

రెండవది:- చలి,వర్షము,మున్నగు ఋతువులందు శరీరమునంతటిని వస్త్రములతో కప్పుకొనెదము. కాని ముఖమును మాత్రము సదా తెరచియుంతుము. అది చలి, వర్షము,వేడి మున్నగు ఋతువులచే గలుగు బాధలను చక్కగా సహించుకొనును.

మూడవది:-ముఖముతాను గ్రహించుకొనిన దంతయును తనవద్దనే యుంచుకొనకఇతరులకిచ్చుచుండును. ఏవ్యక్తియందు జ్ఞానము, తపము, త్యాగము గలదో ఆత డందరికిని ఇచ్చుచుండును. కావున నాతడు బ్రాహ్మణుడు. బాహువులను క్షత్రియులని తెలుపు భావ మేమన, బాహువులు(చేతులు) అనగా భుజబలము శారీరక బలమున ప్రధానమైనది. కావున శరీరముపై ఎప్పుడైనా ఆక్రమణము జరిగినచో ప్రప్రథమముగ చేతులే చర్య తీసికొని దానిని (శరీరమును) రక్షించుచుండును. అనగా న్యాయ పూర్వకముగా తమ శక్తిద్వారా ప్రజలను రక్షించువారు క్షత్రియులు. పొట్టభాగము 'వైశ్యు'డని యనబడినది. దీని యుద్దేశ్య మేమన, కడుపు భోజ్యపదార్థములను తనయందు సమకూర్చుకొని వానిని చక్కగా జీర్ణింపజేసి ప్రతియంగమునకు దాని యోగ్యతానుసారము దానిభాగమునందజేయును. అటులనే ధన ధాన్యములను ఏకత్రిత మొనర్చి మానవ సమాజమునకు యథోచిత నియమానుసారము వాని భాగము వాని కందజేయుచుండును. అట్టివారినే వైశ్యవర్ణమందురు. ఇకపాదములు శరీర భారమునంతయు వహించి చక్కని పరిశ్రమ నొనర్చుచు శిరస్సు,చేతులు,పొట్ట మున్నగు అంగములను ఎచ్చటికి చేర్చవలయునన్న అచ్చటికి చేర్చుచున్నవి.

వానికి జ్ఞానము, ధనసంపదలనునవి లేవు. వానికి ఆలోచించి కార్యము నొనర్చు శక్తికూడ లేదు. కాని వానివద్ద పరిశ్రమ నొనర్చు శక్తిమాత్రము పుష్కలముగ నున్నది. దానిద్వారా అతడు సమాజరూప శరీరమునకు తగురీతిగా సేవ చేయుచుండును. దీని సార మేమన, సేవా ప్రధానమైనవారు శూద్రులు, బ్రాహ్మణులు జ్ఞానముద్వారా, క్షత్రియులు శక్తిద్వారా, వైశ్యులు ధనముద్వారా శూద్రులు శ్రమద్వారా మనసమాజమునకు సేవచేయుచుందురు. ఇదియే వర్ణముల వర్ణత్వము.

**ఇందిర:-** జ్ఞానము, బలము,ధనము,పరిశ్రమ ఎంతో కొంత అందరియందును చూడబడుచున్నది. ఈ దృష్టితో ప్రతిమనుష్యుడును నాలుగు వర్ణములకు చెందినవా డగును, ఐతే ఈ బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్య శూద్ర వర్ణములు అను వ్యవస్థవేరుగా నుండవలసిన అవసర మెందుకు?

**సువర్ణ:-** వాస్తవమే, ప్రతి మనుష్యునందును నాలుగు వర్ణముల యోగ్యతయుండును. కాని ఎవనియందు ఏతత్త్వము ముఖ్యముగా నుండునో దానియాధారమునే వర్ణముల నిర్ణయము జరుగుచుండెడిది. ప్రతిమనుష్యుని యందును ఏదో యొక ముఖ్యవిషయము అవశ్యముగనుండును. ఒకడు గుణవంతుడైతే మరొకరు బలవంతుడు. వేరొకడు ధనవంతుడు. ఇంకొకడు కృషివంతుడుగానుందురు. దాని యాధారముననే వాని వర్ణ ముండును. వేదము దీనిని బీజరూపముగా, ఆలంకారికముగా వర్ణించినది. విద్వాంసులు ఆ యలంకార రహస్యమును విశదపరచినారు.

**ఇందిర:-** కొంత స్పష్టమైన రూపములో వర్ణించి చెప్పుము. ఏయే కర్మల నొనర్చువారు ఏయే వర్ణమునకు వచ్చెదరు.

**సువర్ణ:-**ఎవనియందు శమము, దమము, తపము, పవిత్రత, శాంతి, కోమలత్వము జ్ఞానము,విజ్ఞానము, ఆస్తికత్వము గలదో ఆవ్యక్తి బ్రాహ్మణుడు. వీరత్వము, ధీరత్వము,తేజము, ధైర్యము, దక్షత, యుద్ధమునుండి పారిపోని స్వభావము, దానిశీలత్వము, ఈశ్వరునివలె న్యాయ శీలత్వముగలవాడు క్షత్రియుడు. కృషి,గోరక్షణము,దానము, వాణిజ్యవ్యాసాయములందు నైపుణ్యము

గలవాడు వైశ్యుడు. ఇక కేవలము జాతికి మనసావాచా కర్మణా సేవజేయుచు ఉన్నత వర్ణమును పొందుటకు ప్రయత్నమొనర్చువాడు శూద్రు డనబడును.

**ఇందిర:-** జన్మతోనే వర్ణములను నమ్మినచో ఆపద యేమి? కోట్లకొలది మానవులు ఇట్లే నమ్ముచుందురు గదా!

**సువర్ణ:-** జన్మతో వర్ణములను నమ్మువారి ననుసరించియును వర్ణము కర్మ చేతనే యని సిద్ధించును. వారి ఉద్దేశ్యము ననుసరించియును బ్రాహ్మణ,క్షత్రియ,వైశ్యులను నీ మూడు వర్ణములను 'ద్విజు'లని యెంచుదురు. శూద్రులను 'ఏకజు'లని విశ్వసింతురు. రెండు జన్మలను దాల్చువారినే 'ద్విజు' లని యనెదము. "ద్వాభ్యాం జాయతే ఇతి ద్విజః" దంతములు,మరియు పక్షులవలె ప్రపంచములో ఎవరికి రెండు జన్మలుండునో వారిని 'ద్విజు'లందురు. దంతములను 'ద్విజము'లని ఏల యందురనగా వానికికూడా రెండు జన్మలుండును. బాలుర పళ్లు ఊడిపోగానే వానికి మరల జన్మయుండును. ఇక పక్షులను'ద్విజము'లని ఏల యందు మన వానికి కూడా రెండు జన్మలుండును. ఒకటి తల్లినుండి'గ్రుడ్డు' రూపమున, తరువాత గ్రుడ్డునుండి పక్షిరూపమున జన్మించును. ఇక నిప్పుడాలోచించవలసిన విషయ మేమనగా, ఒకవేళ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు ద్విజులైనచో ఇప్పుడు వారి రెండవజన్మ యనునది ఏది? మాతా పితరులనుండి జన్మజరిగినప్పుడు ఎల్లరును ఏకజులే. అనగా ఒకే జన్మవా రగుదురు. మరల'ద్విజ' అనగా రెండవ జన్మగల వారెట్లు? దీనికి సమాధానమేమన, తల్లిగర్భమునుండి జన్మించినది మొదటి జన్మము. ఎనిమిది వత్సరములకు గురుకులమున ఆచార్యులవద్ద బ్రహ్మచర్య దీక్షను దీసికొనుట రెండవ (ద్విజ) జన్మయగును. బ్రహ్మచర్యానంతరము ఆచార్యులు యోగ్యతానుసారము వారికి వర్ణప్రదానమొనర్తురు. ప్రాచీన కాలములో ఇదియే వాస్తవమగు వర్ణవ్యవస్థయై యుండెడిది. ఎల్లరును తమతమ సంతానమును గురుకులమునకు పంపుచుండిరి. విద్యలు నేర్చిన తరువాత వారి యోగ్యతల ననుసరించి ఆచార్యులు వారికి వర్ణముల ప్రమాణ పత్రముల నిచ్చుచుండిరి.

**ఇందిర:-** బ్రాహ్మణబాలురు బ్రాహ్మణులుగా, శూద్రులబాలురు శూద్రలుగానే ఉండవలెనుగదా!

**సువర్ణ:-** బ్రాహ్మణబాలురు బ్రాహ్మణులుగా, శూద్రుల బాలురు శూద్రులుగానే ఉండవలసిన అవసర మేమియును లేదు. ఎట్లన, డాక్టరు బాలుడు డాక్టరుగా, వకీలు బాలుడు వకీలుగా, ఇంజనీరు బాలుడు ఇంజనీరుగానే ఉండవలసిన అవసర మేమియును లేదు. తండ్రివంటి యోగ్యత తనయులయందు లేకున్న వారు తమ తండ్రి పదవిని ఎట్లు చేరగలుగుదురు?

**ఇందిర:-** గుఱ్ఱమునుండి గుఱ్ఱము, గాడిద నుండి గాడిద,మామిడినుండి మామిడి, కమలాఫలమునుండి కమలాలే ఉత్పన్న మగునట్లు బ్రాహ్మణునినుండి బ్రాహ్మణుడు, శూద్రుని నుండి శూద్రు డుత్పన్నమగునని నేను భావించుచున్నాను.

**సువర్ణ:-** నేను మొదట చెప్పినట్లు గుఱ్ఱము, గాడిద, గేదె, మున్నగునవి జాతులు.జాతినుండి జాతి ఉత్పన్నమగును కాని బ్రాహ్మణులు, క్షత్రియులు మున్నగునవి వర్ణములు. ఇవి గుణ కర్మానుసారము మారుచుండును. జాతు లెప్పుడును మారవు. గుఱ్ఱము, గాడిద లెప్పుడును కావు. వాని జాతి పుట్టినప్పటి నుండి మరణించువరకు అట్లే యుండును.

**ఇందిర:-** నా ఉద్దేశ్యములో వర్ణములుకూడ మారవు. ఈశ్వరు డెట్టి వర్ణముల నెవ్వరికిచ్చినాడో అట్టివర్ణములును మరణించువర కట్లే యుండగలవు.

**సువర్ణ:-** వర్ణములు మారవని బాగానే చెప్పినావు. ఒకవేళ వర్ణములు మారకున్నచో బ్రాహ్మణులు, క్షత్రియులు మున్నగువారు కొందరు ముస్లింలుగా, ఈసాయీలుగా ఎట్లయినారు. ? ఈ భారతదేశములో దరిదాపు 30 కోట్లకు పైగా ముస్లిం ఈసాయీలలో 80 శాతం హిందువులే మారకము చెందినవారున్నారు. ఇందు నాలుగు వర్ణములవారును ఉన్నారు. వీరెట్లు వర్ణములను మారిరి? వర్ణములను ఈశ్వరుడే చేసినాడనిన వీరెప్పుడైనను మార్పుచెందెడివారా? అట్లెప్పుడును జరుగదు. పరమేశ్వరుడు పుట్టించినవారి యందెప్పుడును పరివర్తనము జరుగదు. పరమేశ్వరుడు సృష్టించిన మామిడి, ఎప్పుడును కమలాఫలవృక్షముగ మారదు. ఆయన పుట్టించిన పులి ఎప్పుడును ఏనుగు కాజాలదు. ఏదైనా చిన్నమార్పు కలిగినచో అది తాత్కాలిక మానవుల విశ్వామిత్ర సృష్టియే. ప్రపంచమునందలి ఏపదార్థమునైనను చూడుము . ఈశ్వరుడు చేసిన

వన్నియును అపరివర్తన శీలములే. ఈశ్వరుడు చేసిన బ్రాహ్మణుడు బ్రాహ్మణుడుగానే యుండవలెను. క్రైస్తవుడు క్రైస్తవుడుగానే యుండవలెను. కాని అట్లు జరుగుటలేదు. గుణకర్మలు మారుటవల్ల బ్రాహ్మణుడు బ్రాహ్మణుడుగాను, ముస్లిం ముస్లింగాను ఉండనే ఉండరు.

**ఇందిర:-** అక్కయ్యా! బ్రాహ్మణుడు ముస్లింగా కాని, ఈసాయీగా కాని మారినచో బ్రాహ్మణుడుగానే యుండగలడు. కాని బ్రాహ్మణకర్మకు తగనివాడైపోవును. ఎట్లన, లడ్డు (మోదకము) మురికి యందు పడిపోయినచో లడ్డు లడ్డుగానే యుండగలదు. కాని తినుటకు పనికిరానిదై పోవును.

**సువర్ణ:-** చెల్లీ! ముస్లిం లేక క్రైస్తవుడుగా మారినను బ్రాహ్మణుడు బ్రాహ్మణుడుగానే యుండగలడని నీవు చక్కని తర్కమునే చేసితివి. మంచిది. ఇదే వాస్తవమైతే అతని బ్రాహ్మణుడని ఏల పిలువరు? ముస్లిం, లేక ఈసాయీయని ఏల యందురు.? అట్లుగాకున్నను ముస్లిం బ్రాహ్మణుడు,లేక ఈసాయీ బ్రాహ్మణు డని పిలువవచ్చునుగదా! లడ్డూ ఉదాహరణముకూడా కడు రోచకముగానే యున్నది. లడ్డూ మురికిలో పడినచో పనికారాదని యన్నావు. బాగానేయున్నది. కాని ఏ తండ్రి కొడుకైనను రొంపిలో పడిపోయినచో అట్టిపుత్రుడు తండ్రికి పనికి రాకుండా పోవలెనుకదా! ఇంకా వినుము. ఇదిగో నీవద్దగల బంగారు ఉంగరము మురికిలో పడిపోయినచో అది నీకు పనికి వచ్చునా లేదా? మంచిదే, లడ్డూ మురికిలో పడిపోయినను లడ్డులడ్డుగానే యుండును. నిజమే ఏలన, ఎద్దాని కెట్టి రూపము చేయబడినదో అది స్థిరముగా ఉండనే యుండును. కాని' ఏవస్తువైనను మురికిలో పడిపోయినందున పనికిరాకుండ పోవుట' యనునది ఆవశ్యముగాదు. ఒకరూపాయి నాణెము మురికిలో పడిపోయినను దాని విలువ, దాని కార్యము పనికిరాకుండా పోదు. లడ్డు ఉపమానము జాతులకు సంబంధించినది.అది వర్ణములకు సరిపడదు. మురికిలో పడుట వల్ల లడ్డు లడ్డుగానే యుండును. జిలేబి కాజాలదు. అట్లే మురికిలో పడిపోయినను మనుష్యుడు మనుష్యుడుగానే యుండును. గాడిద, గుఱ్ఱముకాజాలదు. ఏది ఎద్దానికి ఆకృతియో అది అట్లేయుండును. మారజాలదు.

జాతి మరియు వర్ణమునందు గలభేద మిదియే, జాతి ఆకృతితో, వర్ణము గుణకర్మలతో తెలిసికొనబడును

**ఇందిర:-** రూపముతో తెలిసికొనబడదా యేమి?

**సువర్ణ:-** అట్లెప్పుడును జరుగదు. వర్ణము గుణకర్మలతో తెలిసికొనబడును. 'ఒకవేళ రూపముతో తెలిసికొనవచ్చు'ననిన "నీవు బ్రాహ్మణుడవా? క్షత్రియుడవా? నీ వర్ణమేమి? అని అడుగవలసిన అవసరముండ కూడదు. వర్ణము జన్మతో గాదు. గుణకర్మలతో నుండును. ఈ ఒక్కవిషయమే ప్రమాణికముగ నిలుచుచున్నది. ఒకవేళ పరమేశ్వరుడు జన్మతోనే వర్ణము నేర్పరచినచో వానిని గుర్తించుట కేదేని ప్రత్యేక భేదము వానియం దుండుట అవసరమై యుండెడిది. ఈశ్వరుడు చేసిన సకల పదార్థము లందును ఏదోయొక ఆకృతి భేదము చూడబడుచున్నది. ఒక పంక్తియందు ఏనుగు, గుఱ్ఱము,ఒంటె, గేదె, జింక, పంది, రామచిలుక, పావురము మున్నగువానిని నిలుపుము. ఒక చిన్నబాలుడు కూడా వాని రూపములను చూచి ఇది ఏనుగు, ఇది జింక, ఇది చిలుక, అని సులభముగా చెప్పగలడు. అట్లే ఇంకొక వరుసలో మామిడి, జామ,కమలా,రేగు మున్నగు పళ్లను కూడా ఉంచిన వాని రూపములను చూచి ఎవ్వరైనను ఏ ఫలము ఏదో సులభముగా చెప్పగలరు. కాని ఒకవేళ నాలుగు వర్ణముల నాలుగువేల మనుష్యులను ఒకవరుసలో నిలిపియుంచిన అందు ఏమనుష్య దేవర్ణమునకు చెందినవాడైనది ఎవ్వరును చెప్పజాలరు.

**ఇందిర:-** బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు రంగురూపములతో ఏ మాత్రము గుర్తింపబడరా? నేను గొప్పగొప్ప విద్వాంసుల ద్వారా వర్ణములు ఈశ్వరుని ద్వారానే నిర్మింపబడినవని వినియుంటిని?

**సువర్ణ:- మళ్లీ అదేమాటయా? వర్ణములు గుణకర్మలద్వారా ఏర్పడును.** జన్మము, రంగు, రూపములతో కాదని నేనిదివరకే తెలిపియుంటిని. ఒకవేళ రంగు,రూపములతోనైనచో వారిని గుర్తించుటకు బ్రాహ్మణుని రంగు తెలుపు, క్షత్రియుని రంగు ఎరుపు, వైశ్యుని రంగు నలుపుగాను ఉండవలెను, కాని అట్లుండదు. కాశ్మీరులోని పాకివానిని, మద్రాసులోని బ్రాహ్మణుని పోల్చి

చూచుకొనుము. కాశ్మీరులోని పాకివాడు తెలుపు ఎరుపు రంగులతో చక్కని రూపములో, మద్రాసు బ్రాహ్మణుడు రొట్టెలను కాల్చుపెనముకన్న అధిక నల్లగా నుండుటను చూడవచ్చును. వ్యంగ్యము కొరకొక చిన్నహాస్య కథను వినియుంటిని దానిని చెప్పెదను వినుము.

ఒకతడవ రొట్టెలను కాల్చు పెనము, మరియు మద్రాసు బ్రాహ్మణుడికి కోర్టులో వ్యాజ్యము నడిచినది. నేనే ఎక్కువ నల్లగా నున్నానని బ్రాహ్మణుడు, కాదు అంతకన్న కారు నలుపుగా నేనే ఉన్నానని పెనము వాదించుకొనెను. చివరికి ప్రధాన న్యాయమూర్తి బ్రాహ్మణుని పక్షమున తీర్పు నిచ్చెను.

చూడమ్మా! క్వెట్టా, బీహార్ భూకంపములో వేలాది చిన్న పిల్లలు భవనముల క్రిందినుండి వెలికితీయబడిరి. వారిలో అన్ని వర్ణములకు చెందినవా రుండిరి. వారి తల్లిదండ్రులు కాని, తల్లిదండ్రుల,బంధువులజాడ వర్ణముల గుర్తులు కూడ తెలియలేదు. ఇప్పుడు చెప్పుము. వారు ఒకానొకవర్ణమునకు చెందినవారని ఎట్లు చెప్పగలము? అనేక జాతి పశువులు అనగా గేదెలు, ఆవులు, గుఱ్ఱములు, గాడిదలు మున్నగునవి వెంటనే గుర్తించబడును. ఒకవేళ రంగు, రూప, ఆకారముల ఆధారముగా వర్ణముల గుర్తింపవచ్చు ననిన ఆవులు, గుఱ్ఱములు, మేకలు మున్నగువాని వలె వారును వెంటనే గుర్తింపబడవలసి యుండెను గదా! నీవు గొప్ప గొప్ప విద్వాంసులనుండి వినియుందువు. నేను కాదనను, వినుటకు అనేక విషయము లుండును. నిజము నిజమే. నాలుగు ఐదు కలసి తొమ్మిదేయగునను విషయమే సత్యమగును. చూడమ్మా! ఒకవేళ ఈశ్వరుడు జన్మతోనే వర్ణము నేర్పరచినచో ఏభేదము కనపరచకున్నను కనీసము బ్రాహ్మణుని శరీరము ఎనిమిదడుగులు, క్షత్రియుని ఎత్తు ఏడడుగులు, వైశ్యుని ఎత్తు ఆరడుగులు, శూద్రునిఎత్తు ఐదడుగులు కొలతలలో నుంచినను గుర్తించుటకు సులభముగ నుండెడిదికదా! అట్లు గాకున్నను ఆయా వర్ణములను భారము (బరువు)తోనైనను గుర్తించునట్లు బ్రాహ్మణుని బరువు ఐదు, క్షత్రియుని భారము నాలుగు, వైశ్యుని బరువు మూడు, శూద్రుని బరువు రెండు మణుగు లుండునట్లైనను చేయవలసి యుండెను. కాని పరమేశ్వరునకు మానవుల ఉన్నతికై గుణకర్మానుసారము వర్ణవ్యవస్థ నేర్పరచుటకు ఉపదేశించవలసి యున్నది.

కావున ఆ వస్తువులందు భేదమెట్లు చేయగలడు?

**ఇందిర:-** మంచిది. ఈ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములందు అన్నిటికన్న గొప్పవర్ణమేది?

**సువర్ణ:-** ఈ వర్ణములందు గొప్పదిగాని చిన్నదిగాని, ఏదియునుండదు. తమతమకర్తవ్యములందు అన్నివర్ణములు గొప్పవే. శరీరాంగములందు ఆలోచన, వివేకము అవసరమైనపుడు శిరస్సు గొప్పది. రక్షణయొనర్చు సమయమప్పుడు చేతులు (భుజములు) గొప్పవి. భోజనము జీర్ణింపజేసి శరీరాంగము లన్నిటికి యథాయోగ్యముగా భోజనసారమును అందించు అవసరమప్పుడు పొట్టయే గొప్పది. పరిశ్రమ పూర్వకముగ శరీరభారమును మోయుట, రాక పోకల అవసరమైనప్పుడు పాదములు(కాళ్ళు) గొప్పవి. ఇదే విధముగ మానవసమాజమునకు జ్ఞాన సేవ అవసర మగునప్పుడు బ్రాహ్మణుడు, బలముద్వారా సేవ అవసరమగునప్పుడు క్షత్రియుడు, ధనసంపదల సేవ అవసరమగుచో వైశ్యుడు, శారీరకముగ సేవ అవసరమగునప్పుడు శూద్రుడు గొప్పవాడని యెరుగవలెను. ఈవిధముగ స్వతంత్ర రూపమున వర్ణములందు ఒకటి మరొక దానికన్న చిన్నదిగాని, పెద్దదిగాని యుండదు.

**ఇందిర:-** నా ఆలోచన ననుసరించి వర్ణములందు బ్రాహ్మణుడు అందరికన్న గొప్పవాడు. అంతకన్న తక్కువ క్షత్రియుడు, వానికన్న తక్కువ వైశ్యుడు, ఇక అందరికన్న తక్కువ శూద్రు డని తలచుచున్నాను.

**సువర్ణ:-** నీవు తలచుచున్నట్లుండదు. స్వతంత్రరూపమున బ్రాహ్మణుడు బ్రాహ్మణులందు, క్షత్రియుడు క్షత్రియులందు, వైశ్యుడువైశ్యులందు, శూద్రుడు శూద్రులందు తమతమ యోగ్యతానుసారము చిన్నగాని, పెద్దగాని యుండవచ్చును. కాని సామూహిక రూపములో బ్రాహ్మణ,క్షత్రియ, వైశ్య, శూద్రుల వర్ణములందు గొప్ప, అల్ప అనుభేదము లుండవు. అనేక కర్మాగారములందు అనేక కార్మికులు, నిపుణులు పనిచేయుచుందురు. వారి నైపుణ్యమును బట్టి వేతనములను బట్టి చిన్న, పెద్దయని యుండవచ్చును. కానిదర్జీకన్న వడ్రంగి గొప్పవాడని, వాని కన్న కమ్మరి గొప్పవాడని,వారందరికన్న

కమసాలి గొప్పవాడని యుండదు ఎవని క్షేత్రము, నైపుణ్యము, అవసరములను బట్టి వారువారు గొప్పవారని అనిపించుకొందురే గాని ఎవని కర్మలందు వారే గొప్పవారు, వారే చిన్నవారు. ఇదే విధముగా ఒకే వర్ణమునందలి ఇరువురు వ్యక్తులందు గొప్పదనము, అల్పత్వ ముండవచ్చును. కాని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య,శూద్ర, వర్ణముల గుణ కర్మక్షేత్రములు భిన్నభిన్న మగుటవల్ల అచ్చట అన్ని వర్ణములు తమతమ కర్తవ్యపాలనమున గొప్పవే.

**ఇందిర:-** ఈ వర్ణవ్యవస్థ ఇతరదేశములందును కలదా?

**సువర్ణ:-** విశ్వమందలి సమస్త దేశములందును గుణకర్మానుసారము వర్ణవ్యవస్థ గలదు. ఈ వర్ణములపేర్లు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు బదులుగా మిషనరీ (MISSIONARY) మిలిటరీ (MILITARY) మర్చంట్సు (MERCHANTS) మీనియల్స్ (MENIALS) అని ఏర్పరచుకొనబడినది. ఈ శ్రమ విభాగము, లేక కార్యవిభాగము (DIVISION OF LABOUR) అను సిద్ధాంతము ప్రపంచమంతటను అంతర్వ్యాప్తమై యున్నది. దీనిపేరే వర్ణవ్యవస్థ.

**ఇందిర:-** అక్కయ్యా! ఇప్పుడు నేను చక్కగా తెలిసికొన్నాను. ఈ 'నమస్తే'యనునది ఎచ్చటినుండి వచ్చినది?

**సువర్ణ:-** ఈ విషయమును గూర్చి రేపు మాట్లాడుకొందము. నమస్తే.



**చాతుర్వర్ణ్యం మాయా సృష్టం గుణ కర్మ విభాగశః ।**

**శ్రీకృష్ణుడు (భగవద్గీత 4-13)**

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లను చాతుర్వర్ణములు వారివారి గుణ కర్మ స్వభావముల ననుసరించియే ఏర్పరచబడినవి. కాని, జన్మతో ఏర్పడవు.

## 'నమస్తే' ఎచ్చటినుండి వచ్చినది?

(పదవదినము: ప్రాతఃకాలము)

**ఇందిర:-** అక్కయ్యా! ఈ 'నమస్తే' ఎచ్చటినుండి వచ్చినది? దీని అర్థమేమి?

**సువర్ణ:-** సృష్ట్యాదినుండి మహాభారత యుద్ధపర్యంతము సకల మానవులు ఈ 'నమస్తే' ద్వారానే పరస్పరము గౌరవించుకొనుచుండిరి. ఆ తరువాత అనేక మతమతాంతరములు, అనేక సాంప్రదాయములు ప్రపంచమునందు వ్యాపించినవి. వారెల్లరును వేర్వేరు శబ్దములను నిర్ణయించుకొన్నారు. గుడ్మార్నింగ్, గుడ్బాయ్, సలామలేకుమ్. మున్నగు అనేక శబ్దములు విధర్మీయులు కల్పించుకొనినారు. హిందువులందును మతములు, పంథాలు కూడా అనేక శబ్దములను కల్పించుకొనినవి. నమస్కార్, రాంరాం, జై శివ్, జై హరి, జై గోపాల్, జై రాధే శ్యామ్, జై రాంజీకి, జై కృష్ణజీకి, ప్రణామ్, జోహార్ మున్నగు అనేక ప్రయోగములను వ్యాపింపజేసినారు. ఇప్పుడు సరిక్రొత్తవి వ్యాపకమునకు వచ్చుచున్నవి. సాయిరాం, జై మాతాజీ ఇంకా ఏమేమో వాడుకలోనున్నవి. మహాభారతమునకు పూర్వము భూమండలమంతయు ఆర్యుల అఖండ రాజ్యముండెను. ప్రజలెల్లరును వైదిక ధర్మీయులైయుండిరి. పరస్పరము 'నమస్తే' అను పదమునే ప్రయోగించుకొనుచుండిరి ఇప్పుడు మహర్షి దయానందుల కృపవల్ల లోకులు ప్రాచీన వైదిక సిద్ధాంతములను మరల తెలిసికొనసాగినారు. పరస్పరము నమస్తే యొనర్చుకొనుచు గౌరవించుకొనసాగినారు. "నిన్ను గౌరవించుచున్నాను, నిన్ను ఆదరించుచున్నాను" అనునది దీని భావము.

**ఇందిర:-** వేదములందు 'నమస్తే'యొనర్చు కొనుటను గూర్చి కలదా? జై రాంజీకి, జై కృష్ణజీకి, అనుకొనినందువల్ల నష్టమేమి?

**సువర్ణ:-** వేదములందే యేమి? వాల్మీకి రామాయణము, మహాభారతము, ఉపనిషత్తులు, గీత మున్నగు సమస్త గ్రంథములందును 'నమస్తే' అని వ్రాయబడినదియే లభించును. ఎచ్చటను జై రాంజీకి, జై కృష్ణజీకి, జై శివుజీకి, మున్నగు పదములు లేనేలేవు, వైదిక ధర్మీయులగుటవల్ల శ్రీరాముడు శ్రీకృష్ణుడు స్వయముగా ఇతరులకు నమస్తేనే చేసియుండిరి. చూడు చెల్లెమ్మా!

రాముడు, కృష్ణుడు ఉత్పన్నమగుటకు పూర్వము లోకులు పరస్పరము ఎట్లు గౌరవించుకొనుచుండిరని" నిన్నెవరైన యడిగినచో నీవేమి సమాధానమిత్తువు? రాముడుత్పన్నమై దాదాపు పదిలక్షల సంత్సరములైనది. కృష్ణుడుత్పన్నమై దాదాపు ఐదువేల సంవత్సరములైనది. సృష్టిఉత్పన్నమై అనేకకోట్ల సంవత్సరములైనదిగదా! అనగా అది ఉత్పన్నమై 1 3/4అర్బుదముల సంవత్సరములైనది. ఇదంతా సాంప్రదాయ వాదుల కల్పనయేనని నీ కిదివరకు చెప్పియుంటిని. ఇక నీవిప్పుడు జై రాంజీ, జై కృష్ణజీ అన్నందున నష్టమేమని అడుగుచున్నావు. ఒక నష్టమే గాదు, పలు నష్టము లున్నవి. లోకులందు సాంప్రదాయ భావన జాగృతి ఈ ప్రయోగములందు పరస్పర సమ్మాన భావన ఏమియునులేదు. మానవ సమాజమున కొందరు వయస్సులో పెద్దవారు, కొందరు చిన్నవారు, మరికొందరు సమాన వయస్కులై యుందురు. పరస్పరము ఒకరినొకరు కలిసికొనినప్పుడు ఆదరసమ్మాన భావన ప్రకటించుకొనుటను మానవత్వమునకును, సభ్యత్వమునకును 'నమస్తే' ఒక చిహ్నము. ఇట్లు నమస్తే యొనర్చుకొనక జై రాంజీ, జై కృష్ణజీ యనుకొనుట శోభాస్పదముగ నుండదు. నీవు అమ్మమ్మ,నానమ్మ తాతగార్లను, పెద్దమ్మ చిన్నమ్మలు, అత్తమామలు, మున్నగు పెద్దలను దర్శించినప్పుడు వారిసమ్మానములో నీ వే శబ్దము నుచ్చరించెదవు? జై రాంజీ మున్నగు శబ్దములు రామునికి, కృష్ణునకే జయమని తెలుపుచున్నవి. ఇందు వారి సమ్మాన మేమున్నది? నమస్తే యనుటవల్ల నీ ఆదరసత్కార భావములు ప్రకటమగుచున్నవి. ఆదర మనునది చిన్న,పెద్ద, సమానస్కులందరియెడ నుండవలెను. 'నమస్తే' ప్రయోగము వలన చిన్న పెద్దవారందరి యెడ ఆదర మేర్పడినది. దీని ప్రయోగమున మాతా పితరులు, పుత్రీపుత్రులు, భార్యా భర్తలు అందరియెడ ఆదరభావ మేర్పడును.

**ఇందిర:-** రామునికి జయము,కృష్ణునికి జయము అనుటద్వారా రాముని, కృష్ణుని నామమైనా నోటితో ఉచ్చరించుట జరుగునుగదా!

**సువర్ణ:-** కేవలము నామముల నుచ్చరించినంతమాత్రమున వారి ఆదర సమ్మానములగునా? ఉచిత సమయములందు రామకృష్ణుల నామముల

నుచ్చరించుట అనగా రాముడు రావణుని, కృష్ణుడు కంసుని చంపెన్నప్పుడు, లేక రామకృష్ణుల చరిత్రలు వర్ణించునప్పుడు వారి వారి పేర్లతో జయకారముల నుచ్చరించిన సందర్భోచితముగ నుండగలదు.

**ఇందిర:-** ఉత్తమ శబ్దములనుచ్చరించుటకు సందర్భము లెందుకు?

**సువర్ణ:-** ఎంత ఉత్తమ శబ్దములైనను తగిన సమయములందే ఉచ్చరించిన శోభాయమానముగా నుండును "రాం నాం సత్య హై, గోవిందా గో....విందా" అను శబ్దములు ఎంతో సుందరముగ నున్నవి. కాని యవి అన్ని సమయములందు శుభప్రదముగ నుండవు. అన్ని సమయములందును బాగనిపించుచో ఏది? కొంచెము వివాహ సమయములందు ఆ వాక్యముల నుచ్చరించి చూడుము. దాని ఫలిత మెంత భయంకరముగ నుండగలదో అనుభవమునకు రాగలదు. ఆ పవిత్ర శబ్దము నుచ్చరించుటవల్ల నీకెట్టి సత్కారము జరుగగలదో కూడ అనుభవము కాగలదు.

**ఇందిర:-** అందరికిని నమస్తే చేయవచ్చునా? కొడుకు తండ్రికి చేయుట ధర్మమే, కాని తండ్రి కొడుకునకు, తల్లి తన సంతానమునకు , భర్త భార్యకు, పెద్దలు పిన్నలకు నమస్తే యొనర్చుట ఏమి బాగనిపించును?

**సువర్ణ:-** మంచిది, కొడుకు తన తల్లిని ప్రేమించవలెనా, లేదా?

**ఇందిర:-** ఔను. తప్పక ప్రేమించవలెను.

**సువర్ణ:-** తన సోదరిని కూడ ప్రేమించవలెనా, లేదా?

**ఇందిర:-** సోదరిని కూడా ప్రేమించవలెను.

**సువర్ణ:-** తన పుత్రికను కూడా ప్రేమించవలెనా?

**ఇందిర:-** ఔను. ప్రేమించవలెను.

**సువర్ణ:-** తన భార్యను కూడా ప్రేమించవలెను కదా!

**ఇందిర:-** తన భార్యను కూడా తప్పక ప్రేమించవలెను.

**సువర్ణ:-** అందరిని ప్రేమించవలయు ననునది ఏమైన దని నే నడుగుచున్నాను. తల్లి ప్రేమ, సోదరితో ప్రేమ, పుత్రికతో ప్రేమ, భార్యతో ప్రేమ, తండ్రి, కొడుకు, అన్న, తమ్ముడు అందరితో ప్రేమయే ప్రేమ. అందరి కొరకొకే శబ్దము 'అందరిని ప్రేమించవలె' ననునది ఎక్కడి సభ్యత?

ఇందిర:- తల్లి, కూతురు,సోదరి, భార్య మున్నగు వారిని ప్రేమించు భావనలు వేరువేరుగా నుండును.

సువర్ణ:-ఇదే విధముగా 'నమస్తే' యొనర్చునపుడు భావనలందు వేర్వేరు ఉద్దేశ్యము లుండును. తల్లిదండ్రుల ప్రేమయందు శ్రద్ధ ప్రకటమగును. సోదరీసోదరులను ప్రేమించునప్పుడు స్నేహభావము, భార్యను ప్రేమించునప్పుడు ప్రణయ భావము, భగవంతుని ప్రేమించునప్పుడు భక్తి భావన ప్రకట మగు చుండును.

ఇదే విధముగ మాతా పితరులకు నమస్తే చేయునప్పుడు ఆదరణ వెల్లడియగును. పుత్రీపుత్రులకు నమస్తే యొనర్చునప్పుడు ఆశీస్సులు లేక ఆశీర్వాదములు స్పష్టమగును. సమవయస్కులకు నమస్తే యొనర్చుట ప్రేమ, పిల్లలకు నమస్తే యొనర్చుటయందు దయ, ఆశీస్సులు అను భావన యుండును. ఈ భావన లన్నియును, 'నమస్తే' యను శబ్దములో ఇమిడియున్నవి. ఐనను, ఈ సమస్త భావనల ఉద్దేశ్యము ఒక్కటే. శ్రద్ధ, స్నేహము, భక్తి, ప్రణయము, దయ మున్నగు శబ్దము లన్నియును ప్రేమకు రెండవ రూపములే, ప్రతివారిని ఆదరించుట, సత్కరించుటయే యగును. ఇదే విధముగ ఆదరము, సత్కారము, ప్రేమ మున్నగున వన్నియును 'నమస్తే' శబ్దమునకు రెండవ రూపములే.

ఇందిర:- మనుష్యులు మాంసమును తినిన దోష మేమి?

సువర్ణ:- ఈ విషయమును గూర్చి రేపు మాట్లాడుకొందుము.

ఇందిర:- మంచిది అట్లేకానిమ్ము. నమస్తే.



**ఆంగ్లములో 'నమస్తే' అర్థము**

'With all powers of my hands, with all power of my heart and with all power of my head I pay respect to you'.

*Pt. Acharya Ayodhya Prasad*
(Vishwa Dharma Sammelan)
Chicago

# మాంసమును తినవచ్చునా ? లేదా?

(పదునొకండవదినము : ప్రాతఃకాలము.)

**ఇందిర:-** మనుష్యులు మాంసమును తినవలెనా,? వలదా?

**సువర్ణ:-** తినకూడదు.

**ఇందిర:-** ఎందుకు?

**సువర్ణ:-** ఎందుకనగా, మాంసము ప్రాణులను చంపక, వానికి పీడను కలిగించక లభించునది కాదు. తమ స్వార్థము కొరకు అకారణముగ ఇతర ప్రాణుల చంపుట మానవుల ధర్మము కాదు.

**ఇందిర:-** ఈ దృష్టితోనైతే ఎవ్వరును కూరగాయలు, పండ్లు మున్నగు వానిని కూడ తినవలదు. వానియందును జీవము కలదు. వానికి కూడ పీడ కలుగుచున్నది. వనస్పతులందును జీవ మున్నదికదా! వానికి సైతము బాధ కలుగును కదా!

**సువర్ణ:-** మాంసము తినవలెనా, లేదా? యనునది నీ ప్రశ్న, తినవలదని నేను సమాధానమిచ్చితిని. ఇప్పుడిచ్చట వృక్ష వనస్పతులందు జీవుడున్నాడా? లేడా? యనునది ప్రస్తుత ప్రశ్నకాదు. ఇదే నీప్రశ్నయగుచో వేనియందు జీవుడుండునో, వానియందు మాంసముండవలెను. ఐతే, వృక్షములు, వనస్పతులందు తినదగని మాంస మనునది లేదు. చెల్లెమ్మా! ఫలములు, కూరగాయలందు రసమే యుండును. రక్తమాంసము లుండవు. ఎవ్వరును మామిడి మాంసమును తినుము, కమలాఫల రక్తమును త్రాగుము, బొప్పాయి మాంసమును తినుమని యనరు. రసమేదియైనను ఎల్లరును మామిడి రసము, కమలాఫలరసమును తీసికొను మనియే యందురు. అది చెరుకు రసముకాని, సంత్రా రసముకాని రససేవనము వల్ల ఎట్టి దోషమునుండదు. దోషము రక్త మాంసములను తినుట వల్లనే యుండును. ఎచ్చట రక్తమాంసముల సంబంధముండునో అచ్చట ప్రాణులకు దుఃఖము ప్రాప్తించును. ఎచ్చటెచ్చట రసముండునో అచ్చటచ్చట దుఃఖమున కేలాంటి సంబంధముండదు. ఏప్రాణధారి రసమైననుతీసినచో దాని కేలాంటి దుఃఖము గలుగదు. ఎట్లన, గోరసము, అనగా ఆవుపాలు తీసికొనుటవల్ల ఆవున కేలాటి బాధయుండదు.

ఒకవేళ గోవు పొదుగు గోరసముతో నిండి పోయినచో, వానిని పితుకుకొనకున్న పాలను పితుకుకొనుమని ఆవు 'అంబా' యని ప్రేమతో లేగనుగాని, పాలు పితుకువానిని గాని పిలుచుకొనును. కాని ఎచ్చట దాని రక్త మాంసములు తీయుట జరుగునో అచ్చట దానికి దుఃఖము తప్పక కలుగును.

**ఇందిర:-** ఫలములు, కూరగాయలందు మాంసము లెదనుట సరిగా దోచుటలేదు. వానిలో గల గుజ్జు(గువ్వము) వాని మాంసమే గదా!

**సువర్ణ:-** ఫలములు, కూరగాయల గుజ్జును 'మాంస'మని యనినచో మిఠాయివాని గులాబ్‌జామున్, రసగుల్లా, లడ్డూలు కూడ మాంసమేయని అనవచ్చును. ఎందుకన గుజ్జు వానియందును కలదు. కాని గులాబ్ జామున్, రసగుల్లాలను మాంస మని యెవ రందురు? ఎచ్చట రక్త ముండునో, అచ్చటనే మాంస ముండును. రక్తము లేని చోట మాంస మెక్కడిది. వృక్షములు ఫల పుష్పములందు రసమే యుండును కాని రక్త ముండదు. రక్తమే లేనప్పుడు మాంస మెచ్చటినుండి వచ్చును? శరీర ధాతువు లన్నింటిలో మొదటి ధాతువు రసమే. రసముతో రక్తము సిద్ధమగును. రక్తముతో మాంసము, మాంసముతో ఇతరధాతువు లుత్పన్నమగును. నేడు మనము భుజించునది జీర్ణమై మొదట రసముగా మారి ఆ రసమునుండి రక్తము, దానినుండి మాంసము తయారగును. మాంసమనునది మూడవ సోపానము. ఈశ్వర సృష్టియందు ప్రాణుల శరీరములలో రసము ద్వారా సిద్ధమైన రక్తమాంసములను తిని వానిని మరల రసము, రక్త మాంసములుగా మార్చుట యనునది సృష్టిక్రమమునకు విరుద్ధమైనది.

**ఇందిర:-** గ్రుడ్డు తినుటవల్ల ఏలాంటి దోషముండ దనుకొందును. ఏలన, గ్రుడ్డులో రక్తమాంసము లుండవు. రసముండిన నుండవచ్చును.

**సువర్ణ:-** గ్రుడ్డు రజోవీర్యముల సంయోగ పిండమే. పిండమునుండి రక్తమాంసము లుండు మరో ప్రాణియే ఉత్పన్నమగును. స్వార్థపూర్తికై రక్తమాంసముల ప్రాణియొక్క మూలమును నష్టపరచుట మానవ ధర్మమేనా? అట్లెన్నటికి కాదు.

**ఇందిర:-** ప్రపంచమునందు ఏకొద్దిమందినో వదలి మనుష్యులందరును మాంసమును తిందురు .అందువలన మాంసమును భుజించుట గొప్ప దోష మేమి కాదని తోచుచున్నది. దీనివల్ల ప్రకృతి మానవులను మాంసాహారులుగానే సృష్టించిన దని స్పష్టమగుటలేదా?

**సువర్ణ:-** అనేకులు చేయుకార్యమే ఉత్తమమైన దనుట తర్కము కానేకాదు. ప్రపంచములో కల్లలాడువారు అనేకు లున్నారు. సత్యమును పలుకువారు కొద్ది మనుష్యులే గలరని మనము కూడ అబద్ధములాడుట ఉత్తమమైనదేనా? పాపాత్ములు చాలమంది కలరు. పుణ్యాత్ములు ఏ కొద్దిమందియో కలరని పాపాత్ములే మంచివారని ఎవ్వరందురు? ప్రపంచములో గడ్డిగాదమే విశేషముగ నుండును. ఫల పుష్పతరువులు తక్కువ, చందన వృక్షము లింకా తక్కువగా నుండును. పాఠశాలలందు ప్రాథమిక, మాధ్యమిక తరగతులవారికన్న ఉన్నత తరగతుల బాలబాలికలు తక్కువగానే యుందురు. బి.ఏ బాలురు మరీ తక్కువగా, ఏం.ఏ విద్యార్థులు ఇంకా తక్కువగా నుండుకారణమున వారంతా చెడ్డవారేనా? ప్రపంచములో ఉత్తములు, సజ్జనులు, సత్యవాదులు, శ్రేష్ఠపురుషులు అతి తక్కువగానే ఉందురు. చెడు వ్యాపించుటయందు ఏమంత సమయము,కష్టము ఉండదు. మేలు కలిగించుటకు ఎంతో ప్రయత్నమొనర్చవలసియుండును. ఎంతో సమయము కూడ అవసర మగును. మనము ప్రయత్నించకున్నను మన ఉడుపులు మురికిగా మారుటకు పెద్ద సమయమేమి పట్టదు. కాని వానిని ఉతికి శుభ్రమొనర్చుటకు పరిశ్రమయొనర్చవలసియుండును. ఈశ్వరుడు మానవులను మాంసాహారులుగా చేయలేదు. ఈ యలవాటును మనుష్యులు స్వయముగానే చేసికొన్నారు. ఉల్లి పాషాణము, (మహావిషము) నల్లమందు వంటివి తినదగినవియేనా? కాని **మనుష్యులు వానిని సైతము వదులుటలేదు. ఎందరోవానికి అలవాటుపడి** అనేక ఇడుముల బడుచున్నారు. అనేకులాచరించునదే మన మాచరించవలె ననునది ధర్మవిరుద్ధము.

**ఇందిర:-**మనుష్యుడు మాంసాహారి కాడనుట కేదైన ప్రమాణము గలదా?

సువర్ణ:- ఇది మానవుని శరీర నిర్మాణమును చూచినంతనే తెలియగలదు.
మొదటిది:- మనుష్యుల గోళ్లు, మరియు దంతములు మాంసాహారప్రాణుల కున్నట్లు లేవు, మనుష్యుడు మాంసమును కోసి, తరిగి నేయి, కారము, ఉప్పు మసాలాలు కలిపి వండుకొని తననాలుక, మరియు దంతముల కనుకూలముగా చేసికొన యత్నించును. మంసాహార ప్రాణుల గోళ్లు, దంతములు ఇతర ప్రాణులను చంపి చీల్చుకొని తినుట కనుకూలముగ నుండును. వాని నాలుక పచ్చిమాంసపు రుచిని పొందుటకు తగినట్లుండును. కాని మనుష్యున కట్లుండవు.
రెండవది:- మాంసాహర ప్రాణులకు చెమట పట్టదు. మనుష్యులకు చెమటపట్టును.
మూడవది:-మాంసాహార ప్రాణులన్నియును నీటిని గతుకుచు త్రాగును. కాని మనుష్యులు నీటిని గ్రుక్కవేయుచు గటగట త్రాగుదురు.
నాల్గవది:- మాంసాహర ప్రాణుల కన్నులు గుండ్రముగ నుండును. ఇక మనుష్యుని కన్నులు బాదాములవలె పొడుగుగా నుండును. మాంసాహార ప్రాణులు సంతానోత్పాదన క్రియలో పరస్పరము కలిసిపోవునని, పిల్లి, కుక్క, పులి, తోడేలు మున్నగునవి ఇట్టివే నని నేనొక గ్రంథమున చదివియుంటిని. ఇట్లే మనుష్యుడు మాంసాహార ప్రాణుల శ్రేణులలోనివాడు కాడనుటకు అనేక ప్రమాణముల నీయవచ్చును.

**ఇందిర:-** మాంసాహారులు మహావీరులుగా నుందురు. మాంసములో గొప్ప శక్తిగలదని యందురు. మరి మీ యభిప్రాయమేమి?

సువర్ణ:- చాలవరకు మాంసాహారులు దయారహితులు, హంతకులు కాగలుగుదురు. వీరులు మాత్రము కాలేరు. వీరత్వము వేరు, దయా హీనము వేరు. ఇతి హాసములలో లక్షలాది మహావీరు లుండిరని నీ వనగలుగుదువు, కాని అది మాంసగుణముచే కలిగినది కాదు. వాస్తవమున కది శిక్షణ (ట్రైనింగ్) క్రమశిక్షణా సాంగత్య గుణమే. మాంసాహారముతోనే వీరత్వము కలుగగల దనిన ప్రపంచములో అధికాంశమున మాంసమును దినువారున్నారు. వారందరును వీరులు గావలెనుగదా! భారతదేశములో కొందరు హిందువులు, క్రైస్తవులు,ముస్లింలు మాంసమును భుజించెదరు. ఐనను తెగబడుతనము,

కర్కశత్వము, దుస్సాహసము వీరియందున్నంత మరియే వర్గమునందును కానరాదు. వీరత్వమనగానేమి? దేశము, జాతి హితమునకై నిస్వార్థ భావమున అన్యాయమును నాశపరచుటకు రణక్షేత్రమున నిలద్రొక్కుకొనుట, ప్రాణములను సైతము లక్ష్యపెట్టక, వెనుకంజ వేయకుండుట మున్నగునవి వీరత్వ లక్షణములు. ఎవరింటికో నిప్పుపెట్టుట, ఎవరినో దోచుకొనుట, స్వార్థముతో ఇతరులను పొడుచుట, చంపుట, ఎవని ఇల్లాలునో లేపుకొనిపోవుట, అక్కాచెల్లెండ్రవంటి అసహాయులగు స్త్రీలను బలవంతముగా చెరచుట మున్నగువాని పేరేనా వీరత్వము? రౌడీ వెధవలెందరో ఈ విధమగు కృత్యములను చేయుచుండుట జరుగుచున్నది. వీరంతా వీరులేనా? కాదు. వారంతా పాపాత్ములు, అత్యాచారులు.

**ఇందిర:**-మాంసమును తిను మృగములందెంతయో బలముండును. పులి, సింహము, చిరుత, తోడేలు మున్నగు మృగము లెంతో బలము గలవి. పులి ఏనుగును సైతము నిర్జించి చంపగలదు. ఇందువల్ల మాంసమునం దెంతయో శక్తి గలదని తెలియుచున్నది గదా?

**సువర్ణ:**- మాంసము దినని జంతువులు బలము గలవిగా నుండవనియేనా? గోవులు, ఆబోతులు, గుఱ్ఱములు మున్నగు జంతువులు తక్కువబలము గలవేమి కావు. యుద్ధ క్షేత్రములందు ఏనుగులు, గుఱ్ఱములు మున్నగు జంతువులు తమ ప్రాణములను సైతము లక్ష్యపెట్టక వీరత్వమును చక్కగా చూపిన చరిత్ర లున్నవి. మనుష్యులకు వ్యవసాయ, వ్యవహార కర్మలందెంతయో సహకరించు చున్నవి. కాని ఏరణరంగములు, వ్యవసాయ, వాణిజ్య క్షేత్రములందును పులులు, చిరుతలు, సింహము, తోడేళ్ళు మున్నగునవి పనిచేసినట్లు వినియున్నామా? యంత్రము (మిషన్) ల శక్తి పరిమాణమును అశ్వశక్తితో పోల్చెదరేకాని, పులిశక్తితో, సింహముశక్తితో కాదుగదా?పంది ఎంతబలమైనదో తెలియునా? అది పెద్దపులిని కూడా నిర్జించగలదు. రెండు పులుల మధ్య పంది నీళ్లు త్రాగగలదు. కాని రెండు వరాహముల(పందుల) మధ్య పులి నీరు త్రాగుటకు సాహసించదు. పులి ఏనుగుకన్న శక్తివంతమైనదేమి కాదు. అప్పుడప్పుడు మదించిన అడవి ఏనుగు అడవిలో విచ్చలవిడిగా దిరుగుచున్నప్పుడు వన్యమృగములు, పశువులన్నియును భయముతో నల్దిశలకు పారిపోవును. పులి

ఏనుగును తనకోరలు, మరియు పంజా(గోళ్ల)చే స్వాధీన పరచుకొనగలదే కాని శక్తితో గాదు. చూడమ్మా! ఇద్దరు మనుష్యు లున్నారు. ఒకడు శారీరకంగా మహా బలవంతుడు, రెండవవాడు మిక్కిలి బలహీనుడు, కాని ఆ బలహీనుని వద్ద బల్లెము, శూలము, పిస్తోలు, తుపాకీ మున్నగునవి యున్నవి. అప్పుడా శక్తిహీనుడు బలవంతుని యెదుట నిల(ద్రొక్కు)కొనగలడు. ఆబలవంతుని చంపినను చంపగలడు ఎందుకు? వాని వద్ద శస్త్రబల మున్నది. ఒకవేళ ఏనుగునకు కోరలు పంజాగోళ్లుండి వాని కన్నులు చిన్నవిగాకుండినచో ప్రపంచములో ఏనుగు ఏ ప్రాణిని ఉండనీయకుండెడిది. ఏనుగు, ఒంటె,కారెనుపోతులు మున్నగు జంతువులు మాంసమును దినవు. కాని ఎంతో శక్తిగలవిగానున్నవి. వానివద్ద శస్త్రములు లేనందువల్లనే అవి పరాధీనమైపోవుచున్నవి.

నీవు బలమును గూర్చి మాట్లాడుచున్నావు. బలమనునది స్వర్ణము, వెండి, రాగి, కంచు, ఇత్తడి, ఇనుము మున్నగులోహములందు అపరిమితముగ నున్నది. అట్టి శక్తిమణుగుల కొలది మాంసము నందును ఉండదు. అనేకానేక ఓషధులు, వనస్పతు లున్నవి. వాని ఒక్కొక్క మాత్రయం దున్నంత వేడి మరియు శక్తి మాంసమునం దే మున్నది?

**ఇందిర:-** ధాన్యములు పండని దేశములలో అచ్చటి ప్రజలు మాంసము పైననే జీవితమును గడుపుదురు. ఐస్‌లాండ్, మరియు ఉత్తర ధృవ ప్రాంతములందు మాంసముపైననే లోకుల జీవితములు ఆధారపడియుండునని వినియుంటిని, వారికి మాంసమే స్వాభావికాహారము గదా?

**సువర్ణ:-** అక్కడి దేశవాసుల స్వాభావిక భోజనము మాంసమే యగుచో వారు మనుష్యులు గాకుందురు. మానవాకృతి గలవారైయుందురు. ఒకవేళవారు మనవలెనే స్త్రీ పురుషులగుచో కేవలము మాంసాహారు లెట్లగుదురు. ఏలన, మానవుల దంతములు, గోళ్లు మాంసాహరమునకు తగినట్లు ఈశ్వరుడు నిర్మించలేదు. ఐతే వారు మాంసమును దిను అలవాటు చేసికొని యుందురు. మానవు లెచ్చటికి చేరగలుగుదురో, అచ్చటికి ప్రతివస్తువును చేరగలదు. ఒకవేళ అచ్చట ధాన్యముల నుత్పన్న మొనర్చజాల మని యనుకొన్నను అచ్చటి భూమికూడ మానవ జీవితములకు అవసరమగు వస్తువులను సమకూర్చలేక

పోయినను అచ్చట మానవులు నివసించుటయే వ్యర్థము. మాంసాహారమును సమర్థించుటకు నీవిచ్చిన ఉదాహరణము లన్నియును సారహీనములు, మరియు అనావశ్యకములైనవే.

**ఇందిర:-** ప్రంచములో ఆర్థిక సమస్యకూడ ఉన్నదికదా! ధాన్యము సరిపోని స్థలములందు చేపలు, రొయ్యలు, కోళ్లు, మేకలు, కుందేళ్లు మున్నగువానిని పెంచుకొని వాని మాంసము ద్వారా ఆహార సమస్యను కొంతవరకు పరిష్కరించుకొనవచ్చును. అచ్చటి పేదవారి బ్రతుకు తెరువు చేపలు మున్నగు ప్రాణుల మాంసము ద్వారానే పూర్తియగుచుండును. ఒకవేళ మాంసము లభించనిచో ప్రపంచపు ఆర్థిక సమస్యఎంతో గంభీరముగ నుండెడిది.

**సువర్ణ:-** ప్రపంచము నందలి ఏదేశమునైనను చూడుము. ఎప్పుడైనను ఆహారధాన్యముల సమస్యయే ఉత్పన్నమగును. ప్రపంచములో నేడు కూడ ఆహరసమస్యయే ప్రశ్నార్థకంగా నున్నది. పప్పులు, కూరగాయలు, పచ్చళ్లు, ఊరగాయలు, మాంసము మసాలాలు మున్నగువాని ప్రశ్న కానేగాదు. ఏలన, అవియన్నియు రొట్టె, అన్నముతో కలిపి తినునవి మాత్రమే. అవి కేవలము రుచి, ఆనందము కొరకు, నాలుకను సంతోషపెట్టుటకు మాత్రమే. కాని కడుపు నింపుటకు, శక్తి కొరకు మాత్రము కాదు. రొట్టె, అన్నము ముఖ్యమైన ఆహారము. ఇక ఇతర వస్తువు లన్నియును గౌణములు మాత్రమే. శరీర పోషణకు ముఖ్యాధారము రొట్టె, అన్నము మాత్రమే. ఇదియే ఇప్పుడు ప్రపంచములో నున్న ముఖ్యప్రశ్న. ఆర్థిక ప్రశ్న సదా ఆహారమునకు సంబంధించియే యుండును, ఉండగలదు కూడాను.

**ఇందిర:-** మంచిది. మాంసము దినుటకు ముఖ్యమగు అభ్యంతర మేమి?

**సువర్ణ:-** మాంసాహారులు ఈశ్వరభక్తులు కాజాలరు. ఏలన, తామసిక భోజనమువల్ల ఆలోచనలు తామసికముగనే యుండును. సాత్వికముగనుండవు. ప్రపంచములో పరమేశ్వరుని నిజమైన భక్తులెవ్వరును మాంసాహారులు గాకుండిరి. ఒకవేళ మొదట మాంసమును తినుచుండినను తరువాత దానిని వదలివేసియుండిరి. అప్పుడేవారికి అంతరాత్మయందున్న పరమాత్మయొక్క

ఉనికి తెలిసినది. మాంసమును దినువారు ఈశ్వరుని భక్తులు గాజాలరు. ఆడంబరముగా నుందురుదొంగచాటుగ మాంసమును తినుచుందురు. మోసము, అబద్ధము, టక్కరితనము, మున్నగునవి వారియం దుండును. వేషములుమాత్రము గంభీరముగా వేసికొందురు. మాంసాహారులు కానివారు మాత్రమే పాపరహితులై ఈశ్వరుని పొందగలుగుదురు. మొత్తముపై మాంసమును దినుట అత్యంత నిషిద్ధము.

**ఇందిర:-** ఈ సృష్టియంతయు ఈశ్వరుని వల్లనే జరిగినదను విషయము రేపు మాట్లాడుకొందము. నమస్తే.



**ఓ3మ్ దృతే దృగ్ంహ మా మిత్రస్య మా చక్షుషా సర్వాణి**
**భూతాని సమీక్షన్తామ్। మిత్రస్యా z హం చక్షుషా**
**సర్వాణి భూతాని సమీక్షే। మిత్రస్య చక్షుషా సమీక్షా మహే॥**
**(యజుర్వేదం 36-18)**

భావము:- అవిద్యాంధకారమును తొలగించు ఓ జగదీశ్వరా! సకల ప్రాణులు నన్ను మిత్రుని వలె చూచును గాక! నేను కూడా ప్రాణులన్నింటిని మిత్ర దృష్టితో చూచెదను గాక! మేమందరము పరస్పరము స్నేహితులవలె వ్యవహరించు ధృఢ సంకల్పము మాలో కలుగుజేయుము.

# సృష్టియంతయు ఈశ్వర రచనయేనా?

(పంద్రెండవ దినము: ప్రాతఃకాలము)

**ఇందిర:-** అక్కయ్యా! ఈసృష్టియంతయును ఈశ్వర రూపమేనా?

**సువర్ణ:-** కాదు, ఈ ప్రపంచము ప్రకృతి రూపము. ఈశ్వరునికి రూపముండదు.

**ఇందిర:-** గొప్పగొప్ప విద్వాంసులు, ఆచార్యులు, దార్శనికులు ఈ సృష్టియంతయును పరమేశ్వరుని ద్వారానే జరిగిన దందురు. ఈశ్వరుని నుండి ఆకాశము, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము, జలమునుండి పృథివి, ఈ పృథివినుండి అన్నములు, ఓషధులు, అనేక విధములగు ప్రాణు లుత్పన్నమైన వని యందురు. వాస్తవమేనా?

**సువర్ణ:-** వాస్తవము గాదు, ఈశ్వరుడు సృష్టి ఉత్పత్తికి కర్త. కాని స్వయముగా కార్యము గాదు. సృష్ట్యుత్పత్తికి మూడు కారణము లున్నవి. ఈ మూడు అనాది పదార్థములు అనాదులే, ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి ఈమూడు అనాది పదార్థములు. ఈశ్వరుడు నిమిత్త కారణము, ప్రకృతి, ఉపాదాన కారణము, మరియు కాలము, దిశలు మున్నగునవి సాధారణ కారణములు, ఏలన, సృష్టియొక్క సకల కార్యము లందును ఇది సామాన్యమే. నిమిత్తకారణ మనగా ఏదేని వస్తువు చేయుటవల్ల సిద్ధమగును, చేయకున్నకాజాలదు. ఉపాదానకారణ మనగా ఏదియైన ఉన్నప్పుడే ఏవస్తువైన సిద్ధమగును, అదిలేనిచో వస్తువు సిద్ధము కాజాలదు. ఎట్లన, కమసాలి ఆభూషణముల (నగల)ను సిద్ధపరచినాడు. ఇప్పుడీ కార్యమునందు కమసాలికర్త అనగా నిమిత్తకారణ మగును. సువర్ణము ఉపాదానకారణ మైనది. కమసాలి ఆభూషణమును చేయుటవల్లనే ఆభూషణము సిద్ధమైనది. చేయకున్న అది సిద్ధము కాదు. ఇదే విధముగా బంగార మున్నప్పుడే నగలు సిద్ధమగును. లేకున్నకావు. చూడమ్మా! ఈశ్వరుని నుండి ఆకాశముత్పన్నమగుచో ఆకాశమునకు శబ్దగుణ మున్నది. ఈశ్వరుని గుణము శబ్దము కాదు. ఐతే, ఆకాశమునందుశబ్ద మెచ్చటినుండివచ్చినది? కారణ గుణము కార్యనందు అవశ్యముగా నుండవలెను.

బంగారముతో నగలు చేసినప్పుడు బంగారము గుణము ఆభూషణములందు తప్పక వచ్చును. ఇక ఈశ్వరునందు ఏ శబ్దము లేనప్పుడు ఆకాశము నం దెచ్చటినుండి రాగలదు? అభావమునుండి భావము కాజాలదు. కావున ఈశ్వరుని నుండి ఆకాశము కాలేదని ఋజువైనది. ఇదే విధముగా అన్నితత్త్వములను తెలిసికొనుము. ఈతత్త్వము లన్నియు సత్త్వరజస్తమములచే సిద్ధమైనవి మరియు వీనిని నిమిత్త కారణమగు పరమాత్మయే చేసినాడు.

**ఇందిర:-** పరమాత్మ సృష్టినిర్మాణమునందు ప్రకృతియొక్క ఆధారము (ఆశ్రయము) తీసికొనునప్పుడు ప్రకృతిని ఆశ్రయించినవా డగును, ఏలన ప్రకృతి లేనిదే ఆయన విశ్వమును చేయజాలడు గదా!

**సువర్ణ:-** పరమాత్మ ప్రకృతి ఆశ్రయమును పొందదు,కాని ప్రకృతినే ప్రపంచరూపమున ఎవ్వరి సహకారము లేకయే మార్చివేయును. ఆయన తనకార్యమును చేయుటకు ఏ సాధనమునకు లోబడియుండడు. ప్రకృతి సాధనము గాదు. అది కర్మ, దానిపై పరమాత్మయొక్క క్రియా ఫలితముపడును. ఎట్లన, విజయ సరళను తిట్టినదని యనుకొనుము, అప్పుడు విజయ కర్తయగును. సరళ కర్మయగును. తిట్టుట యనునది క్రియ యగును. విజయ సరళను తిట్టుటయందు విజయకు లోబడినదని ఎవరైన అనినప్పుడు అది అజ్ఞానమే యగును. విజయ లేకుండా సరళను కొట్టుట యనునది జరుగునా? ఒకవేళ నేను పరిమళకు పదిరూపాయలిచ్చినా నని అనునప్పుడు ఎవరైన నన్ను "నీవు పరిమళకు రూపాయ లిచ్చుటలో రూపాయలకు లోబడినా"వని యనిన సమంజసముగా నుండునా? రూపాయ లిచ్చుటయందు రూపాయలకు లోబడిపోవుట యెట్లగును. ఉద్దేశ్యమేమన దెబ్బలు తినువాడు లేడు, ఈశ్వరుడు వానిని కొట్టినాడు. తినువాడు లేడు, ఈశ్వరుడు వానికి తినిపించినాడు. ఏడ్చువాడు లేడు, కాని ఈశ్వరుడు వాని నేడ్పించినాడు. ప్రకృతి లేదు. కాని ఈశ్వరుడు ప్రాకృతిక జగన్నిర్మాణము జరిపినాడు. అని యనుట పిచ్చితనము,అజ్ఞానము గాక మరేమగును?

**ఇందిర:-** సృష్టి నిర్మాణమునకు పూర్వము కేవలము ఈశ్వరుడే యుండెను. ఇతర పదార్థ మేదియును లేకుండెను. ఆయన తన కోరికతో

సృష్టినిర్మాణము చేసినా డని నేను వినియుంటిని. వాస్తవమేనా?

**సువర్ణ:-** మంచిది ఈశ్వరుడు సృష్టి నేల చేసినాడు? తనకొరకా? ఇతరులకొరకా? తనకొరకే యనినచో సృష్టి యవసరము ఈశ్వరున కుండెనని తెలియుచున్నది. ఎవనియందు అవసర ముండునో ఆతనిని "పూర్ణు"డని యనలేము ఏలన అవసరము లుండుటయే అపూర్ణు డగుటకు నిదర్శనము ఒకవేళ 'జీవులకొర'కని యనినచో ఈశ్వరునితోబాటు జీవుల ఉనికి గూడ స్వీకరించవలసి యుండును. ఐనప్పుడు "కేవలము ఈశ్వరుడే యుండె" ననుమాట కూడ నిజము కాజాలదు.

**ఇందిర:-** ఆయన తన లీలలను చూపుటకు సృష్టిని రచించినాడు.

**సువర్ణ:-** ఆయన తన లీలల నెవ్వరికి చూపినాడు

**ఇందిర:-** తనకు తానే లీలలను చూపుకొనును .

**సువర్ణ:-** తనకు తానే తన లీలలను ఏల చూపుకొనును?

**ఇందిర:-** తన ఆనందముకొరకు లీలలను చూపుకొనును.

**సువర్ణ:-** ఐతే సృష్టిరూప లీలలను చూపుటకు పూర్వము అతనియందు ఆ ఆనంద ముండెనా,లేదా? ఒకవేళ ఉండె ననినచో లీలను చూపుటతో ఆనంద మేమైనది?లేదనినచో ఆతనియందు లీలయొక్క ఆనందము కొరతగలదని స్వతః సిద్ధియగుచున్నది. ఒకవేళ లీలను చూపినచో సృష్టిరూప లీలయొక్క అవసరము పరమాత్మయందు వృద్ధియైనది. ఇందువల్ల తక్కువ, ఎక్కువల దోషము ఆపాదిల్లుచున్నది. అట్లగునప్పుడు ఆపదార్థము అనాది అనంతము కాజాలదు. ఇక గుణమే అనాది, అనంతము కానప్పుడు గుణియైన ఈశ్వరుడు అనాది అనంతు డెట్లు కాగలుగును?

**ఇందిర:-** మంచిది, లీలను చూపుట 'ఆతని స్వభావమే'యని నేననినచో మీ రేమందురు?

**సువర్ణ:-**అట్లు ఒప్పుకొనుటయందు "రాగము, ద్వేషము, క్షుధ, తృష్ణ భయము, శోకము, సుఖము, దుఃఖము, జననము, మరణము, అన్యాయము, చోరత్వము, బలవంతము, హింస, లజ్జ, వ్యభిచారము మున్నగు సద్గుణ,దుర్గుణము లన్నియును ఈశ్వరుని లీలా ధర్మములే" యని నమ్మవలసివచ్చును. ఏలన

సృష్టిరూప లీలయం దీ విషయము లన్నియును గలవు, ఇక ప్రపంచమున సదాచారము, దురాచారము, పాపము, పుణ్యము, ధర్మము, అధర్మము లను ఏ పదార్థములును ఉండవలదు. ఇవన్నియు పరమాత్మయొక్క స్వభావమునకు అంగములే ఐపోవును. అట్లగునప్పుడు వేదములు, శాస్త్రములు, యమ నియమములు మున్నగు సాధనములన్నియును వ్యర్థమై పోవును. మానవుని ఉద్దేశ్యముకూడ ఏదియు నుండదు. ఈశ్వరుడు తనకు తానే, తన స్వభావముతోనే లీలలను చూపినా డనిన ఎవని ప్రాప్తికై త్యాగము, తపస్సుల నొనర్చవలెను? ఎవ్వరు వానిని చూడవలెను? ఎవ్వరు పాపాత్ములు, ఎవ్వరు పుణ్యాత్ములు, కర్మ యేమిటి? కర్మఫల మేమిటి? సర్వము వ్యర్థమే గదా?

**ఇందిర:-** మంచిది, మీసిద్ధాంతము ననుసరించి పరమాత్మ సృష్టినేల రచించెను?

**సువర్ణ:-** జీవుల కల్యాణము కొరకే పరమాత్మ సృష్టిరచన యొనర్చినాడు. ఆయన న్యాయకారీ, దయాళువు. ఆయన న్యాయ,దయాగుణముల ప్రకాశము సృష్టి రచన ద్వారానే జరుగును. దీనిలో ఆయనకు తన ప్రయోజనమంటూ ఏదియును లేదు. దయ, మరియు న్యాయము చేయుట ఆయన స్వభావము.

**ఇందిర:-** జీవుల కల్యాణము కొరకే పరమాత్మ సృష్టినిర్మాణము చేసినప్పుడు సుఖ దుఃఖములు, మంచిచెడులు వానియం దేల యున్నవి?

**సువర్ణ:-** సృష్టియందు ఏ మంచిచెడులు, సుఖదుఃఖములు మనకు కన్పించుచున్నవో వాస్తవమునకుఅవి జీవుల కర్మల పరిణామముగా కలుగుచున్నవే. అజ్ఞానవశమున సృష్టియందు దుఃఖములను పొందుచుందురు. అట్లుకాకున్న సృష్టియందు చెడులుగాని, దుఃఖములు గాని యుండకపోవును. జీవులు తమ అల్పజ్ఞత్వ కారణమున విపరీత కర్మలనొనర్చి దుఃఖములను పొందుచుందురు. తరువాత పరమాత్మ న్యాయము ననుసరించి అనేక యోనులనుపొందుచుందురు. పరమాత్మ తానుగా ఎవ్వరికిని దుఃఖముల నీయడు. . దుఃఖములకు కారణము అజ్ఞానము మరియు సత్యమును తెలిసికొనకపోవుటయే.

**ఇందిర:-** పరమేశ్వరుడు జీవుని చేయలేదా?

**సువర్ణ:-** జీవులు అనాదులు

**ఇందిర:-** జీవులను,ప్రకృతిని పరమాత్మ చేయనప్పుడు వానిపై ఆయన తన అధికారము నేల చేయును?

**సువర్ణ:-** ఈ ప్రశ్న ఒక పాఠశాలయందలి విద్యార్థులను చూచి అడుగుచున్నట్లున్నది. విద్యార్థులను ఉపాధ్యాయుడు సృష్టించనప్పుడు వారిపై ఆయన అధికారమేల యుండవలె? నన్నట్లున్నది ! ప్రకృతి అజ్ఞము, జీవుడు అల్పజ్ఞుడు పరమాత్మ సర్వజ్ఞుడు. ఐనప్పుడు పాఠశాల విద్యార్థులపై ఉపాధ్యాయుని నియంత్రణము విద్యార్థుల ఉన్నతికి కారణమగునట్లు ప్రకృతి జీవులపై సర్వజ్ఞుని ప్రభావము స్వభావసిద్ధముగానుండును. సృష్టిరూప పాఠశాలయందు జీవులు ఈశ్వరాధీనమై యుండుట జీవుల యున్నతికొరకే, పరమాత్మరూప అధ్యాపకుడు వేదజ్ఞానము ద్వారా జీవులకు లౌకిక, పారలౌకిక ఉన్నతినిగలిగించును.

**ఇందిర:-** జీవులను కూడ పరమాత్మయే చేసినాడని విశ్వసించినచో దోష మేమి?

**సువర్ణ:-** ఇట్లు నమ్మినందువల్ల జీవులకు కర్మస్వాతంత్ర్య ముండదు. రెండవది:- జీవుల మంచిచెడు కర్మల భాద్యత ఈశ్వరుని పైననే యుండగలదు. జీవులు పాపాలకు బాధ్యులుగా నెంచబడరు. ఎందుకన, జీవులను పరమాత్మయే చేసినాడు. మంచి, చెడు కర్మల నొనర్చుటకు వారికి యోగ్యత నిచ్చినాడు . అప్పుడు జీవులు మంచి చెడు కర్మల నొనర్చినచో ఇందు వారిదోష మేముండును?జీవులను సృష్టించుటకు ముందు వారియందు చెడు కర్మల జేయకుండునట్టి యోగ్యతను వారికీయవలసి యుండెను. కావుననే జీవులు అనాదులు,మరియు కర్మలొనర్చుటలో స్వతంత్రులు మరియు పరమాత్ముని న్యాయవ్యవస్థలో కర్మలఫల మనుభవించుటలో పరతంత్రులు

**ఇందిర:-** జీవుడు బ్రహ్మఅంశమేనని కొందరనునది సత్యముకాదా?

**సువర్ణ:-** అంశీ అంశముల భావము అవయవములుగల, అనగా సాకార,మరియు అనిత్య పదార్థములం దుండును. జీవ,బ్రహ్మల తత్త్వములు అనాదులు.

**ఇందిర:-** జీవుడు బ్రహ్మతోనే యైనాడు. చివరకు బ్రహ్మయందే లీనమైపోవు నని కొంద రందురు గదా?

**సువర్ణ:-** ఇట్లు నమ్ముటవల్ల జీవుడు అనాది, మరియు సనాతనుడుగా నుండజాలడు. మట్టిరూప కారణము, ఘటరూప కార్యమునందు లయముకాగలదు. జీవుడు బ్రహ్మకు కార్యము కాదు. ఆయన నిత్యుడు, మరియు స్వతంత్రుడు. నిత్యమైనవాడు తన సత్తాను వదలుకొని దేనియందో ఏల లయమైపోగలడు?

**ఇందిర:-** వాస్తవమునకు జీవుడే బ్రహ్మ, అజ్ఞానవశమున తాను జీవుడ నుకొనుచున్నాడు.

**సువర్ణ:-** దీనివల్ల బ్రహ్మయందును అజ్ఞానము గలదని సిద్ధికాగలదు, బ్రహ్మయే అజ్ఞానవశమున జీవుడగుచో ఇక జీవు డెవరినుండి జ్ఞానమును పొందగలడు? బ్రహ్మనుండైతే పొందలేడు. ఏలన, బ్రహ్మ అజ్ఞానమునందు ఇరుక్కుపోయినాడు కదా?

**ఇందిర:-** బ్రహ్మ జీవుడు గాలేదా? ఐతే చివరకు జీవుడు బ్రహ్మ గాజాలడా?

**సువర్ణ:-** అట్లుఅగు(చేయబడు)వాడు బ్రహ్మ గాజాలడు. బ్రహ్మ చేయబడని వస్తువు. ఇదే విధముగ జీవుడుకూడ చేయబడడు. కావుననే ఈ రెండు వస్తువులును నిత్యములే.

**ఇందిర:-** ఈ ప్రపంచము మిథ్య. బ్రహ్మయే సత్యము. మాయ అనిర్వచనీయమైనది. ఏలన మాయ మూడుకాలములందును ఏకరసముగా నుండదు. కావున దానిని సత్ (సత్యము) అని యనలేము. అసత్ అనియు అనలేము, ఏలన, ప్రపంచములో దాని కార్యములు కన్పించునని కొంద రందురు. మీ యభిప్రాయమేమి?

**సువర్ణ:-** ప్రపంచము సత్ కాని అసత్ కాని కాదు. కాని అనిత్యమైనది. అనగా మార్పుజెందుచుండునది. మాయను 'అనిర్వచనీయ' మని యనువారిని ఈ ప్రశ్న యడుగుము. మాయను ఏదేని ప్రమాణముద్వారా నమ్ముదువా లేక ప్రమాణములేకుండానే నమ్ముదువా? ఒకవేళ ప్రమాణము ద్వారా నమ్మెదవేని

అప్పుడు మాయ ప్రమేయము (ఎరుగదగినది) అగును. ఎందుకని? ప్రమాత (ఎరిగెడివాడు) ప్రమాణ పూర్వకముగా నమ్మినను దాని నిర్వచనమైపోయినది. ప్రమాణము లేకయే నమ్మినచో మాయయున్నదని ఎట్లు తెలిసినది?'' అని యడుగుము. కావుననే 'మాయ' అనగా ప్రకృతి కార్యములు. అవి అనిత్యములు. ప్రకృతి నిత్యమైన వస్తువు.

**ఇందిర:-** కొందరు ఈప్రపంచమంత ఉత్తభ్రమ, నిజమునకు దీనికి ఏలాటి సత్తా(ఉనికి)లేదు. ఎట్లన, త్రాడు పాముగా కన్పించునట్లు, ముత్యపు చిప్ప వెండిగా కనిపించునట్లు బ్రహ్మయందు మాయయున్నట్లు కనపడును. వాస్తవమునకు మాయ లేనేలేదు. త్రాడునందు పాములేదు. ముత్తెపు చిప్పయందు వెండిలేదు. ఐనను భ్రమ కలుగచుండును. ఇదే విధముగ బ్రహ్మయందు మాయయొక్క భ్రమ యున్నట్లుండు నని అందురు. ఇదేమిటి?

**సువర్ణ:-** ఈభ్రమ ఎవ్వరికి కలుగుతుంది? ఈ బ్రహ్మగాక మరొకవస్తు వేదియును లేదా? బ్రహ్మయందు బ్రహ్మకే బ్రహ్మయను భ్రమకలుగుచున్నదా? ఐతే భ్రమ ఎద్దానియందో, ఎద్దానిని గూర్చియో, ఎవ్వరికో కలుగుచున్నది. రెండవది:- భ్రమ సమానవస్తువులందు కలుగును, ఎట్లన, త్రాడునుచూచి సర్పమను భ్రాంతి కలుగగలదు. కాని కుండనుజూచి కాదు. ముత్తెపు చిప్పను చూచి వెండిభ్రమ కలుగగలదు, కాని గులాబిని చూచి కాదు. బ్రహ్మచేతనము, జగము జడమగుటవల్ల అవి సమానమైనవి కావు. భ్రమ ఎట్లు కలగగలదు? బ్రహ్మ నిరాకారుడు. జగత్తు సాకారము బ్రహ్మ నిత్యము, జగత్తు అనిత్యము. బ్రహ్మ సర్వజ్ఞము, జగము అజ్ఞత్వముగలది. కావున భ్రమ యెట్లు కాగలదు?

**ఇందిర:-** బ్రహ్మ గాకపోయినను ఇతరవస్తువులు అగునుగదా!

**సువర్ణ:-** ఇతర వస్తువులు లేకపోయినచో 'బ్రహ్మ'యని ఎచ్చట, ఎవరిని అనుకొనగలము? 'బ్రహ్మ' అనుపదమునకు గొప్ప, పెద్ద అనియర్థము. చిన్నవి లేనప్పుడు 'పెద్దవి యని వేని నందుము? 'చేదు' అనునది లేనప్పుడు తీపి అని దేనినందుము? రెండవది:- బ్రహ్మ ఆత్మ, ఆత్మయను పదమునకు అర్థము వ్యాపకము. వ్యాప్యములేనప్పుడు వ్యాపకమెట్లు కాగలదు?

**ఇందిర:-** అక్కయ్యా! చాల సంతోషము. ఇప్పు డీ విషయములను ఇంతటితోనే ముగించుకొందము. అవకాశముతో మరల ఎప్పుడైనను కలిసికొందము. మీయుక్తులద్వారా బ్రహ్మ,జీవుడు, ప్రకృతి, ఇవి నిత్యములని నమ్మినందువల్ల నా సమస్య లన్నియును విడిపోయినవి. మరొక వాదమేదియును ఈ చిక్కులను విడదీయజాలకపోయెడిది. నీ దయవల్ల, నాశంక (సంశయము) లన్నియును తొలగిపోయి ప్రశాంతత కలిగినది. ఇన్ని దినములనుండి నాకొర కెంతయో ఓర్పుతో నన్ను సమాధానపరచితివి. మీ కెంతయో కృతజ్ఞురాలిని. మీ యీఉపకారమును నాజీవితములో ఎన్నడును మరువను. సాదర నమస్తే. (అని పాదాభివందనమొనర్చును)

**సువర్ణ:-** నమస్తే. దీర్ఘసుమంగళీభవ.

**శమ్ ఇతి ఓమ్.**



**'జీవ బ్రహ్మలు వేరు'**

**వతం విదాథ య z ఇమా జజావ అన్య ద్యుష్మాక మంతరం బభూవ/**
**నీహారేణ ప్రావృతా జల్ప్యా చాసుతృప ఉక్థ శాస శ్చరన్తి॥ (యజు. 17-31)**

ఓ మానవులారా! ఎవడు ఈ బ్రహ్మాండమునంతయు రచించెనో అట్టి ఈశ్వరుని మీరు తెలిసికొనలేదు. అతనికి, మీకు చాల అంతరము (తేడ) కలదు. పొగమంచువంటి గాఢమైన అవిద్యచే కప్పబడిన మీరు జల్పము (వితండవాదము) చేయుచున్నారు. పాండిత్య శబ్దజాలములో పడి తిరుగుచున్నారు.

# శ్రీ లోకా మల్లారిగారి ఇతర రచనలు

**ముద్రితములు**

1. శ్రీ జగదీశ్వర భజనమాల — అలభ్యము
2. జెగ్గని యిద్దె (నవల) పల్లెటూరి భాష
3. సంఘము (నవల)
4. ఆధ్యాత్మిక కిరణాలు (మొదటి భాగము) — అలభ్యము
5. ఒకేమార్గము (రెండవ కూర్పు) — "
6. సత్సంగము " — "
7. ఈశ్వరుడీ సృష్టి నేల రచించెను " — "
8. ఎవని ఆరాధన (ఆరవ కూర్పు) — "
9. వైదిక సుఖజీవనము (రెండవ కూర్పు) — "
10. స్వ.పం. రామచంద్రదెహిల్వీ గారి జీవిత చరిత్ర — "
11. వైదిక సంధ్యాగ్నిహోత్రవిధి (నాల్గవ ముద్రణ) — "
12. మాతా పుత్రికల జ్ఞానచర్చ — "
13. స్వాధ్యాయము
14. శిఖాయజ్ఞోపవీతములు
15. వేదములం దేమున్నది
16. పంచమహాయజ్ఞములు (ప్రతిపదార్థ భావార్థ)
17. అక్కా చెల్లెండ్ర ధార్మిక చర్చ

**అముద్రితములు**

1. యజుర్వేద భాషాభాష్యము — (బృహద్గ్రంథము)
2. సామవేద భాషాభాష్యము — ( " )
3. అథర్వవేద భాషాభాష్యము — ( " )
4. వేదముల యథార్థ స్వరూపము — ( " )
5. ఈశ్వరోపాసన
6. హిందూ ధర్మ విశిష్టతలు
7. గీతాసమాలోచనము
8. శుద్ధ హనుమచ్చరితము
9. సినిమాలా, సర్వనాశనమా?
10. సనాతన ధర్మము
11. భక్తుడు భగవంతుడు
12. ఆధ్యాత్మిక కిరణాలు (రెండవభాగము)
13. అమృత సూక్తులు
14. షడ్దర్శనములం దీశ్వర స్వరూపము

15. కర్మఫలమీమాంస
16. వైదిక సామ్యవాదము
17. జీవాత్మ, పరమాత్మల సంబంధము
18. పరమాత్మ దర్శనము
19. పునర్జన్మము
20. ఉపనిషత్తుల సందేశము
21. ఆత్మ అనంతయాత్ర

అముద్రిత లఘుగ్రంథములు

( ఇందనేక పుస్తకములు వైదిక ధర్మము అను మాస పత్రికలో వెలువడినవి)

1. శాంతికి మార్గము
2. వేదము, ప్రదోషణోపాయము
3. వేదము, దివ్య జీవనము
4. వేదములందు స్త్రీయధికారము
5. వేదమహిమ
6. వేదోక్తజీవాత్మ స్వరూపము
7. వృక్షములు, మనుష్యులు
8. సఫల జీవనమునకు ఆచార్య త్రిశంకునిఐదు సూత్రములు
9. నమస్తే వ్యాఖ్య
10. సోమపానము
11. ఆర్యసమాజము, దానిమాన్యతలు
12. యాజ్ఞికవృష్టి విధానము
13. మధుమేహము - ప్రాకృతిక చికిత్స
14. జీవితమే ఒక కళ
15. నిన్ను నీవు తెలుసుకొనుము
16. సుఖ మెచ్చటినుండి ప్రాప్తించును?
17. గాంధీమహాత్మునిపై ఆర్యసమాజ ఋణము
18. విశ్వప్రేమ
19. శ్రీమన్మహర్షి గౌరవము
20. సాంప్రాదాయమనుపేర ధర్మనిరపేక్షత
21. వైదిక ధర్మవిజయము

## మనవి

దాతలెవ్వరైనను ఇందే పుస్తకమునైనను ముద్రణ, పునర్ముద్రణ చేయించుకొనవచ్చును. కోరినచో ముద్రణ వ్యవస్థ చేయబడును.

# సార్వభౌమ నియమములు

1. సమస్త సత్యవిద్యలకును విద్యవలన తెలియు సకల పదార్థములకును ఆదిమూలము పరమేశ్వరుడు.
2. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళువు, అజన్ముడు, అనంతుడు, నిర్వికారుడు, అనాది, అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్త అతనినే ఉపాసించుట యోగ్యము.
3. వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము వేదమును చదువుట, చదివించుట, వినుట, వినిపించుట ఆర్యులందరి పరమ ధర్మము.
4. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును ఎల్లప్పుడు సిద్ధముగా నుండవలయును.
5. సకల కార్యములను ధర్మానుసారముగా అనగా, సత్యాసత్యములను ఆలోచించి చేయవలయును.
6. ప్రపంచమునకు ఉపకారము అనగా శారీరక, ఆత్మిక మరియు సామాజికోన్నతి చేయుట ఈ సమాజము యొక్క ముఖ్యోద్దేశ్యము.
7. అందరితో ప్రేమ పూర్వకముగ, ధర్మానుసారముగ, యథాయోగ్యముగ వ్యవహరింపవలయును.
8. అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందించవలయును.
9. ప్రతి వ్యక్తియు తన యున్నతితోనే సంతృప్తినొందక అందరి యున్నతిలోనే తనయున్నతి కలదని తలంచవలయును.
10. సమస్త మానవులు సర్వహితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తిహితకరములగు నియమములందు స్వతంత్రులై యుండవలెను.

- మహర్షి దయానంద